నందఱు సమావేశపఱచి జరిగిన విషయము నంతయు నివేదించి స్వామిభక్తి పరాయణులు, శూరవర్యులు నగు సైనికుల నందఱ యుద్ధమునకు సిద్ధముకండని యాజ్ఞాపించెను.

సోమరాజు నాజ్ఞ సుగ్రీవుని యాజ్ఞవంటి దగుటచే విశ్వాస పాత్రులగు నా సైనికులందఱు సంగ్రామమున కాయిత్తులైరి. శుభ ముహూర్తమున తన రాజ్యమును కీర్తివర్మయను తన మంత్రియధీనము గావించి యుచితబల ములతో సోమరాజు కటకమునకు బయలు వెడల సంగ్రామ భేరి మ్రోగించెను.

కటకేశ్వరుఁడు రాయబారుల వలన సోమరాజు కదన మునకు రానున్న యంశము గ్రహించి సాటి రాజన్యులను సాయము రండని లేఖలు వ్రాసి పంపెను. పలువురు రాజులు బలములతో వచ్చి కటకేశ్వరునకు సాయపడిరి. రాను రాను గటకేశ్వరుని బల మమితమయ్యెను. సోమవర్మ సామంతులలోఁ బలువురు స్వామిద్రోహ బుద్ధితోఁ బ్రత్యర్థులై కటకేశ్వరునకు బలములతోఁ దోడ్పడిరి. బల సంపన్నుడైన కటక పరిపాల కుఁడు తనస్థితికి సోమరాజుస్థితికిఁ గల వ్యత్యాసము గ్రహించి తానును వెంటనే విజయ భేరి మ్రోగింప భటుల కాజ్ఞాపించెను. నియతకాలమున నిరువురు రాజన్యులు సంగ్రామము నిశ్చయించి కొనిరి. కటకేశ్వరుని బలమంతయు దుర్గమున సుర క్షితముగ నుండి సంగరము ఘోరముగఁ గావించుచుండ



సోమరాజు సైన్యము విలయమునకు జంకక పగతుర యాయు ధాకుల లెక్కచేయక ముందునకు రాఁదొడంగెను. కొంత సేపటికి సోమరాజు సైనికు లడుగడుగునకు రక్తప్రవాహ ములఁ గల్పించుచుఁ గోటదరిసి ద్వారముల భేదింప సాగిరి. దృఢతరములగు ద్వారములు పగులవయ్యెను. కోటలో నుండి బురుజుల మీఁదనుండి ప్రత్యర్థి సైనికులు ద్విగుణో త్సాహముతో నాయుధములతో సోమరాజు సైనికుల నురు మాడుచుండిరి. దుర్గముననుంటచేఁ గటకేశ్వరుని సైన్యము సుర క్షితముగ నుండెను. నిలువ నీడలేక బహిరంగముగ నున్న సోమ రాజు సైన్యము పలుచ బడెను. అపజయచిహ్నములు సోమ రాజునకు సారె సారెకుఁ గానరాఁ దొడంగెను. హితబృంద మంతయుఁ బ్రత్యర్థులుగా మాఱి కటకేశ్వరునకు సాయ పడెద రని యాతఁడు కలనైన తలంపఁ డయ్యెను. కటకదుర్గము చెక్కుచెదర దయ్యెను. కోటలోని సైనికులు నాళయంత్ర ములు, బల్లెములు చేతఁగొని చుట్టునుమూగియున్న కందారవు సైనికుల నందఱఁ జాలవఱకు నురుమాడిరి. కటకేశ్వరుఁ డొక యున్నతమగు బురుజునెక్కి సంగ్రామము నంతయుఁ బరీక్షించి సోమరాజుదుర్బలస్థితియు సైనికుల వినాశనము నెఱింగి వెంటనే తన సైనికుల నందఱ ద్వారములఁ దెఱచి బయటకు వచ్చి హతశేషమైయున్న ప్రత్యర్థి సైనికుల ముట్ట డింపుడని యాజ్ఞాపించెను. కాలయమునకుఁ దీసిపోని యా

కటకేశ్వరుని భటులు కోటనుండి బయటకువచ్చి యొక్కమాఱు కందార సైనికుల నురుముచేయ సంకల్పించిరి. పరిస్థితు లన్నియు విషమముగా నుండుటయు విజయము ప్రత్యర్థుల యెడఁ గానవచ్చుటయుఁ దలంచి చేయునది లేక సోమరాజు వెంటనే తన సైన్యమును ప్రత్యర్థులు ముట్టడింపక ముందె కందారమునకుఁ బోవ నాజ్ఞాపించి విధిలేక తానును మరలి పోయెను. సోమరాజు సైన్యము మిగుల నిరుత్సాహముతో మఱలి కందారము త్రోవఁబట్టెను. జయాపజయములు దైవాధీనము లనుట యదార్థము. కటకేశ్వరుని సైన్యము మిగుల నుత్సాహముతో బయలు వెడలి వచ్చెను. దుర్గము చుట్టును రాసులు రాసులుగఁ బీనుంగులు నిండిపోయెను. సోమరాజు, నాతని సైన్యము కందారముత్రోవఁ బట్టినటుల గ్రహించి కటకేశ్వరుఁ డానందించి విజయకేతనము నెత్తించెను. కటకేశ్వరుఁడు విజయోత్సవముల మిగుల వైభవముతోఁ గావించి తోడిరాజన్యుల గౌరవించి పంపుచుఁ గొలఁది కాలములోఁ గందారరాజ్యముపైకి దండు వెడలవలయునని యు బలములతో సర్వసిద్ధముగ నుండవలయుననియుఁ బేరు పేరువరుసల సేనానులకుఁ దెల్పి వీడ్కొలిపి తాను సంగ్రామ ప్రయత్నములు గావించుచుండెను.

సోమరాజు హతశేషమగు స్వల్ప బలముతో మిగుల విచారముతో నిజనగరముఁ జేరెను. మంత్రులు, పౌరులు



సోమభూపాలున కెదురేగి నమస్కరించి గతమునకు విచారింప బనిలేదనియుఁ గటకేశ్వరుని వధింప నుపాయముల నరయుద మనియు ననేక విధములఁ దెల్పిరి. వీరపత్నియగు సిరియాల దేవి నాయకున కెదురేఁగి వికసితకుసుమదామము కంఠమున నలంకరించి పాదములఁ గడిగి శిరమునఁ జల్లుకొని "రాజన్యా! గెలుపోడులు మానుషములు కావు. ప్రయత్నమునకు మాత్రము పురుషకారము కావలయును. కంఠమునఁ బ్రాణ మున్నంతవఱకు ద్వేషమును మఱువమేని విజయము సాధించుట దుష్కరకార్యము కాఁజాలదు." అని పౌరుషవాక్యములతో నాయకుని నుద్బోధించెను. సోమరాజు పరాభవ మెఱుఁగని వీరచూడామణి. ఆంధ్రదేశమును శాంతిమంతముగఁ బ్రజా నుకూలముగ ధర్మబద్ధముగఁ బరిపాలించిన ధర్మరాజు. కటకముదరి గడించిన యపజయ మాతని హృదయమర్మముల భేదించెను. రాజమందిరమున చేరినదాది యాతని హృదయ మును నిట్టిదని నిర్వచింపరాని విచారము ముట్టడించెను. బుద్ధి నిలుకడఁ దొలంగెను. ఈయాందోళనములో మునింగి సోమ రాజు రాజ్యస్థితిగతులఁ బరిశీలింప మానెను. ధర్మమూర్తులగు మంత్రులే విశ్వాసముతో రాజ్యపరిపాలనము నెట్టి లోపము లేకుండ జాగరూకతతోఁ గావింపసాగిరి.

సోమరాజు చింతాజ్వర పీడితుఁడై ఆలోచనా సముద్ర మున మునింగి దరితెలియక తన్నుకొనుచుండెను. కందార

రాజ్యమును మున్ముందుఁ బరిపాలింపఁదగిన వంశాంకురమా లేదు. ప్రత్యర్థియా! బలవంతుఁడై హృదయ శల్యమువలెఁ బ్రవర్తించుచున్నాఁడు. ఆందోళనమున స్తబ్ధముగ నున్న యాతనిహృదయము కర్తవ్యము నిర్ణయింప నేరదయ్యెను. కటకేశ్వరుఁ డేనాఁడెత్తివచ్చునో యను యోచన యతని హృదయమును గలఁచివేసెను. సిరియాలదేవి తన వీరోచితోపదేశములచే నాతని చిత్తవృత్తి చాలవఱకు సవరించి మఱల సంగరాభిముఖునిగావింప సహస్రభంగులఁ బ్రయత్నము చేసెను. సోమరాజు వీరపత్ని యుద్బోధనము శిరసావహించి కొంతకాలమున కమితమగు బలమును సమకూర్చుకొని కటకేశ్వరునిపైకి బయలువెడలెను. అంతకుమున్నె కందారమునకుఁ బ్రయాణమగుచున్న కటకేశ్వరుఁడు మార్గమధ్యమునను సోమభూపాలకునిబలములతోఁ బ్రతిఘటించి పోరాడెను. రెండుమాసము లుభయసైన్యములకు సమమగు సంగ్రామము జరిగెను. ఇరువాగులయందుఁ బేరునకెక్కిన వీరులనేకులు నశించిరి. కటకరాజన్యునకు నాహారవస్తువులు, ఆయుధములు, సైనికులు, కావలసినంత ధనము కటకమునుండి వచ్చుచుండెను. సోమరాజున కట్టి సహాయము తటస్థింపదయ్యెను. కందారము మిగుల దూరముగనుంటచే నటనుండి మంత్రులెట్టి సహాయము నాయవస్థలో రాజన్యునకు చేయజాలరైరి. గ్రహచారవశమున సోమరాజు సైన్యమున కాహారవస్తువులైపోయెను.



సైన్యము పలుచబాఱెను. దైవముసైతము ప్రతికూలుఁడై యపజయఫలము చవిచూప నిశ్చయించెను. మఱల సోమరాజు పరాజయము నొందెను.

జలాశయమున మకరీంద్రుని బల మతిశయించినటుల స్థానమహత్త్వముచే కటకేశ్వరుని బలము దినదినాభివృద్ధి యగుచుండెను. సోమరాజు పరాజయముతో గృహముజేరి, సంగ్రామముపై జీవితము నాధారపఱచుకొనుట లాభదాయకము గాదని యనుభవముచే గ్రహించి తన రాజ్యమునందలి ధర్మపురి, మంత్రకూటము, కాళేశ్వరము, లోనగు గ్రామములలోనున్న సర్వశాస్త్రజ్ఞులగు బ్రాహ్మణోత్తముల రావించి వారల నందఱ నుచితవిధి గౌరవించి కటకేశ్వరుఁడు గావించిన గోధనాపహరణమును సవినయముగ విన్నవించి గోధనమును మఱలఁ గొనివచ్చి విరోధిని బంధింపఁగల సత్పుత్త్రుఁ డేపుణ్యకర్మములు గావించిన జనించునో యానతిండని వేఁడుకొనెను. బ్రాహ్మణులు పెద్దయుంబ్రొద్దు యోజించి శాస్త్రములఁ బరిశీలించి తొల్లి దశరథమహారాజు గావించిన పుత్త్రకామేష్టివంటి వ్రతరాజము వేఱులేదని విన్నవించిరి. రాజు మిగుల నానందించి వలయు వస్తుసంభారమునంతయు సంగ్రహించి రాజబంధువులను సామంతులను సర్వజ్ఞులగు బ్రాహ్మణోత్తములను రావించి వ్రతదీక్ష వహించి తన ధర్మపత్నితో యాగవేదిక నలంకరించెను. అగ్నిహోత్రుఁడు సుముఖుఁడై ప్రజ్వలించెను. అను

పాలగంధమై మారుతము వీచెను. భూతవ్రాతము సోమభూపాలుని దీక్షకు దానధర్మములకు మిగుల నానందించి స్వస్తివాచకములు గావించుచుండెను. ఇంత యనరాని వైభవమున వ్రతము ముగిసెను. అనంతరము సమాగతులగు నందఱ నర్హత ననుసరించి సత్కరించి వారి వారి దేశములకుఁ బంపెను. దైవానుగ్రహమున సిరియాలదేవికి నెలమసలెను. పౌరులాశుభవర్తమానము గ్రహించి రాజ్యమున నెడతెగకుండ నుత్సవములు గావించిరి. సోమరాజు మితిలేని సంతసమున ననేక ధర్మకార్యములఁ గావించెను. రాజ్యమునందంతటను శుభచిహ్నములు నిబిడీకృతములై విరాజిల్లెను. శుభప్రదర్శనములచే రాజన్యుఁడు పౌరులు వరాజయచింత దిగనాడి భావ్యభ్యుదయ సూచకమగు రాజకుమార జననమునకై యెదురుచూచుచుండిరి. శుభోదయమునకై యెదురుచూచుచుండుటచే రాజన్యుఁడు, పౌరులు నమాత్యాదులు కటకేశ్వరుని వలన రానున్న విపత్తులను లక్ష్యముఁ జేయజాలరైరి. సమయము నెఱింగి వేఁగులవాండ్రు కందారమునకు భిక్షుకవేషముతోఁ బ్రవేశించి రాజ్యరహస్యములు గ్రహించి కటకమునకేఁగి సైనికుల విశ్రాంతియు రాజ్యమునఁగల శుభోదంతము కందారనాయకుని నిర్భీతవర్తనము తమ యేలికకు నివేదించి ముట్టడికిది మంచిసమయమని ప్రోత్సహించిరి. సంగ్రామ ముహూర్తమునకై యెదురుచూచుచున్న కటకేశ్వరుఁడు మిగుల నానందించి సైన్యములనన్నింటి



నవతికాలమున నాయితము గావించి బలములను సమకూర్చి కందారరాజ్యముపైకిఁ జతురంగ బలములతో దాడివెడలెను. దురదృష్టవశమున నీ వర్తమానము సోమరాజు గ్రహింపఁజాలఁ డయ్యెను. ఆతని బలములన్నియు ననాయత్తములై యుండెను. సంగ్రామమునకుఁ గటకరాజింతస్వల్పకాలములో నెత్తి వచ్చునని యతఁడెఱుంగడు.

ఆకస్మికముగ నేలయీనినట్లున్న కటకేశ్వరుని సైన్యము కందారమును ముట్టడించి విజయదుందుభి మ్రోగించెను. రాజును మంత్రులు తహతహపడి చేయునదిలేక పౌరులలోఁ గొందఱను నగరసంరక్షణమునకు నియోగించి సిద్ధముగ దైవవశమున హస్తగతముగ నున్న కొలఁది సైన్యమునుగొని సంగరమునకుఁ బయనమైరి.

కటకేశ్వరుని బల మమితముగా నుంటవలనను సోమరాజు సంగ్రామము జరుగునని తలంచి యుండక పోవుటవలనను జయాపజయములు క్షణములో బహిర్గత మయ్యెను. కటకేశ్వరుని సైనికులు విచ్చలవిడిగా విజృంభించి బురుజుల కెగఁబ్రాఁకి ద్వారముల భేదించి పగతుర వధించి యనేక సాహస కార్యములు గావింప సాగిరి. సోమభూపాలునకు జయముపై నాస తొలంగెను. చేయునది లేక యంతఃపురమున కేఁగి తన ధర్మపత్నియగు సిరియాల దేవిని సందర్శించి జరుగుచున్న సంగ్రామమును గూర్చిన చరిత్రము నంతయు

నిషేధించి 'వీరపత్నీ! నా కడసారి యానవరిపాలింపు'మని వేఁడు
కొనెను. సిరియాల దేవి భర్తృదైన్యవదనము ఖేద మోదము
ములు తాండవింప సందర్శించి 'విధేయురాలనగు నన్నుఁ
గూర్చి వేఱ యడుగవలయునా! మీ యాజ్ఞ పరిపాలించుటకు
జీవితమునంతయు వ్యయము చేయుదును. ఆన తిం'డని సవినయ
ముగ వేఁడుకొనెను. కొంతసే పా పుణ్యదంపతులు నిశ్శబ్ద
ముగ నూఱకుండిరి. వారి హృదయములు నిస్తరంగ నీరాకర
ములవలె శాంతి తరంగములతో నావరింపబడి భావనా ప్రపం
చమున లీనమయ్యెను. ప్రత్యర్థు లొనరించు విజయభేరి ఝాంకా
రములు స్త్రీయు లొనరించు హాహాకారములు వారి కాసమ
యమున వినఁబడవయ్యెను. ఇంతలో ద్వారమునుండి యొక
వీరుఁ డుచ్చైస్స్వరమున "రాజన్యా! ప్రత్యర్థులు పురమునఁ
బ్రవేశించినారు. మన సైనికు లడ్డుపడుచున్నారు గాని కృతా
ర్థులు కాజాలరు. అంతఃపుర సంరక్షణ మావశ్యకమని మనవిచే
యుటకై యరుదెంచితి" నని పల్కెను. అశనిపాతమునకుఁ
దీసిపోని యావాక్య మిరువురి సంకల్ప సౌధముల నధోగతము
గావించెను. సోమరాజు సిరియాలదేవిని సాదరముగా సంద
ర్శించి 'వీరపత్నీ! నీవు వీరమాతవు కావలయును. దైవాను
గ్రహమున నీ గర్భమునందొక పవిత్ర తేజము ప్రవేశించి
యున్నది. భారతీయాభ్యుదయమున కది మిగులఁ దోడుపడఁ
గలదని ప్రజలేకాక యస్మదాదులు గూడ విశ్వసించి



యున్నారు. ప్రతిపక్షులు కోటలోఁ బ్రవేశించుటకు ముందే
నీవాత్మ సంరక్షణము గావించి కొనుట విధి. అపజయము
కొలఁది కాలములో మనల నావరింప నున్నది. మన నోముల
పంటయగు నీభ్రూణము కాపాడు కొనుట నీవిధి. ముందు నీ
వీయంతఃపురమును దాఁటి విశ్వాసపాత్రులగు భృత్యులఁ
గొని దేశాంతరములు చేరుము. ఏచెట్టుక్రిందనేని తలదాఁచు
కొమ్ము. నీగర్భమున జనించు శిశువు మన కుభయులకే గాక
వంశమున కంతటికిఁ బ్రతిష్ఠ దెచ్చి పరమందుఁ బరాజయ చిం
తతో నధోలోకమునకుఁ జేరనున్న మన యాత్మలకు శాంతి
గూర్చుటకై కటకేశ్వరుని వధింపఁ గలఁడు. ఇది వేద వేదాంగ
విదులగు బ్రహ్మజ్ఞుల వాక్య'మని సోమరాజు తెలిపి యూరక
మాటలాడలేక పోయెను. సిరియాలదేవి హృదయము
తారుమారయ్యెను. శుభచిహ్నముగ భావించి గర్భధా
రణమునుగూర్చి యామె యెంత యానందించెనో
యిపు డంత విచారపడవలసి వచ్చెను. భర్తతో సమానముగఁ
బరము జేర ననుకూలమగు సహగమనము గావించుటకు
నాయమకు స్వాతంత్ర్యము లేదయ్యెను. నిరాశావృత మగు
నాయమహృదయసృష్టికి బాహ్యప్రపంచమంతయు నంధకార
బంధురముగాఁ గానరాఁ దొడంగెను. మాఱుపలుకక సిరి
యాలదేవి కనుల నీరుగార్చుచుఁ దల నేలకు వ్రాల్చి
నిలిచెను. ప్రేమచ్ఛేదనము మిగుల కృపణ కార్యము. దంపతు

లాప్రేమానుబంధము త్రెంచుకొనలేక చాలసేపు పరాధీనహృదయముతో వర్తించిరి. ఇంతలో ద్వారమునఁ బ్రతికూలసైనికుల యట్టహాసములు వినవచ్చుచుండెను.

సోమరాజు సానుకంపముగఁ బ్రియురాలిని సందర్శించి "యువతీమణీ! సంగరరంగమునకుఁ బోవలసిన తరుణ మాసన్నమైనది. విజయముపై నాసలేదు. పగతురచేఁ జనిపోవుట నిశ్చయము. నీ సంతానముకొఱకుఁ బరమందున సైతము నాయాత్మ ప్రతీక్షించుచుండును. సహగమన మాచరింపకుము సుమా!" యనిసంగరరంగమున కుఱుకఁబోయెను. సిరియాలదేవి హృదయము నీరయ్యెను. ఆయమ కనుగొలఁకులనుండి వేడి వేడి యశ్రువులు రాలుచుండెను. పెదవి కంపింపసాగెను. శోకావేశభరమునఁ బ్రియుని గాఢముగఁ గౌఁగిలించుకొని మైమఱచెను. వీరకర్మమున కుఱుకనున్న సోమరాజు కూడఁ జాలసేపు స్తబ్ధుఁడై యూఱకుండెను. తరువాత నంతరాత్మచేఁ బ్రబోధితుఁడై పరవశురాలైన ధర్మపత్నిని మెల్లఁగ వదలి రణరంగము ప్రవేశించెను. సోమరాజు సంగరరంగమునఁ బ్రవేశించుటఁగాంచి ద్విగుణీకృతమగు సాహసముతో భటులు, మంత్రులు, పౌరులు వీరావేశమున ముందునకు దుమికిరి. తిమింగిల సంచలనముచే సముద్ర మాక్షోభించునటులఁ గటకేశ్వరుని సైన్యము సోమభూపాలుని సైన్యముఁ దాకిడిచేఁ గలఁగిపోయెను. అసంఖ్యాక పదాతి పరివేష్టితమగు కటకేశ్వ



రునిబలము నిలుకడతోఁ బ్రతిపక్ష సైనికుల నెదిరించి విజయము నొందుచుండెను. మృత్యుదేవత భయంకర స్వరూపముతో వీరవిహారము గావించుచుఁ గందారసైనికుల నందఱను దన పొట్టనుబెట్టుకొనెను. జయలక్ష్మి యచంచలభావముతో గటకేశ్వరుని కేతనచ్ఛాయ ననుసరించి నటించెను.

అంతఃపురద్వారముచెంత సోమవర్మయుఁ బ్రత్యర్థులు ఘోరసమరము గావించుచుండిరి. సిరియాలదేవి చాలసేపటికిఁ దెప్పరిల్లి భర్తృసందేశము పాలించుటకు సంసిద్ధురాలై పాము కుబుసము వదలినటుల నా గృహమునువదలి విశ్వాసపాత్రులగు నిరువురు భటులను వెంటఁగొని దొడ్డితోవనుండి యాత్మసంరక్షణార్థము వెడలిపోయెను. ప్రాణేశ్వరుని పగతురమధ్య వదలి యాత్మగోపనము గావించుకొనుట దురంతమని యాయమ యెఱుంగనిదికాదు. ప్రతిపదమున బాష్పములు రాల్చుచు బంధురమగు గర్భభారమున మందమందముగ నడచుచు నా ముగుద పోవుచుండెను. ఆయమకు దిక్కులన్నియు నంధకారబంధురముగఁ గానబడెను. అడుగడుగునకు బాదములు తొట్రుపడుచుండెను. ఆగర్భశ్రీమంతురాలగు సిరియాలదేవి ప్రపంచము నెఱుంగని ముగ్ధ; ఎచటికిఁబోవలయును? ఎచటఁ దలఁదాఁచుకొనవలయునని ఘోరమగు ప్రశ్నములు రెండామెహృదయమున బల్లెములవలె నాటుకొనెను. కటకేశ్వరుని ప్రతాపము దిగంతముల నావరించెను.

కటకేశ్వరునకుఁ బ్రబలప్రత్యర్థినియగు నీసిరియాలదేవి నెవరు చేరఁదీసి యవస్థలపాలగుట కియ్యకొందురు? అభిమానమువదలి కటకేశ్వరుని శరణుగోరుట కాయమపవిత్రహృదయ మంగీకరించునా? సత్సంతానార్థియగు సోమరాజుమాత్రము తన ధర్మపత్ని కట్టియాజ్ఞ యొసంగలేదు. సిరియాలదేవికిఁ దలదాచుకొన నెలవు కానరాదయ్యెను. ఎఱుకురాజను పరాక్రమశాలి పరిపాలించు హనుమకొండ కేఁగిన బ్రతుకవచ్చుఁగదా యని పరిచరులను వెంటఁగొని మాఱుత్రోవలఁబట్టి కొలఁదికాలమునకు హనుమకొండఁ జేరెను.

పరిచారకు లిరువురు సిరియాలదేవి నొకపాడువడిన దేవళముచెంత నుంచి తా మెఱుకదేవరాజు చెంత కేఁగి కటకేశ్వరుని దురంతమునంతయు నివేదించి గర్భభారాలస యగు సిరియాలదేవి కాశ్రయము నొసంగవలయునని సహస్రభంగులఁ బ్రార్థించిరి. సహజభీరువగు నెఱుకురాజు కటకేశ్వరుని ధాటికి వెఱచి తన రాజ్యమున నాయమనుంచుకొన వీలుకాదని ఖండితముగ బోధించెను. పరిచారకులు మిగుల దైన్యముగనున్న యామె జీవితచరిత్రము నంతయు నివేదించి ప్రసూతిపర్యంతమైన నిలువనీడ నీరాజ్యమున నొసంగుమని వేఁడికొన విధిలేక సోమరాజువలనఁ దానొందినలాభముల స్మరించికొని యంతఃపురములో నుండ వీలుగాదనియు గ్రామములో నెచటనేని జీవితము గడుపుకొనుచో నభ్యంతరము లేదనియు నట్టకేల



కంగీకరించెను. పరిచారకులు సిరియాలదేవికి జరిగిన వృత్తాంతము నంతయు నివేదించి యామెను బ్రాహ్మణవీధికిఁ జేర్చిరి. గర్భభారమునను గమనాయాసమునను గృశించి నడువలేక నడువలేక నడచుచున్న యాసీమంతిని విప్రవాటికలోఁ బ్రవేశించి బ్రాహ్మణోత్తముల నందఱ వేఱువేఱు సందర్శించి తన దీనచరిత్రమునంతయు నివేదించి పరిచారకురాలిగ నేని యుంచికొని పట్టెఁడన్నముఁ బెట్టుఁడని సవిచారముగఁ బ్రార్థించెను. రాజువలన నెట్టి మాటవచ్చునో యని యెవరు నాయమ కాశ్రయము నొసంగరైరి. కడకు మాధవశర్మయను నొక బ్రాహ్మణుఁడు దయదలంచి యాయమను దన గృహమున జేర్చి గృహిణిచే నాయమ కాహారాదికములఁ గాలానుకూలముగ నొసంగఁ జేయుచు మిగుల ననురాగముతో భక్తివిశ్వాసములతోఁ దానును విచారించుచుండెను.

సిరియాలదేవికష్టము లింతతో నంతరింపలేదు. 'తగిలిన కాలే తగులును, నొగిలినకొంపయే నొగులు' నన్నటుల నాయమ నాపదలు మఱల మఱలఁ జుట్టుముట్టెను. కటకేశ్వరుఁడగు బల్లహుఁడు కందారరాజ్యము నాక్రమించి సోమరాజును తదనుచరులను బంధించి యంతఃపురము ప్రవేశించి రాజ్ఞికొఱకు వెదకెను. ఆయమ గర్భమందు దైవాంశసంభూతుఁ డభివృద్ధి నొందుచున్నట్లును నాతఁడు తన కెన్నఁటికైన మారకుఁడనియు వినియుంటచేఁ గరవాలముతో నాగర్భము ఛేదింపనుంకించి,

యంతఃపురము నంతయు గాలించెను. ఆతనికి నిజవర్తమానము తెలియదయ్యెను. రాణివాసమునందున్న పరిచారికలు ఘోరమగు మరణమునకు నియ్యకొనిరిగాని రాజ్ఞి యుదంతము బహిర్గతము గావింపఁజాలరైరి. కడకుఁ బ్రాణభయమువలననో దురాశవలననో సిరియాలదేవి హనుమకొండ కేఁగినదని కొందఱుపౌరులు నివేదించిరి. విజయకేతనము స్థాపించి కొందఱు సైనికులఁ గందారరాజ్యమున నుంచి రాజ్యము జాగరూకతతో సంరక్షింప నియోగించి, తాను సపరివారముగ సిరియాలదేవి కొఱకై యన్వేషించుచు హనుమకొండకుఁ జేరి పురసమీపమున విడిసి యెఱుకురాజునకు 'మీపురంబున సిరియాలదేవి యున్నటుల రూఢిగాఁ దెలిసినది ఒసంగుదువా! లేక సంగ్రామమునకు వత్తువా!' యని తన భటులచే బల్లహుఁడు వార్త పంపించెను. భయకంపితుఁడై యెఱుకురాజు మిగులఁ జంచలించి సిరియాలదేవిని నేనెఱుంగననియు రాజధాని నగరమున నెటనైనను న్న మీపరిచారకులచే వెదకించి బంధించుచో నా యభ్యంతర మేమాత్రము లేదనియు నేనట్టి ద్రోహకార్యముగావించి యేలికయాగ్రహమునకుఁ బాత్రుఁడఁగాననియు బల్లహునకు వెంటనే వార్తనంపెను.

ఎఱుకరాజు నిర్దోషియనియు సిరియాలదేవికిఁ దనకై తా నాశ్రయము నొసంగి యుండఁడనియు బల్లహుఁడు నిశ్చయించెను. అంతఃపురములో నుండి సంగ్రహించి తెచ్చిన



సిరియాల దేవి ప్రతిచ్ఛందము బల్లహుఁడు తనభటుల కొసంగి 'యిట్టి యాకారవిశేషములు గల యువతీమణి యీపురమున నున్నది. రాజమందిరములు, రచ్చకూటములు, బ్రాహ్మణగృహములు, పఠనమందిరములు పరిశీలించి యెటనేనియున్నచో బట్టితెచ్చిన యెడల గొప్ప పారితోషికము నొసంగుదు'నని బల్లహుఁ డాజ్ఞాపించెను.

ఎఱుకురా జాత్మ సంరక్షణము నాశించి యంతకుమున్నె చనువు నొసంగిన వాఁడగుటచేఁ బ్రతిబింబపటముఁ గొని బల్లహుని భటులు స్వేచ్ఛగ సిరియాలదేవికొఱకు వీథులన్నింటిని గాలించిరి. ఎటఁగూడ వారు తలంచిన కాంతామణి కానరాదయ్యెను. తుదకుభటులు మాధవశర్మ గృహమున బ్రవేశించి యనుమానాస్పదముగనున్నదని సిరియాలదేవిని బంధించి బల్లహునియొద్దకుఁగొనిపోయిరి. భయకంపితురాలై సిరియాలదేవి గడగడ వడఁకుచు విలపించుచుండెను. బ్రాహ్మణవాటికలోని పిన్న పెద్దలందఱు నటఁజేరి యాతరుణి విలాసమును జూచి నిలువున నీరైరి. రాజభటులు నిర్దయులై యామెను రచ్చకీడ్చి లాగికొని పోవుచుండిరి. ఇంతలో ననుష్ఠానవేదిక నుండి లేచి విష్ణుశర్మ ముందునకు వచ్చి రాజభటులఁ జూచి "అక్కటక్కటా! యెందేని యీయన్యాయము కలదా! ఈయమ నాపుత్త్రి. గర్భవతియగుటచే మొన్ననే కొనివచ్చితిమి. బలవంతముగ లాగుకొని పోవుచుంటిరా? మీకు

న్యాయము వలదా?" యని కఠినముగ మందలించెను. నిశ్చేష్ట పోయి చూచుచున్న బ్రాహ్మణాంగన లందఱు బ్రాహ్మణి హింసవలన నీరాజకుటుంబము రూపుమాయ గలదని శపింప సాగిరి. భటులు చెంతఁగల ప్రతిచ్ఛందముతో సిరియాలదేవి యాకృతిని నొకమాఱు పోల్చిచూచి మాఱు మాటాడక యామెను లాగికొని పోవుచుండిరి. ఆగర్భశ్రీమంతురాలు, ఆసన్నప్రసవ—సుకుమారీ మణి, యగు సిరియాలదేవి దుస్థితికిఁ బిల్లలు గలవాఁడును దయాశాలియు నగు మాధవశర్మ మిగుల విచారము నొంది బల్లహుని కంత్య కాలమునకె యిట్టిబుద్ధులు పుట్టుచున్న వనుచుఁ జూచు చున్న బ్రాహ్మణ బ్రాహ్మణీ జనమును వెంటఁగొని యూరిబయట విడిసియున్న బల్లహునిపాలికిఁ బోయెను.

దూరమునుండి బ్రాహ్మణ బృందము సంభ్రమముతో వచ్చువిధముఁ గాంచి బల్లహుఁడు లేచి పూర్వాచారానుగుణముగ వారికెదురేఁగి నమస్కరించెను. మాధవశర్మ యావందనము పరిగ్రహింపక కోపరక్తాక్షుఁడై 'బల్లహ రాజన్యా! నీ యధర్మములు కడుపు లోని చల్ల కదలకుండ ఎఱుకరాజధర్మ పరిపాలనములోనున్న హనుమకొండ పౌరుల పైని గూడఁ బ్రసరింపఁ జేయ వలయునా! ఇంద్రుఁడు లీలావతిని లాగికొని వచ్చునటుల నేపాపము నెఱుంగని నా యేకపుత్త్రికను దుర్మార్గులగు నీభటులు లాగికొని వచ్చు చున్నారు.



గర్భభారాలస యగు నాయను మిగుల విచారము నొందు చున్నది. బ్రాహ్మణబృంద మంతయు నీఘోరకార్యమునకుఁ జింతించుచు నెట్లు గుంపులుగ వచ్చు చుండెనో చూడుము. హృదయము లందఱకు రగులుకొనుచున్నవి. సాధుఘోష తగులక మానదు. దూరము యోచించి కీర్తి ప్రతిష్ఠల నిలువఁ బెట్టుకొని పాపాత్ము లగు భటుల దండించి నాపుత్త్రిక నొసంగుము లేదా మేమందఱము ప్రాయోపవేశము గావించి యిటనే సంఘమరణము నొందుదుము. భారతఖండమున నీ యపకీర్తి చిరస్థాయి కాఁగల దని మేఘ గంభీర స్వరముతో బలికెను. ఇంతలో భటులు సిరియాలదేవిని బల్లహుని చెంత నిల్పి ప్రతిచ్ఛందము నొసంగిరి. బల్లహుని కేమియు దోఁపదయ్యెను. బ్రాహ్మణుల కోపోక్తులు శ్రవణదారణములై చెలంగెను. సిరియాలదేవి శిరమువంచుకొని మొగమున గుడ్డ వైచుకొని విలపించెను. ఆసాధ్వీమణి పాపకర్ముఁడగు బల్లహుని కడకన్నులతోనైనఁ జూడమానెను. బల్లహుఁడు ప్రతిచ్ఛందము లోని యాకృతితో సిరియాలదేవిని బోల్ప వీలుగాదయ్యెను. బ్రాహ్మణుల ఘోష మిన్ను ముట్టెను. నిరుత్తరుఁడై కటకేశ్వరుడు నిలువఁబడెను.

సిరియాలదేవి మిక్కుటముగా విలపించు చుండెను. ఆయమ దీనవదనము బ్రాహ్మణోత్తముల పట్టుదలను మిగుల నభివృద్ధి పఱచెను. బల్లహుఁడు కొంచెము సే పాలోచించి

బ్రాహ్మణుల వాక్యముల భటుల వాక్యముల నాలించి నిశ్చయము తేల్చుకొనజాలక భూసురులం గాంచి 'యీయమను బ్రాహ్మణి యనుచుంటిరిగదా! సమీపముననున్న సిద్ధేశ్వరుని సమ్ముఖమున నీయమ పెట్టునాహారమును భుజించెద రేని మీమాట విశ్వసింతు' ననెను. యుక్తిశాలియగు మాధవశర్మ బల్లహునితో 'రాజన్యా! అది యొక గొప్ప పరీక్ష కాదు. సర్వసిద్ధముగ నున్నారము. కాని యీయమ గర్భవతి. గర్భవతి యొసంగు పక్వపదార్థములఁ బుచ్చుకొనుట బ్రాహ్మణధర్మములకు విరుద్ధము. మతమునకు వ్యతిరేకముగ నడువ వలయునని కూడ మీయభిమతము గాదు గాన యుపాయాంతరము నెఱింగింతు రేని యటులె యొనరింతు' మని విన్నవించెను. శాస్త్రబద్ధముగనున్న మాధవశర్మమాటలకుఁ బ్రత్యుత్తరముఁ జెప్పఁజాలక బల్లహుఁడు కొంచెముసేపు యోచించి యీమె యొసంగు నుచ్ఛిష్టమగు క్షీరమును సిద్ధేశ్వరాలయమున బుచ్చుకొందు రేని బ్రాహ్మణిగాఁ భావించి వదలుట కెట్టి యభ్యంతరము లే' దని తెల్పెను. బ్రాహ్మణులు మిగుల సంతోషించి యనాచార జన్మమగు కిల్బిషమును దమ తపోమహిమచేఁ బోఁగొట్టుకొనవచ్చునని నిశ్చయించి యందుల కియ్యకొనిరి. బల్లహుఁడు చూడకుండ సిరియాలదేవి శిరోవకుంఠనముచే ముఖము నాచ్ఛాదించికొని పదార్థమును బ్రాహ్మణజనమునకు వడ్డించెను. వారలందఱు నిరాటంకముగ నమృత



మస్తని యా పదార్థమును స్వీకరించి సిరియాల దేవితో నిజగృహములకు వెడలిపోయిరి.

బల్లహునిహృదయశల్య మటులనె యుండెను. సిరియాలదేవిగర్భస్థశిశువు తనమారకుఁడని యాతఁడాగతానాగత వేదుల వలన వినియుండెను. అందుచే బల్లహునకు సిరియాలదేవిని గుర్తించి బంధింపలేక పోతినేయను విచారము మెండయ్యెను. రాజభటులు సిరియాలదేవి యీమెయే యని చెప్పుచున్నను బ్రాహ్మణశాపమునకు భయపడి బల్లహుఁడు చేతఁజిక్కిన యువతిని బుద్ధిపూర్వకముగ వదలిపెట్టెను. ఆయమ సిరియాలదేవి యని నిర్ణయించుటకుఁ జాలినన్ని యాధారము లాతనికి లభింపవయ్యెను. మాధవశర్మ తన కూతురనియుఁ బ్రసూతికి వచ్చెననియు బాయిగ్రుద్ది వాదించుచుండ నాయమయే సిరియాలదేవి యని బల్లహుఁడెటుల సాహసించి వాకొనఁ గలఁడు! సిరియాల దేవి బహుశః సహగమనముఁ గావించి యుండు నేమో యనుకొని వెదకి వెదకి వేసారి కొలఁది కాలమునకు బల్లహుఁడు కటకము చేరెను.

పులినోటనుండి లేడికూన బయటఁ బడినటుల దైవవశమున బల్లహునిబారినుండి సిరియాలదేవి బయటఁబడిన వెంటనే మాధవశర్మ యామెను మిగుల సంతోషముతోఁ దమ యింటికిఁ గొనిపోయి యథావిధి సుత నిర్విశేషముగఁ దిలకించుచుండెను. నాటి బ్రాహ్మణులందఱు హర్షించి సహస్ర

హస్తములతో సిరియాలదేవి కుపచారములు గావించు చుండిరి. గ్రహములన్నియు శుభస్థానములయందున్న యొకానొక పవిత్రసమయమున సిరియాలదేవి కొక మగపిన్నవాఁడు జనించెను. మాధవశర్మ మిగులఁ బ్రేమతో జాతకకృత్యములన్నియు నిర్వర్తింపజేసి యొక సుముహూర్తమున నామకరణ మహోత్సవముఁ గావింప సంకల్పించెను. సిరియాలదేవి మాధవశర్మను సందర్శించి వందనమాచరించి, "ఆర్యా! మీరు నాకుఁ బితృసములు. నేను సుతవతినై భర్తృసందేశమును బరిపాలింపఁ గలుగుట మీ యాశీర్వచన ప్రభావముననే. దైవమైనను దేశికుఁడైనను మీరే కావున నాతనయునకు మీ పవిత్ర నామము గలసివచ్చునటుల మాధవవర్మ యని నామకరణము గావింతురేని నామస్మరణము చేతనైనఁ గృతజ్ఞత వెల్లడించు కొందునని సవినయముగ విన్నవించెను. మాధవశర్మ యెట్టకేల కంగీకరించి యుత్తమోత్తములగు బ్రాహ్మణుల రావించి యాకుమారకునకు జాతకర్మలన్నియు విధిచోదితముగ నిర్వర్తించి మాధవవర్మయని నామకరణము గావించి యందఱచే నమోఘాశీర్వాదములం జేయించెను. శుక్లపక్ష శుపాకరుని మాడ్కి యాకుమారుఁడు దినదినప్రవర్ధమానుఁడై యుంటఁ గాంచి పుత్రపుత్రికాశూన్యుఁడగు నా బ్రాహ్మణోత్తముడు మిగుల గారవముతోఁ జూచుచుండెను. దైవానుగ్రహమువలన మాధవశర్మ యమోఘాశీర్వాద ప్రభావమునఁ గుమారుఁడు వర్ధిల్లసాగెను.



మాధవశర్మ కుమారునకు స్వయముగా నైదవయేట నక్షరాభ్యాసముఁ గావించెను. మేధాశాలియగు నాకుమారుఁడు మిగుల బుద్ధికుశలతతో స్వల్పకాలములోనె సర్వశాస్త్రములు పఠించెను. అమోఘ విద్యాధురీణుఁడగు మాధవశర్మ బోధన మహిమచే మాధవవర్మ కొన్నికొన్ని శాస్త్రములలో దేశికునకుసైతము సందేహములు తీర్ప సమర్థుఁడయ్యెను. సమయానుసారముగ గరిడిసాలల కేఁగి లక్ష్య విద్య నేర్చెను. వ్యూహనిర్మాణము, దుర్గభేదనము, కవచధారణము లోనగు సంగ్రామరహస్యములు స్వయముగానే యాతఁడు నేర్చికొనెను. హనుమకొండ పురముననున్న దేవళములలోఁ బద్మాక్షి దేవ్యాలయము ప్రశంసాపాత్రమైనది. పద్మాక్షీదేవి ప్రత్యక్ష దేవత. ఆయమ యనుగ్రహముచే నభీష్టసిద్ధి నొందని పౌరులు లేరు. దూరదేశవాసులు సైత మాయమ యనుగ్రహము నపేక్షించి యాలయప్రాంతమునఁ దపముగావించు నాచార మాకాలమునఁ గలదు. మాధవవర్మ మాధవశర్మవలన నుపదేశమైన మహామంత్రరాజములు పురశ్చరణముఁ గావించుటకై శైలమేఖలయందున్న పద్మాక్షీ నికేతనమున కేఁగి నిత్యముఁ గొంతకాలము కాలక్షేపముఁ జేయుచుండెను. స్థిరసంకల్పము గల మాధవవర్మ యొకనాఁటి సాయంత్రము యథావిధి పద్మాక్షీసముఖమున కొకఁడ యేఁగి ధ్యానమున మైమఱచెను. ఆకసము నిండ మేఘములాక్రమించి భూనభోంతరములు జల

ప్రవాహములతో నిండిపోవునటుల పెద్దవర్షము వచ్చెను. దిక్తటాహము లంధకార బంధురమయ్యెను. మాధవవర్మ యాప్రదర్శనములకు భయపడక నాఁటిరాత్రి యంత్తయుఁ బద్మాక్షీ సమ్ముఖముననే గడువ నిశ్చయించి బీజాక్షరసంయుక్తములగు మహామంత్రముల మేఘరవము శ్రుతిఁజేసికొని పఠింపదొడంగెను. ధ్యాననిశ్చలుఁడగు మాధవవర్మ హృదయస్థిమితమును ప్రళయకాల ఘనాఘన గర్జనములు గాని యేకాంతవాసము గాని భీమాంధకారస్తోమము గాని చలింపఁ జేయ లేకపోయెను.

సమీపమున గుహాలన్నియు జనస్తోమముచే నిబిడీకృతములై యుండెఁగాని స్థిరబుద్ధితోనున్న మాధవవర్మ కాయంశము తెలియదు. తెలిసికొనవలసిన యావశ్యకము సైతము లేదు. ఆవీరుని స్థిరబుద్ధికిమెచ్చి పద్మాక్షీదేవి ప్రత్యక్షమై "కుమారా! నీ తపమున కానందించితిని. నీస్థిరదీక్షకు మెచ్చికొంటిని. నీవు బాల్యమునుండియు బ్రాహ్మణధర్మముల యందాఱితేఱిన మాధవశర్మ గృహమునఁ బెఱిఁగియుంటచే సహజమగు క్షత్రియధర్మములయందు బరిశ్రమ గావింపకున్నాఁడవు. నీజనకుఁడు బల్లహునితోఁ బోరాడి రణరంగమున నిహతుఁడయ్యెను. జననియగు సిరియాలదేవి నానావస్థలకులోనై తన వేకటిని గాపాడుకొని పసివాఁడగు నీక్షేమము నపేక్షించుచుఁ బరులపంచలలోఁ బడియున్నది. స్వరాజ్యమగు కందార



మున కీవేగనర్హుండవు. ఇదిగో ఖడ్గఖేటంబులను స్వీకరింపుము. దివ్యాయుధములగు వీని సహాయముచే నీవు విశాలమగు రాజ్యమును బాలించి పితృరాజ్యమును హరించిన కటకేశ్వరుని వధింపఁగల"వని యానతిచ్చి యంతర్ధానమయ్యెను.

మాధవవర్మ యపరమితానందభరితుఁడై యాఖడ్గఖేటకములఁ బరిగ్రహించి దేవీమూర్తికిఁ బునఃపునఃప్రణామముల నాచరించి యాలయమును వదలి బయటికి వచ్చెను. విశాలాకాశమున నావరించిన జలదములు విచ్చిపోయెను. సోముఁడాకాశమధ్యభాగమునఁ బ్రకాశించుచుండెను. అవ్యక్తస్వరములతోఁ గీటకములు రొదచేయుచుండెను. కల్మషజలముచే నావరింపఁబడిన పల్వలములలోఁ జంద్రునికిరణములు ప్రతిఫలించి యమోఘకాంతి నిస్తంద్రములై యలరారుచుండెను. మనోహరమగు నాప్రకృతిప్రపంచమును సవిమర్శముగఁ దిలకించుచు బద్మాక్షీయనుగ్రహమునకు మిగుల నానందించుచు నట విశ్రమించెను. సమీప గుహాముఖమునుండి మనుష్యసంభాషణము వినవచ్చెను. మాధవవర్మ యదియు బద్మాక్షీమాహాత్మ్యముగా నూహించి యుభయకరములగు నాయుధఖేటకములను గొని యాగుహాముఖమునఁ బ్రవేశించి నలుగెలంకులఁ దిలకించెను. ముందు కొందఱు గుంపుగా గూడియుండిరి. మాధవవర్మ వారినిజూచి "మీరెవరు? ఇటకు రాఁగతమేమి?" యని ప్రశ్నింప వారలందఱు తాము కందార వాస్తవ్యులమనియు సోమదేవుఁడు గతిం

చుటవలనను రాజ్యము శటకేశ్వరుని యధీనమగుట వలనను మిగుల శ్రమలొంది దిక్కుచెడి వలసపోవుచుంటిమనియు, వర్షము వచ్చుటచే నిట విశ్రమించితిమనియు నివేదించిరి. మాధవవర్మ వారు తెలుపు సంశములకు మిగుల నానందించి తన వృత్తాంతము వారలకెఱింగించి వలసపోవ నవసరము లేదనియు స్వల్పకాలమున నేను రానుంటిననియు నంతదనుక మాతృభూమినెటులో కాపురము చేయుఁడని ప్రబోధించెను. నశించినదనుకొనిన రాజవంశము నిలిచినందులకు, రాజకుమారుని పరిపాలనముఁ దాము సుఖముల నొందఁగలిగినందుల కాపౌరు లానందించి బల్లహుని దుష్టపరిపాలనమునుండి విముక్తియగు సుదినముకొఱకు సహస్రభంగులఁ దపముఁ గావించుచు నావార్త సహచరులకు విన్నవింప నిజపురమున కేఁగిరి.

ప్రతాపచరిత్రమున నీయంశ మించుక మార్పుగ నీక్రింది విధముగాఁ గలదు. పద్మాక్షీదేవి ఖడ్గఖేటకంబుల నొసంగి మాధవవర్మను సప్రేమంబుగఁ దిలకించి "కుమారా ఈయాయుధంబులు నీయొద్దనున్నచోఁ బ్రత్యర్థులు నిన్నెదిరింపఁజాలరు. ప్రతిసంగ్రామంబున నీదివ్యాయుధముల సహాయమువలన విజయము చేకూరఁ గలదు. చెంత శ్రీశైలమున నొక గుహ కలదు. అందు నీవు ధైర్యముగఁ బశ్చిమ దిక్కునకుఁ బొమ్ము. మధ్య కలుగు విఘ్నముల నించుకేని పాటిచేయ



కుము. అట నీకుఁ జతురంగ సేనలు లభించును. వాని సహాయముతో ననాయాసముగఁ బ్రతిపక్షుల జయించి రాజ్యాభివృద్ధిఁ గావించుకొనుము. సంపదలు హెచ్చినకొలఁది నడఁకువ వృద్ధిఁ జేసికొనుము. ఔదార్యమును వ్రతముగ గ్రహింపుము. లక్ష్మీనారాయణ పూజయు నుమామహేశ్వర పూజయు గోబ్రాహ్మణ భక్తియు నాచరణీయ ధర్మములు. పరదారాపేక్షయు, నసత్య సంభాషణము వర్జించి యెంతకాలము వర్తింతువో యంతవఱకీదివ్యాయుధములు వాంఛితము లొసంగుచుండు"నని పద్మాక్షీదేవి యానతీయ వెంటనే మాధవవర్మ గుహలోఁ బ్రవేశించెను. ప్రతిభావతి యగు పద్మాక్షీదేవి ప్రభావము వలన మాధవవర్మకా మార్గమంతయుఁ గంటకమయముగఁ గన్పించెను. దానిని పాటిచేయక సాహసముతో ముందడుగు వేసెను. భూతప్రేత పిశాచ శాకినీ ఢాకిన్యాదిగ్రహసముదాయము భయంకరముగ ముందుఁ గనుపించెను. వ్యాఘ్ర సింహ మాతంగ సర్పాదులు మార్గమున నావరించి యున్నటులఁ బొడకట్టెను. గుహాంతరము మాఱు మ్రోగునటుల భయంకర ధ్వానములు సారెసారెకు వినబడెను. ప్రతిపదమున కేదియో భయంకరమగు విఘ్నము తోఁచెను. వీరచూడామణియు ధైర్యశాలియు నిశ్చలచిత్తుడు నగు మాధవవర్మ యంతరాయముల నించుకేని పాటి సేయక యొక జాముసేఁ పాగుహాంతరాళమునఁ బ్రయాణము చేసెను. ముం

ఢాక కలకలము వినవచ్చెను. మఱికొంతదూర మటులె సాహస
ముతోఁ జనుదేర వీరుల సింహనాదములు, గజబృందముల
ఘీంకారములు, తురంగముల హేషలు, కాహళ మృదంగ
భేరీ గోముఖాది వీరాంగనినాదములు ప్రళయకాల కాలాం
భోధర గర్జాసన్నిభంబులై వినఁబడెను. అంతలోఁ దెల్లవా
రెను. దట్టముగఁ గందరమందిరమునఁ బెనగొన్న చీఁకటులు
వలుచఁ బడెను. బాలభానుని రక్తకిరణములు కందరాంతర
మున వసంతముఁ జల్లుచుండెను. మాధవవర్మ యా యుషఃకాల
విభవమును జూచి యానందించుచు మిగుల నుత్సాహముతో
నింకఁ గొంత దూరము నిర్గమించెను.

ఒక విశాలమగు స్థలమున నఱువదివేల మదగజములు,
ఎండ్రెండులక్షల తురంగములు, పదునేడు లక్షల పదాతి
వర్గము మూఁకగ నుండెను. సేనానాయకుఁడు దివ్యాంబరంబు
లతో సువర్ణరాసులతో నిండిన యొక గుహాద్వార
మున శిలపై నాసీనుడై యుండెను. మాధవవర్మ యటకుఁ
బ్రవేశించెను. వెంటనే కరములు ముకుళించి పదాతు
లందఱు మాధవవర్మ కంకితులైరి. సేనానాయకుఁడు నమ
స్కరించి మాధవవర్మను సమీపించి "రాజకుమారా! పద్మా
క్షీదేవి యనుగ్రహమునకై కలకాలమునుండి యిట వేచి
యున్నారము. మా నోములు ఫలించినవి. ఆయమ యాజ్ఞ
యిచ్చిన మాధవవర్మ నీవే కానోపు. ఈ బలమునంతయు



నీ యధీనము గావించుచున్నాఁడను. ధనకనక వస్తువాహన విశే
షంబుల యథావిధి వినియోగించి అనుమకొండలో సామ్రాజ్య
మొండు స్థాపింప వలయు" నని యాతండు తెలిపి యంతర్హితుం
డయ్యెను.

మాధవవర్మ దైవదత్తమగు నీ బలముతో బయలువెడ
లినటుల ప్రతాపచరిత్రమునఁ గలదు. ఇది యమానుషమని
కొందఱు విశ్వసింపరేమో! ఎటులైననేమి పద్మాక్షీదేవి
యనుగ్రహాతిశయమువలన మాధవవర్మకుఁ జతురంగబలము
లభించెను. వెంటనే మాధవవర్మ బయలుదేరి బలములన్నిం
టిని హనుమకొండ గవనియొద్ద నుంచి వారి కాహారాదికము
లకు వలయు నేర్పాటులు గావించి తా నొక్కరుండ గృహ
మున కరిగెను.

కొమారుండు రాత్రినుండి కాన రాకుంటచే సిరియాల
దేవి యేమియుఁ దోఁచక విచారసాగరమున మునింగియుం
డెను. మాధవశర్మయు నాతనిధర్మపత్నియు నాయమకు
హితము నెఱింగించుచుఁ గుమారుండచిరకాలంబున రా
గలండని యోదార్చుచుండిరి. పెంచిన కారణంబున సిరియాల
దేవికంటె వీరిరువురు లోలోనఁ బరితాపమునొందుచుఁ గుమా
రుఁడు రామికి హేతువు లనేకవిధముల నూహింపసాగిరి.
ప్రత్యర్థు లెవరేని బాలుని గడతేర్చిరేమో యను భయ మా
మువ్వురి హృదయములఁ గలఁచి వేయుచుండెను. ప్రపంచ

మంతయు వారికంధకారబంధురముగ శోకభూతమునకు నృత్యా
గారముగఁ గానుపించెను. ఇంతలో మాధవవర్మ యటకుఁ
జనుదెంచి దేవీప్రదత్తములగు ఖడ్గఖేటకముల నొక వేదికపై
నుంచి తల్లికి, మాధవశర్మకు, నాతని ధర్మపత్నికి నమస్కరించి
రాత్రి తాను రాని కారణము తెలిపి పద్మాక్షీదేవి యనుగ్ర
హించిన యాయుధరాజముల వారికింజూపి గతరాత్రి కథాం
శము లన్నియుఁ బూసగ్రుచ్చినటుల వారికి విన్నవించెను.
విద్యుద్వేగమున నీ యంశమంతయు నగరము నలుగెలంకుల
నెగఁబ్రాఁకెను. జనులందఱీ యంశము నాలకించి కుమారుని
శక్తి సామర్థ్యములకు నచ్చెరువొందిరి. క్రమముగ నీవార్త
హనుమకొండ రాజ్యము పరిపాలించు నెఱుకుదేవరాజుచెవి
సోఁకెను. చిరకాలముక్రింద నాయన అనుమకొండకు సిరియాల
దేవి యేతెంచి యాశ్రయము కోరుటయుఁ బిమ్మట బల్లహుండు
దండయాత్ర కరుదెంచి సిరియాలదేవిని వెదకించుటయు
మాత్ర మెఱుఁగునుగాని పుత్రోత్పత్తియు నాపుత్త్రుని
శక్తి సామర్థ్యము వినలేదు. కుమారుని యమోఘశక్తి సామ
ర్థ్యములు వినఁగనే యెఱుకుదేవరాజు హృదయము సంచలిం
చెను. అనుమకొండ రాజ్యమును బడయుటకై దేవిసన్ని
ధిని వరములు పొందివచ్చిన మాధవవర్మను శరణు గోరుట
కంటెఁ దనకు గత్యంతరము లేదని యాతఁడు నిశ్చయించి
కొని కర్తవ్యము నాలోచించు సమయమున నచ్చటికిఁ జారు



లేతెంచి 'నగర ద్వారమున మాధవవర్మయను రాజకుమా
రుఁడు బలములతో విడిసి యున్నాఁడు. నేల యీనినటులఁ
జతురంగ బలములు కాన వచ్చుచున్నవి. ఏలిక కెఱిఁగింపవచ్చితి'
మని విన్నవించిరి. ఎఱుకరా జున్నతమగు హర్మ్యము నెక్కి
గవని యొద్దనున్న బలము నంతయు సందర్శించి దేవతా
వరప్రసాద విజయలక్ష్మీ పరిష్వంగుఁ డగు మాధవవర్మకు
విధేయుఁడై రాజ్యము నొప్పగింప కున్నచో నెంతటి రాజన్యుఁ
డేని మానుషము నిలుపుకొనఁ జాలఁడని నిశ్చయించెను.
గూఢచారులు సత్వరముగ నేతెంచి 'చతురంగ బలములతో
ద్వారముచెంత విడిసిన మాధవవర్మ యను రాజపుత్త్రుండు
భట్టాచార్యుం డగు మాధవశర్మగృహమున కేగెను.
ఏలిక కెఱింగింప వచ్చితి' మని విన్నవించిరి. వెంటనే యెఱుకు
దేవరాజు సర్వబలముల నాయిత పఱచి మంత్రి సామంత
రాజ బంధు పరివృతుండై యుచిత వాహనంబు నెక్కి మాధవ
శర్మగృహమునకుం బయనం బయ్యెను. పౌరు లందఱు
రాజన్యుని ప్రయాణమును గూర్చి పలువిధములఁ దమలోఁ
దాము తలపోయుచుండిరి.

భటులుచూపిన మార్గము ననుసరించి యెఱుకుదేవ
రాజు మాధవశర్మ గృహద్వారమున మదమాతంగమును డిగ్గి
మంత్రి సామంతాదులతో గృహాంతరమున కేగి మాధవ
శర్మను, నాతని ధర్మపత్నిని, సిరియాలదేవిని, గోటిసూర్యప్ర

కాముఁడగు మాధవవర్మను సందర్శించి యట నాసీనుఁడయ్యెను. వైదికాచార పరాయణుఁడగు మాధవశర్మ యెఱుకు దేవరాజు తన గృహమున కరుదెంచుట తలంచి కుమారునకైనను దనకైనను నింతయనరాని సేఁగి మూఁడి తీఱునని నిశ్చయించుకొని దైవసంకల్ప మమోఘము గనుక చేయునది లేదని యనుకొనెను. సిరియాలదేవియు బ్రాహ్మణియుఁ గుమారునకు దైవమెట్టి యాపత్తులఁ గూర్ప సంకల్పించెనో పరిపరి విధముల విచారము నొందుచుండిరి.

ఎఱుకు దేవరాజు దేవీదత్తఖడ్గఖేటకములతోఁ బ్రకాశించు మాధవవర్మను సమీపించి పాదములపై సాష్టాంగ ప్రణామము నాచరించి చేతనున్న వజ్రహారము నాతని కంఠమునవిడి "రాజపుత్రా! పెద్దవాఁడనైతిని. చిరకాలము రాజ్యము పరిపాలించి తనిసితిని. పుత్త్రపుత్త్రికా సంతానము లేమిం జేసి యీరాజ్యము నెవరికి సమర్పింప వలయునాయని కలకాలము నుండి యోచించుచుంటిని. నాకాంక్ష ఫలించెను. అనుమకొండరాజ్యలక్ష్మి యిప్పటికిఁ గృతకృత్యురా లయ్యెను. రాజ్యలక్ష్మి వెదకుకొనుచు నీసన్నిధికిఁ జనుదెంచినది. అనుమకొండ రాజ్యమును వందనపూర్వకముగ నీకు సమర్పించుచున్నాఁడను. దయచేసి పరిగ్రహింపు'మని సహస్రభంగుల వేఁడుకొనెను. మాధవశర్మ యనుమతి ననుసరించి మాధవవర్మ యందుల కంగీకరించి యెఱుకురాజుతో శుభముహూ



ర్తమున మీ యిచ్చచొప్పున రాజ్య పరిగ్రహణము గావింతు నని ప్రత్యుత్తరము నొసంగెను.

వందిమాగధులు స్తవముగావించుచుండ మంగళవాద్యముల ధ్వనులు భూనభోంతరములు నిండి మారుమ్రోయుచుండ భూసురాశీర్వాద పురస్సరముగ మాధవశర్మ నిర్ణయించిన శుభలగ్నమున మాధవవర్మ అనుమకొండ సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. ఎఱుకు దేవరాజు మాధవవర్మకు సమస్తైశ్వర్యములు వశముగావించి దక్షిణకాశియనం దగు నమరావతీ పుణ్యక్షేత్రమునకుఁ దపము గావించుటకై వెడలిపోయెను. పద్మాక్షీ దేవి యొసంగిన సమస్త బలంబులు నెఱుకు దేవరాజొసంగిన బలంబులు కలిపి, రాజ్యము మిగుల నభివృద్ధిలోనికిం దెచ్చి మాధవవర్మ మిగుల జాగరూకతతో బరిపాలించుచుఁ గృతజ్ఞతాసూచకముగ మాధవశర్మకు నాతనిధర్మపత్నికి ధన కనకవస్తువాహనంబులు చీనిచీనాంబరముల నొసంగి యిచ్చవచ్చిన గ్రామముల నగ్రహారముల నొసంగి యుత్తమోత్తములగు మంత్రుల యనుమతి ననుసరించి వర్తించుచుండెను.

రాజ్యవిభవముతోఁ దృప్తినొంది సమస్తైశ్వర్యముల ననుభవించుచు అనుమకొండసామ్రాజ్యమును శత్రుజన భీకరముగఁ బరిపాలించుచున్న తన పుత్త్రరత్నమగు మాధవవర్మను వీక్షించి సిరియాలదేవి సానురాగముగ మాటలా

దుచుఁ "కుమారా! నన్ను వీరమాతయనియనిపించుట ధర్మము. మీజనకుని చెట్టఁబట్టి సమస్తభోగముల ననుభవించి వీరపత్ని ననిపించుకొంటిని. నీవలన వీరమాత నైతినేని కృతార్థురాల నయ్యెద"నని పల్కెను. మాధవవర్మకుఁ దల్లియగు సిరియాల దేవి తెలుపు మాటలలోని భావము బోధకాదయ్యెను. తన ధర్మమునుగూర్చి లోలోనఁ బలుమాఱు యోజించి నిశ్చితాంశము నెఱుంగనేరక మాధవవర్మ స్పష్టముగ నీ యభిప్రాయము నెఱింగింతువేని యవశ్య మొనరింతునని ప్రతిజ్ఞ చేసెను.

సిరియాలదేవి కుమారుని ప్రతిజ్ఞ యాలించి యానంద పరవశయై యిటులఁ జెప్పెను. "పుత్త్రరత్నమా! సర్వభోగ్య సంభరితమగు మనకందారరాజ్యము పరాధీన మగుటచే నిన్ని యిక్కట్టుల పాలైతిమి. ఇపుడు నీకతన పూర్వరాజ్యమును బడయగలుగుదునేని నేను వీరమాతలలో నగ్రగణ్య నగుదును. మనకందార రాజ్యమునకు బల్లహుఁడు పాలకుఁడై వర్తించుచున్నాఁడు. వానిచే నేను మిగులఁ బరాభవింపఁ బడితిని. అక్రమముగ నాతఁడు కచ్చకుఁ గాలుద్రవ్వి యన్యాయముగఁ బశుసమూహమును దొంగిలించుకొని పోవుటయే గాక విభవాస్పదంబైన కందార రాజ్యంబునంతయు విధ్వంసంబు గావించినాఁడు. ముం దుద్భవింపనున్న నాతనయునివలన నెట్టి యిడుమపాటు నొందవలసి వచ్చునోయని యా దురాత్ముఁడు



అనుమకొండ కేతెంచి నాకొఱకై వెదకించి బంధింపఁ బ్రయత్నించెను. పుణ్యశీలురగు నీవీటి బ్రాహ్మణులును దయామయుండగు మాధవశర్మయు నన్ను బ్రతికించి నిన్నీ యాంధ్రదేశమున నొసంగి పరమోపకారంబుఁ గావించిరి. కాన నీయందు రెండుధర్మము లిమిడియున్నవి. ధర్మనిర్వాహణానంతరము గాని నీవు ఋణవిముక్తుఁడవు కాఁజాలవు. పరమోపకారము గావించి చంద్రవంశమును శాశ్వతముగ నిలుపునటుల ననుగ్రహించిన యీ బ్రాహ్మణోత్తము లందఱకు వృత్తిస్వాస్థ్యముల నొసంగి కృతజ్ఞత వెల్లడించుట ప్రధాన కర్తవ్యము. బల్లహుని ఖండించి తద్రక్తముతోఁ బితృతర్పణము గావించి పూర్వాపహృతములగు పశువుల నన్నింటిని గొని తెచ్చి నాకు వీరమాతృనామము నొసంగుట నీ రెండవధర్మము. నీపవిత్రమగు జన్మమువలన నాజీవితము తరించినది. మీ జనకుఁడు బల్లహునిచే వధింపఁబడినటుల జనశ్రుతి కలదు. అదియు నిశ్చయమేని పరముననున్న యాతనియాత్మ కృతార్థత నొందఁగలదు, లేదా సజీవిగ నుండెనేని పుత్త్రసందర్శనముచేఁ గృతార్థుఁడు కాఁగలఁడు" ఇట్లు కుమారునకుఁ దెల్పి యంతఃపురమునకు వెడలిపోయెను.

మాతృసందేశము, తన పూర్వచరిత్రము వినినదాది యుత్సాహ మతిశయించి ప్రత్యర్థిమారణమునకు మాధవవర్మ ప్రయాణము కా నిశ్చయించెను. భటులందఱు సంగ్రా

మమునకు సర్వసిద్ధముగ నుండిరి. బలములన్నియు నాయత్తము
గావింపఁబడియెను. విజయదుందుభులు దిగంతరముల మాఱు
మ్రోగుచుండ నొకానొక శుభముహూర్తమున వీరచూడా
మణియగు మాధవవర్మ పితృతుల్యుఁడగు మాధవశర్మ పెట్టిన
శుభముహూర్తమున విజయయాత్రకుఁ బయన మయ్యెను.
అనుకూల మృదులముగ వీచు పవమాన మా రాజన్యునకు
సుస్వాగతము నొసంగెను. ప్రకృతియంతయు విజయచిహ్న
ముల సూచించుచుండెను. మాతృదేవీదత్తమగు శుభాశీర్వా
దాదికము పరిగ్రహించి పద్మాక్షీ దేవీ ప్రదత్తములగు దివ్యా
యుధములు ధరించి పుణ్యకాంతలు హర్మ్యాగ్రముల నుండి
పుష్పాక్షతలు చల్లుచుండఁ గటకముపైకి సమస్త బలములతో
మాధవవర్మ జైత్రయాత్రకు బయలువెడలెను. సామంతాదు
లందఱు విధేయులై రాజన్యున కెదురేగి యుచితసత్కార
ములుగావించి చతురంగసేనల శక్తికొలఁది సహాయము
గావించిరి. అపరిమితబలముతో బయలువెడలి మాధవవర్మ
కొన్నిమాసములకుఁ బ్రత్యర్థిరాజ్యమగు కటకము చేరెను.
సైనికులందఱు శిబిరముల నెలకొల్పికొనిరి. సేనానాయకులు
సంగరమునకు సర్వసిద్ధముగనుండిరి. కోపతీవ్రముచేఁ బ్రత్యర్థి
సంహరణ దివ్యకాలము కొఱకు నిరీక్షించుచున్న మాధవవర్మ
గూఢచారులవలనఁ గటకరాజ్యపరిస్థితులు, బలాదికములు
రహస్యముగ నెఱింగి వ్యూహాదికముల నిర్ణయించి తెల్లవాఱుస



కోటముట్టడింపవలయునని ప్రధాన సేనానాయకున కాజ్ఞాపించెను.
ఆకస్మికముగ మ్రోగుచున్న జయభేరి నాలకించి బల్లహుఁ డాశ్చ
ర్యమునొంది యెవఁడు తన కోపాగ్ని కాహుతి గానెంచెనో
తెలిసికొందునుగాక యని బల్లహుఁడు బలములనన్నింటిని
నత్క్షణముననే యాయత్తపఱచి ప్రతిపక్షబలముతోఁ బోరు
చేయ నారంభించెను. ఇరువాగులు పోరునకుఁ దలపడెను. మాధవ
వర్మ సైనికులనందఱ కుచితమగు స్థానములనొసంగి యుద్ధనిపు
ణులగు వారికి సేనానాయకత్వమునిచ్చి కోట నలువైపుల
నొక్కమాఱె ముట్టడించెను. బల్లహుఁడు ప్రతిశిబిరమున
కేఁగుచు భటులఁ బరామర్శించుచు నుచితవిధానముల నెఱింగిం
చుచుఁ దనబలమును మిగులఁ బ్రోత్సహించుచుండెను. కాని
బల్లహునకు విజయముపై నాస యెన్నఁడో యంతరించెను.
సంగ్రామప్రయత్నములో నాతఁ డుండకపోవుటచే స్థలాంతర
ములలో నున్న బలమునంతయు రప్పింప వీలు కాదయ్యెను.
ఆహారపదార్థములు సైతము చాలినంతగ లేకుండెను. ప్రతిప
క్షుల సైన్యము లెక్కయిడరానంత విశేషముగ నుండెను.
ఆ సైన్యమునకు రాజెవ్వఁడో, యాతఁ డేరాజ్యమునకుఁ బరిపా
లకుఁడో, నాఁటి విజృంభణమున కేహేతువో బల్లహు డెఱుం
గడు. తీవ్రముగ బల్లహుని సైన్యము మాధవవర్మ సైన్యముతో
గొన్నిమాసములు పోరాడెను. జనసత్త్వములు క్షీణించుట
వలనను ఆహారపదార్థములు కొఱఁతపడుటవలనను చేయునది

లేక పౌరుషము దిగఁద్రావి బల్లహుఁడు మాధవవర్మను శరణు గోరెను. తీవ్రకోపపీడితుఁడగు మాధవవర్మ యాతని బంధించి తాను సోమభూపాలుని తనయుఁడననియు సోమరాజును వంచించినందులకుఁ బశుధనమును దొంగిలించినందులకు, సిరియాలదేవిని బరాభవింప యత్నించినందులకుఁ గందారరాజ్యమును హరించినందులకు నీవెట్టిశిక్షకేని యర్హుఁడవు. క్షమింప వీలులేదుఅనుచు కఠినముగ నివేదించి వీరులగు సేనానులను బిలిపించి పశుధనమునంతయుఁ గోష్ఠములనుండి తోలఁగించి కందారమునకుఁ జేర్పుఁడని యాజ్ఞాపించెను. బల్లహుని సైన్యమంతయు మాధవవర్మ హస్తగతమయ్యెను. దయాభూషణుఁడగు మాధవవర్మ బల్లహునిచేఁ జెఱబెట్టఁబడిన రాజులనందఱ విడిపించి వారల నుచితగౌరవంబుఁతోఁ గందార రాజ్యమునకుఁ గొనిరండని కొందఱు ప్రధానులతోఁ దెల్పి వలయు సైన్యమును సహాయముగఁ బంపెను. మాధవవర్మ విజయస్తంభమును గటకములో నెలకొల్పి నిజపురాభిముఖుఁడై బంధితుండగు బల్లహునితోఁ దదితర రాజన్యులతో బయలుదేరి కొన్నాళ్లు శ్రమనివారణార్థము మధ్యమధ్య నివసించుచు మార్గమధ్యముననున్న రాజులవలన భూస్వాములవలనఁ గప్పములఁ బుచ్చుకొని వారల సామంతులుగఁ జేసికొనుచుఁ బితృస్థలమగు కందారమునకుఁ జేరెను. ప్రధానామాత్యుఁ డంతకు మున్ను బంపినచారులవలన మాధవవర్మ కటకేశ్వరుని సంగ్రామ



రంగమున నిర్జించి జీవగ్రాహిఁగఁజేకొని పశుధనముతో జయలక్ష్మితోఁ బితృరాజ్యమున కేఁగుదెంచు వార్తనాలకించి మాధవశర్మయు సిరియాలదేవియు సంతోషితాంతరంగులై కుమారుని ప్రజ్ఞాదికముల కానందించుచు, నిజనివాసమునుండి బయలువెడలి, కందారమునకు మునుముందె చేరి మాధవవర్మకు సుస్వాగతము నొసంగిరి. వినయముతో మాధవవర్మ సిరియాలదేవికి, మాధవశర్మకు నమస్కరించి విజయాదికము నంతయు నివేదించెను. వారిరువురు తనయు నాశీర్వదించి శుభముహూర్తమునఁ బితృరాజ్యము మాధవవర్మకుఁ బట్టాభిషేకముఁ జేయ నిర్ణయించిరి. పురవాస్తవ్యులు పట్టరాని సంతసముతో సోమరాజుతనయుఁడు మఱల రాజ్యమునకు వచ్చుట శుభసూచకమని సహస్రభంగుల నానందించిరి. సర్వసంపత్సమృద్ధమగు నాకందారపురమును పౌరులు చక్కఁగ నలంకరించి పట్టాభిషేక సుదినమునకై ప్రతీక్షించుచుండిరి. సకాలమునకు బంధోన్ముక్తులగు రాజన్యులగు బశుధనమును జేకొని ప్రధానులు, సైనికులు, కందారరాజ్యమునకు జేరిరి. రాజ్యమునకు సంబంధించిన సర్వగ్రామములనుండి వేదవేదాంగవేత్తలగు బ్రాహ్మణోత్తములు, సంగీత సాహిత్యవేత్తలు, వినోదజ్ఞులు, రాజకార్యధురంధరులు రావింపఁ బడిరి.

సర్వశాస్త్రవేత్త యగు మాధవశర్మ యాగమానుసారముగ మంత్రములఁ బఠించి శాస్త్రోక్తముగ మాధవ

వర్మకుఁ గందారరాజ్యమును బట్టాభిషేకముఁ గావించెను. మాధవవర్మ బంధవిముక్తుఁగు రాజన్యుల నందఱను గౌరవించి యుచితసత్కారములు గావించి శపథముల నిర్ణయించి యెవరి రాజ్యమునకు వారల నంపెను. అందొక రాజన్యుఁడు తన పూర్వనివాసము తెలుపుమన శిరము వంచికొని మాఱు పల్కఁ డయ్యెను. అతనిదీనవదన మందఱకు విచారకరముగ నుండెను. మలినాంబరముతో మాసిన తలతోనున్న యాతని యాకారమును జూచి మున్నతని నెటనో కాంచి యుంటిమని ప్రజలు తలంచిరి. మాధవవర్మ యెన్నివిధముల సగౌరవంబుగఁ బ్రశ్నించుచున్నను నాబంధోన్ముక్తుండు ప్రత్యుత్తరము నొసంగఁ డయ్యెను. ఈయంశము నాలకించి సిరియాలదేవి సభారంగమున కేతెంచి యావ్యక్తిని గాంచి నిలువున నీరై నిలువబడి పోయెను. ఆవ్యక్తియుఁ దన్మయుఁడయ్యెను. కొంతసేపటికి సిరియాలదేవి తెలివిఁ దెచ్చుకొని రాజ్యలక్ష్మీకలితుఁడగు కుమారుని హస్తము గొని యాబంధోన్ముక్తుని పాదములపై వ్రాలి, 'రాజన్యా! అజ్ఞాతను, అనన్యగతికను, దీనురాలను కరుణింపు'మని యతని పాదములపై వ్రాలి యశ్రుజలముచేఁ బ్రక్షాళనము గావించుచు, మాధవవర్మా! ఈమహానీయుఁడె నీజనకుఁడు. కారాగార పరాభవాదికముచే మిగులఁ గృశించి యున్నాఁడు. దైవవశమునఁ దానొందిన దుస్థితినిఁ దలంచుకొని నామ గోపనము గావించుచున్నాఁడని ముక్తకంఠముతోఁ బలికెను. సభ్యులందఱు నిర్విణ్ణులై యా సోమభూపాలకుని కరుణాస్వరూపమును జూచి మిగుల విచారపడిరి. మాధవశర్మ సోమరాజును బరామర్శించి దైవవశమున నెంతవారల కేని యవస్థలు రాక మానవనియు గష్టసుఖములు వెనువెంట ననుభవింపఁ దప్పదనియుఁ దెలుపుచు, సిరియాలదేవి కందారరాజ్యమును వదలినది మొదలు నాఁటివఱకు జరిగిన కథయంతయు నివేదించెను. విచార విస్మయములతో సోమరాజాయంశము నంతయు నాలకించెను. సర్వ మాతని కింద్రజాలము వలె నుండెను. తన ధర్మపత్నిని మరలఁ సందర్శింపఁ గలనని గాని కారాగారమునుండి విముక్తుఁడను గాఁగలనని కాని సోమరాజు తలంచి యుండక పోవుటచే నాతఁ డెంతయో యానందించి తన సుకృతమును దానె ప్రశంసించికొనుచు మాధవశర్మకు నమస్కరించి యర్ధాంగి నాదరించి తనయుని గౌఁగిలించుకొని తన్మయమునఁ జాలసేపు మాటలాడక పోయెను. ఈదృశ్యమునంతయుఁ గాంచుచున్న పౌరులు చిత్తరువులవలె నిలువఁబడిపోయిరి. పాదపీఠముచెంత బంధితుఁడై పడియున్న బల్లహుఁడు దీనస్వరముతో 'సోమరాజా! నీకు మిగుల ద్రోహము గావించితిని. సిరియాలదేవి! నీయెడ మిగుల నపచారము గావించితిని. మాధవ వర్మా! నీ ప్రభావము నెఱుంగక ప్రతిఘటించితిని. నన్ను క్షమించుట కర్తవ్యము. పూర్వ

దురంతములఁ స్మరించి విచారపడు నీదీనునిఁ గనికరించుట కర్తవ్యమని యొక్కపెట్టున వాపోయెను. సోమరాజు బల్లహునిఁ గరుణించి, తనయునిగాంచి 'పుత్త్రికా! యీతనివలన నపరాధంబు గొని యంకితుని గావించుకొని క్షమింపు'మని తెలిపెను. మాధవవర్మ బల్లహునివలనఁ బదుమూఁడుకోట్లు సువర్ణనాణకముల నపరాధముక్రిందఁ గొని యాదాయములో నాలవభాగము నంకముగఁ బ్రతిసంవత్సరము నిచ్చునటుల నాజ్ఞాపించి విడచి పెట్టెను.

మాధవశర్మ రాజకుమారుని జూచి "కుమారా! కలియుగంబున క్షత్రియప్రసాదంబు స్వీకరించుట బ్రాహ్మణులకుం దగదు. బల్లహుని దురితశమనార్థమై మేము సిద్ధేశ్వరాలయమున సిరియాలదేవి యొసంగిన ప్రసాదము స్వీకరించితిమి. ఈ యనాచారదోషము శాంతినొందుటకై మేమందఱము దీర్ఘకాలము జపతపోనియమాదులచేఁ గాలక్షేపము గావింపవలయును. గాన నాజ్ఞయి"మ్మని యడిగెను. బ్రాహ్మణోత్తముల పాదములను బంగరుపళ్లెరములోఁ గడిగి మాధవవర్మ యందఱకు వారి యర్హతానుసారముగ గోదావరీతీరముననున్న రెండువేల గ్రామముల నగ్రహారములుగ నొసంగి యమోఘములగు నాశీర్వాదముల నొందెను. చోళేశ్వరుఁడు మాధవవర్మ పరాక్రమాదికముల నాలకించి తన పుత్త్రిక నొసంగి కొంతరాజ్యమును సమర్పించెను. పితృసందేశమును



మాతృసందేశమును లక్ష్యమునందుంచుకొని మాధవవర్మ యాంధ్రదేశమును జిరకాలము పరిపాలించెను. వీరచూడామణియగు నీమాధవవర్మ చరిత్రము చరిత్రాదులయందు శాసనాద్యాధారములచే నిరూపింపఁ బడనంత మాత్రమున విశ్వసింపమనుట సాహసము. ఈతనిచరిత్రముకొఱకు నిజామురాష్ట్రమున మిగులఁ బరిశోధించుట యావశ్యకము. ఈరాజన్యుఁడు ధర్మబద్ధుఁడై చిరకాలము రాజ్యము పాలించి యనేక మహాకార్యములఁ గావించెను. క్రీస్తుశకము ౨౦౦ ప్రాంతములో నీరాజశిరోమణి యున్నటుల నూహింపవచ్చును.

మహామండలేశ్వరుఁడగు మాధవవర్మ చిరకాలము రాజ్యమేలి యాత్మానురూపులగు తనయులఁబడసెను. అందొక తనయుఁడు చింతగింజలమ్ముకొని జీవించు నొక పేదరాలి తనయుని ప్రమాదవశమున జంపెను. మాధవవర్మ యాయంశము మిగుల జాగరూకతగ విచారించి తనయుఁడు దోషియని తెలిసికొని పుత్త్రవాత్సల్యము దిగఁద్రావి యాతని కురిశిక్ష విధించెను. మల్లేశ్వరస్వామి మాధవవర్మ న్యాయబుద్ధి కానందించి మృతుఁడగు బీదబాలుని రాజపుత్త్రుని బ్రతికించుటయే గాక సువర్ణవర్షము సైతము కురిపించెను. ఈయంశము పండ్రెండవ శతాబమున వల్లకేత భూపాలుండు బెజవాడ మల్లేశ్వరాలయములోని యొక శాసనములో వ్రాయించెను. దీని

వలన మాధవవర్మ యెంత న్యాయశీలుఁడో ధర్మస్వరూపుఁడో తెలిసికొనవచ్చును. మాధవవర్మ గతించి చిరకాలమైనను నాతని కీర్తి నేఁటికి శాశ్వతముగ నున్నది. ఆంధ్రరత్నమగు నీరాజన్యుని చరిత్రము ప్రశంసాపాత్రము.

(కొందఱు మాధవవర్మ బల్లహుని వధించి యాతని తనయునకు రాజ్యము నొసంగెననియు సోమరాజు బల్లహునిచే వధింపఁబడెననియుఁ జెప్పుచున్నారు. అంతకంటె యుక్తియుక్తముగ నుంటచే నీకథ నిట నుదహరించితిమి. వీరశిరోమణియగు మాధవవర్మ జీవితము మనకందఱకుఁ బఠనీయమని యాంధ్ర సోదరులకు విన్నవించుచున్నారము.)

---

# విష్ణువర్ధనుఁడు.

ఆంధ్రవీరులలోఁ జాళుక్యులు మిగులఁ బ్రసిద్ధులు. వీరల నామము దేశచరిత్రములయందుఁ జిరకాలమునుండి వినఁబడుచున్నది. మనచరిత్రకారులు విషయసుబోధమునకుఁగాను రాజమహేంద్రవరప్రాంతము పాలించినవారిని దూర్పుచాళుక్యులనియు నిజాంరాష్ట్రమునందలి కుంతలదేశమును పాలించినవారిని బశ్చిమచాళుక్యులనియుఁ బేరిడిరి. మనమిపుడు చదువబోవు ప్రసిద్ధపురుషుఁడును వీరోత్తంసుఁడునగు విష్ణువర్ధనమహారాజీ యుభయవంశజులకు మూలపురుషుఁడు. చాళుక్యరాజుల చరిత్రములలో నీయనఘుని జీవితచరిత్రము మేలుబంతిగా నున్నది.

చాళుక్యుల జన్మాదికములను గూర్చి యనేకకథలుగలవు. గ్రంథములందు శాసనములందును జాళుక్యులు చంద్రవంశక్షత్రియులుగాఁ జెప్పబడిరి. బ్రహ్మదేవుఁ డొకనాఁడు వేరొలగమున నుండఁగా నచటకు సురపరివృతుఁడగు దేవేంద్రుఁడరుదెంచి యుచితసత్కారములొంది యాసనాసీనుడై 'వాణీవల్లభా! కలియుగమాహాత్మ్యమునఁగ ఁబోలు ధర్మము సన్నగిల్లినది. మనుజులు యజ్ఞయాగాదిక్రతువులు చేయుటలేదు. ప్రజలను ధర్మమార్గమునఁ ద్రిప్పఁగల రాజును సృజింపు'మని వేఁడుకొనెను. బ్రహ్మ యందుల కంగీకరించి ఇంద్రుని బంపి

వేసెను. ఉత్తముఁడగు రాజును సృజింపవలయునను నాందోళనములోనుండి బ్రహ్మ అర్ఘ్యమిడుటకై జలము పైకెత్తగా నతని చులుకము (పుడిసిలి)నుండి తేజస్సంపన్నుఁడు వీరవతంసుఁడునగు నొకమహాపురుషుఁ డుద్భవమయ్యెను. ఆవీరుఁడు బ్రహ్మనుజూచి 'నన్నేల సృజించినాడవు? నాకర్తవ్యమేది?' యని యడుగఁగా 'నీవు చులుకమునందు జనించితివిగావున చాళుక్యుఁడవు. ధర్మము దప్పనీయక ప్రజలఁ బాలించి యుత్తమక్షత్రియవంశమునకుఁ గీర్తిపుగ'మ్మని యాశీర్వదించి వానిని భూలోకమునకుఁ బంపెను. తరువాత చాళుక్యుఁడు తపస్సంపదచేఁ గొప్పశక్తిగడించి రాజ్యము స్థాపించెను. ఈయన రాజధాని యయోధ్య. ఈయనవంశమున మిగులఁ బ్రసిద్ధులగు హారీతుఁడు, మానవ్యుఁడు అను నిద్దరు వీరులు జనించిరి. తరువాత నీవంశీయులలోఁ గొందరు దక్షిణాపథమునకు వచ్చి స్వతంత్ర రాజ్యములు స్థాపించి యార్షమతము నుద్ధరించిరి. ఈ చాళుక్యులను మానవ్యసగోత్రులని వ్యవహరించుచున్నారు.

దక్షిణాపథమునఁ బ్రసిద్ధుఁడై యున్న విజయాదిత్యుఁడను చాళుక్యరాజు అపరిమిత సైనికబలముతో దండయాత్రకు బయలువెడలి త్రిలోచనపల్లవుఁడను సుప్రసిద్ధనృపాలుని రాజ్యమును హరింపనెంచి చిరకాలము యుద్ధముగావించెను. పరాక్రమశాలియగు త్రిలోచనపల్లవుఁడు ఆకాలమునఁ బ్రసిద్ధులగు పల్లవరాజులను సహాయముగాఁ దీసికొని విజయాదిత్యు



నితో నెలలతరబడి పోరాడి యాతని మడియించెను. సైనికులందఱు రాజుపడుటఁజూచి చెల్లాచెదరైపోయిరి. విజయాదిత్యుని పట్టపుభార్య యీ సమయమున గర్భవతిగానుండెను. స్వార్థపరాయణులగు సైనికులు భటులు తమత్రోవను దామేఁగుటచే రాణి దిక్కుమాలినదై విరోధిరాజులచేఁ బట్టువడిన నాపద కలుగునేమోయని చాల విచారపడెను. గర్భవతిగానుంటచేఁ జాళుక్యవంశాంకురమును దగ్ధముచేసి సహగమనము గావించుట కంగీకరింపకపోయెను. త్రిలోచనపల్లవుని ధాటికి వెఱచి రాజమహిషి కెవరును తావొసంగరైరి. విశ్వాసపాత్రురాండ్రగు పరిచారికలు, పురోహితుఁడు జాగరూకతగా రాజపత్నిని గాపాడి శిబిరమునుండి యర్ధరాత్రిమున నామెను వెంటనిడికొని మహారణ్యమునకుఁ జేరి కొన్నిదినములకు ముదివేము అను నగ్రహారమునకుఁ జేర్చిరి. అగ్రహారాధిపతి పేరు విష్ణువర్ధనభట్టారకుఁడు. సమస్తశాస్త్రపారంగతుఁడు. అతిథిపూజాపరాయణుఁడగు నీ బ్రాహ్మణుఁడు తన యగ్రహారమునకు వచ్చిన నూతనుల నందఱను గృహమునకు రావించి యాతిథ్యమొసంగి సత్కరించెను. చాళుక్యపురోహితుఁడగు బ్రాహ్మణుఁడు విష్ణువర్ధన భట్టారకునితో నేకాంతమునఁ జాళుక్యవంశమునకుఁ గలిగిన విప్లవము, విజయాదిత్యుని యకాలమరణము నివేదించి రాజపత్ని నాయనపాదములపైఁ బడవేసి చాళుక్యవంశాంకురమును గర్భమున ధరించిన యీసాధ్విని గాపాడుమని

వేఁడుకొనెను. విజయాదిత్యుని, నాతని ధర్మపత్నిని స్వయముగా నెరింగినవాఁడు కాన విష్ణువర్ధనుఁడు గతమునకుఁ జింతించి రాజపత్నిని నోదార్చి పుత్త్రికాభావముతోఁ బ్రేమింతునని వాగ్దానము గావించి రాజపత్నిని తనయింట నుంచికొని వేయికనులతోఁ గాపాడుచుండెను.

విష్ణువర్ధన భట్టారకుఁడు సమయోచితములగు పురాణకథాదికముచే భర్తృచింతయంతయు రాజపత్నికి మఱపునకు వచ్చునటులఁ జేసి వీరమాతవు గమ్మని యాశీర్వదించెను. నవమాసములు నిండినపిమ్మట నొక శుభ ముహూర్తమున రాజపత్ని తేజోవంతుఁడును, రూపవంతుఁడునునగు నొక కుమారుని గనెను. విష్ణువర్ధన భట్టారకుఁ డాబాలుని జననకాలమును బట్టి జాతకము వ్రాసి యీబాలుఁడు పూర్ణాయుర్దాయ సముపేతుఁడై యాంధ్రదేశము నంతయుఁ బరిపాలించు రాజు కాఁగలఁడని తెలిసికొని మిగుల వైభవముగా జాతకర్మాదికములు ముగించెను. రాజపత్ని, విష్ణువర్ధనభట్టారకుఁడు తన కొనరించిన మేలునకుఁ, దనవంశమునిలిపి కావించిన మహోపకారమునకుఁ బ్రతిఫలముగఁ దనకుమారునకు విష్ణువర్ధనుఁడని నామకరణము గావించెను. కొడుకులు లేరను విచారముమాని విష్ణువర్ధన భట్టారకుఁ డాబాలుని దన కుమారునివలెనే గారాబముతోఁ బెంచి పెద్దవానినిజేసి బాల్యముననె పురాణవీరుల విక్రమములు బోధించి వేదము, శాస్త్రము, ధనుర్విద్య నేర్పిం



చెను. సమస్తవిద్యలయందును నాబాలుఁడు ప్రవేశముగలవాఁడై సర్వశాస్త్రపారంగతుఁడై యొకానొక దినమునఁ దన తల్లియొద్దకేఁగి "మనలను క్షత్రియులని లోకులు చెప్పుకొనుచున్నారు. మనము బ్రాహ్మణ గృహములోఁ జిరకాలమునుండి యుండుటకుఁ గారణమేమి? నాతండ్రి యెవరు? నేనేశాఖకుఁ జెందినవాఁడనో యాజ్ఞయి" మ్మని యడిగెను. కుమారుని మాటలు విన్నంతన పట్టరాని దుఃఖమున రాజపత్ని పరితపించి కుమారునకేమియు బదులు చెప్పఁజాలకపోయెను.

విష్ణువర్ధన భట్టారకుఁడు విచారపరవశురాలై యున్న రాజపత్నిని జూచి "చింతిలఁ గారణమేమి? నావలన నేమేని ప్రమాదము జరుగలేదుగదా? గడుసరియై నీకుమారుఁ డేమేని నొవ్వనాఁడెనా? తెలుపు"మని పలువిధముల నడిగెను. విచారాతిశయమున రాజపత్ని బదులాడఁజాలకపోయెను. విష్ణువర్ధనుఁడు బ్రాహ్మణోత్తమునకు నమస్కరించి తానే తల్లి విచారపడుటకుఁ గారకుఁడనియుఁ దనకులశీలాదికములఁ బ్రశ్నించుటచే నిటుల బలవించుచున్నదనియు నివేదించెను. విష్ణువర్ధన భట్టారకుఁడు బాలుని జేరఁజీరి గతవృత్తాంతము, తల్లి యచటికివచ్చిన హేతువు, తానామెను తనను సాదరమునఁ బోషించుచున్నవిషయము నివేదించెను. రాజకుమారుఁడు కనుల నెఱుపెక్క 'బ్రహ్మజ్ఞ శిరోమణీ! తెలియక ముందు నీసొమ్ము దింటిని. నీకు ఋణపడియున్నాను. ఈజన్మమున నీఋణము తీర్పుగొనఁగలుగుదు

నేని ధన్యుఁడను. నాతండ్రినిజంపిన పల్లవుల మారణముగావించుటయు నచిరకాలమున మహాసామ్రాజ్యము స్థాపించి మాకుటుంబమునెడ ననురాగముఁజూపిన ధన్యులగౌరవించుటయు నాకర్తవ్యము. నేనిఁక నాజ్ఞపుచ్చుకొందు సెలవిండని పలికెను. బ్రాహ్మణుఁడు బాలుని పుత్త్రప్రేమతోఁ బెంచినవాఁడగుటచే నెడబాటునకు సహింపఁజాలక నేనును నీవెంట వచ్చి నీకనుకూలమగు పరిచర్యగావింతుననెను. రాజపత్నియు గుమారుని విడువఁజాలక తాను రానుద్దేశించెను. బాలుఁడెట్టకేలకుఁ దండ్రివలెఁ దన్నుఁబెంచు బ్రాహ్మణోత్తముని దల్లిని ఒప్పించి వారివలన దివ్యాశీర్వాదములను బడసి తపశ్శక్తిచేఁ గాని విజయము లభింపఁజాలదని మహారణ్యములకుఁ బోయెను. రాజకుమారునకు బయలుదేరినదిమొదలనేక శుభశకునములయ్యెను. అన్నియుఁ దన భావ్యభివృద్ధి సూచకములుగాఁ దలంచి దేవతానిలయమనియుఁ జాళుక్యులతపోభూమియనియుఁ బేరొందిన చాళుక్యపర్వతమున కేఁగి రాజకుమారుఁడు చిరకాలము తపస్సుచేసెను. సప్తమాతృకలతోఁ గుమారస్వామి యాబాలునకుఁ బ్రత్యక్షమై "నీవెచటికేఁగినను సింహమువలె విజయము గడింతువుగాన విజయసింహనామము ధరించుమనియుఁ, దిరుగ మీవంశము నిలుచుటకు విష్ణువర్ధన భట్టారకుఁడె కారకుఁడుగాన వంశీయులందఱు నామాంతమున విష్ణువర్ధనపదముఁ జేర్చుకొనుఁడని చెప్పి యాశీర్వదించి యంతర్ధానమాయెను.



కొంతసేపటికి శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమై వరాహధ్వజము నొసంగి యీ ధ్వజసహాయమున విరోధిరాజుల జయించి పేరుగాంచఁగలవని యాశీర్వదించి యదృశ్యమయ్యెను. విజయసింహ బిరుదాంకుఁడగు విష్ణువర్ధనుఁడు గృహముచేరి బ్రాహ్మణోత్తమునకును దన తల్లికిని దానొందినవరములను దెలిపెను. విష్ణువర్ధన భట్టారకుఁడు మిగుల సంతోషించి విజయసింహునకు దిగ్విజయయాత్ర గావింప నొక శుభముహూర్తము నిశ్చయించెను. తల్లి బాలునకు వీరవేషము వేసి యాశీర్వదించి పంపెను.

విజయ సింహుఁడు దైవబలముతో జైత్రయాత్రకు బయలుదేరుచున్నాఁడని విని రాష్ట్రకూటులయెడలను బల్లవులయెడలను ద్వేషభావముగల పౌరులనేకులు జయసింహునకు ధన సహాయము గావించిరి. తన తండ్రినాఁటి భటులలోఁ బలువురు తమకుఁ దామ వచ్చి జయసింహుని గలిసికొనిరి. అపరిమిత బలముతో బయలుదేరిన విజయసింహుని ధాటికి రాజులెవ్వరు నాఁగఁజాలక పోయిరి. ఆకాలమునఁ బ్రసిద్ధులుగా నున్న కదంబరాజులు, గాంగరాజులు కొంతవఱకెదిరించి పరాజయశరణ్యులై యంకితులైరి. రాష్ట్రకూటులలో గృష్ణుడను రాజాకాలమునఁ బ్రసిద్ధుడుగా నుండి విస్తారవిశాలమైన దేశమును బాలించుచుండెను. అతని కుమారుఁడు ఇంద్రవర్మ. తండ్రిని మించి తనరాజ్యమున విరోధియను వాఁడు

లేకుండఁ జేసి శత్రుజనభీకరుండై రాజ్యము నేలు సమయమున విజయసింహుఁ డాతనిపైకి దండయాత్రకు వెడలెను. ఉభయ సైన్యములకుఁ జిరకాలము భయంకర సంగ్రామము జరిగెను. దురదృష్ట వంతుడగు ఇంద్రవర్మబలము సన్నగిల్లెను. చేయునది లేక యపజయము నిశ్చయమని తెలిసికొని విజయసింహుని శరణు వేఁడఁగా శరణాగతత్రాణ బిరుదాంకుండగు నారాజన్యుడు అపరాధముగాఁ గొంతధన మాతని నుండి కైకొని సామంతుఁడుగ నేర్పాటు చేసెను. పల్లవులపై సహజద్వేషభావముగల యీ రాజతిలకుఁడు చిక్కినపల్లవరాజును జిక్కినటుల బంధించి తండ్రినాఁటి పగను వడ్డితోఁ గూడఁ దీర్చికొని దక్షిణాపథమున నింతటి రాజు లేఁడను ప్రతిష్ఠ వహించెను.

విజయసింహుఁడు విజయయాత్ర ముగించి యగ్రహారమునకుఁజేరి తన విజయకథలు తండ్రితో సమానుడగు విష్ణువర్ధన భట్టారకునకుఁ దల్లికి నివేదించెను. తరువాత నొకశుభముహూర్తమున చాళుక్యసామ్రాజ్యమును వాతాపియను నగరమునందు స్థాపించి ప్రాక్పశ్చిమ చాళుక్య వంశములు రెంటికిని మూలపురుషుఁ డయ్యెను. కాంచీ నగరమునందుఁ బల్లవరాజ్య మొకటి యాకాలమునందు సుప్రసిద్ధము గానున్న వార్తవిని విజయసింహుఁ డపరిమిత బలసమేతుఁడై దండయాత్రకు బయలువెడలెను. పల్లవరా జీవర్తమానమువిని ప్రతి



ఘటించినచోఁ బరువుదక్కుట దుస్తరమని తనకుమార్తె నాతని కొసంగి పరిణయముగావించి రాజ్యములోఁ గొంతభాగము వరణముగా నిచ్చెను. విజయలక్ష్మితో నర్ధాంగలక్ష్మితో విజయసింహుఁడు తననగరము జేరి విజయాదిత్యుఁడను కుమారుని గాంచెను. ఈనృపాలుఁడు క్రీ. శ. ౪౫౦ ప్రాంతమున నుండి యుండునని చరిత్రములవలనఁ దెలియుచున్నది. ద్రవిడాంధ్ర కర్ణాటమహారాష్ట్ర దేశములు చిరకాలము పరిపాలించి ధర్మసంస్థాపనము గావించిన లోకోత్తరకీర్తిధుర్యులగు చాళుక్యులలో విజయసింహుఁడు ప్రథమగణ్యుఁడు. ఈయన సంపూర్ణ జీవితము నెఱుంగఁదగు నాధారము లింతవఱకు వలసినన్ని లభింపనందున విస్తరించి తెలుప వీలుకాదయ్యెను. అసహాయస్థితియందుండి స్వశక్తిచే లోకోత్తర ఖ్యాతినొందిన విజయసింహుని కార్యదీక్ష కార్యశూరులగు నాంధ్రసోదరులకు మార్గదర్శక మగుఁగాక!

# రుద్రదేవ చక్రవర్తి.

ఆంధ్రరాజన్యులలోఁ గాకతీయులు మిగుల సుప్రసిద్ధులు. "కాకతి" యను పదము దేవికిఁ బర్యాయనామము. ఈవంశీయులు పూర్వము కాకతి దేవతకు భక్తులై యుంటచే వీరలను నాఁటనుండి కాకతీయులని వ్యవహరించుచున్నారు. "కాకతి" జైన దేవతయనియు నీవంశీయులలోఁ బూర్వులు జైనులుగనుండి యాదేవతను బూజించుచు నుండుటచేఁ గాకతీయులుగ వ్యవహరింపఁబడిరని తెలియుచున్నది. కాకతీయులలోఁ బూర్వుఁడు మహామండలేశ్వర బేతరాజు.

త్రిభువన మల్ల విక్రమాదిత్యుఁడను చాళుక్యరాజన్యుఁ డాంధ్రకర్ణాట దేశంబులఁ బాలించుచుఁ బలువురను ప్రతినిధులుగ ముఖ్యనగరములయం దుంచి వారలచే రాజ్యము నేలించి సుంకములఁ బడయుచు యాజమాన్యముఁ దనయం దుంచికొనెను. ఆకాలమున రాజప్రతినిధులుగ నున్నవారిలోఁ గాకతీయవంశీయులుగూడఁ జేరియుండిరి. కాకతీయులు మొట్టమొదటఁ జాళుక్యులయొద్ద సామంతరాజులుగ రాజప్రతినిధులుగనుండి పరాక్రమముచేఁ బలుకుబడిచే బలము నభివృద్ధిఁ గావించికొని, లోకువగనున్న సామంతులఁ గొల్లఁగొని, రాజ్యవిప్లవములలో విజృంభించి సమీపదేశము నాక్రమించి



కాలక్రమమున స్వతంత్ర రాజన్యులై యాంధ్రదేశము నంతయు నప్రతిహత పరాక్రమముతో మూడువందల సంవత్సరములు పరిపాలించిరి.

కాకతి వంశీయులలోఁ బేరెన్నికగన్న మొదటి వీరుఁడు మహామండలేశ్వర ప్రోలరాజు. ఇతనికాలమున నాంధ్రదేశము నంతయు నేకచ్ఛత్రాధిపత్యముతోఁ బరిపాలనముగావించుచున్న చాళుక్యవంశము కాలవశమున క్షీణించెను. సామంతులందఱు స్వతంత్రులై యెవ్వరికిఁ జిక్కనరాజ్యమును వారు యథేచ్ఛముగా ననుభవింపసాగిరి. రాజ్యమునం దింతయనరాని విప్లవముదయించెను. బలవంతులు బలహీనులఁ బీడించుచుండిరి. సామంతులందఱు రాజ్యతృష్ణతోఁ బెనఁగులాడు చుండుటచే శాంతి యనునది యాకాలమున లేదయ్యెను. విప్లవభేరి తెంపులేక యహోరాత్రముల మ్రోగుచుండెను. దేశీయుల కాసమయము ప్రళయకాలమును దలపింపఁ జేయుచుండెను. ఈసందిగ్ధ సమయమునఁ గత్తిగట్టి యాంధ్రదేశము నుద్ధరించుటకు నిలిచిన మహానుభావుఁడే మహామండలేశ్వర ప్రోలరాజు.

ప్రోలరాజుకాలమున నున్న సామంతు లందఱికంటె బలసంపన్నుఁడు. అతని యాజ్ఞలోఁ జాళుక్యుల సేనయంతయు నుండెను. బొక్కసమున లెక్కయిడరానంత ద్రవ్యము సైతముండెను. దేశ మల్లకల్లోలముగనున్న సంగతి గ్రహించి సమయజ్ఞుడును శూరశిరోమణియు నగుప్రోలరాజు తన్ముపజీవులగు

సైనికులనందఱ సమావేశపరచి రొక్కమునంతయు వ్యయము గావించి ప్రజాద్రోహముగావించుచు జనకంటకులై వర్తించు పూర్వసామంత రాజులనందఱ బంధించి సన్మార్గావలంబనులగు నూతనులను సామంతులుగను రాజప్రతినిధులుగను నియోగించి అనుమకొండలో నాంధ్రసామ్రాజ్యమును స్థాపించెను. దేశమంతయు నశాంతిమంతమైయున్న సమయములో జాతీయతావర్ధనమునకై యాంధ్ర సామ్రాజ్యము నెలకొల్పి, యాఱిపోయిన చాళుక్యపరాక్రమవహ్నిని రగులఁజేసి మాతృసేవగావించిన ప్రోలరాజన్యుని జీవితము మనకసమగ్రముగ లభించియున్నది. ప్రోలరాజు నెలకొల్పిన సామ్రాజ్యము నేఁటికి విస్మృతికివచ్చినను నాఁటి శుభచిహ్నము లింతవఱకు అనుమకొండ ప్రాంతమునఁ గానవచ్చుచున్నవి. జీర్ణచిహ్నములతో నాఁటిదుర్గములు, దేవళములు, ధర్మశాసనములు, రాచబాటలు, సరోవరములు, సింహద్వారములు గానవచ్చుచు నేఁటికిఁ గూడఁ బ్రాచీనాంధ్ర దేశ చరిత్రకారులకుఁ జరిత్ర భిక్ష పెట్టుచున్నది.

ప్రోలరాజు కాలమున వర్ధమాన పురము, పొలవాస, ధర్మపురి, మంత్రకూటము, దేవగిరి, కళ్యాణ పురము లోనగు చోటుల బలవంతులగు చాళుక్య రాజ ప్రతినిధులు రాజ్యము చేయుచుండిరి. ఎవరికి వారు స్వతంత్రులై సంఘైకమత్యమునఁ గల మేలులు మఱచి వర్తింపఁ దొడంగిరి. ఆంధ్ర



దేశము భిన్న భిన్నముగ నుండెను. ఆంధ్రదేశమునకుఁ బ్రత్యేకరాజ్యము లేకున్న లాభము లేదని ప్రోల భూపాలుఁడు అనుమకొండలో నాంధ్రసామ్రాజ్యమును స్థాపించినది మొదలు తక్కు దుర్గాధీశ్వరులకుఁ బ్రోలరాజునకు వైరము పెచ్చరిల్లసాగెను. ప్రోలరాజు తనయావజ్జీవితము సంగ్రామరంగమునఁ గడపెను. దేశమంతయు నొక్కటి, యాతఁడొక్కఁడు నొకటి యగుటచే నడతెగక బలము వృద్ధిఁజేసి ప్రతిఘటించిన రాజన్యుల నందఱను సామంతులుగఁ జేసికొనువఱకుఁ జాల కాలము పట్టెను. మనము పఠింపఁబోవునది రుద్రదేవుని చరిత్రమైనను అతని పవిత్రజీవితమున కాధారభూతుఁడగు ప్రోలరాజు జీవితముగూడఁ బఠించుట యావశ్యకము కాకపోదు.

ప్రోలరాజు ఆంధ్రదేశ రత్నమనదగు అనుమకొండలో నాంధ్రసామ్రాజ్య రాజధానిని నెలకొల్పి చిరకాలమునకు దేశమున శాంతి స్థాపించెను. మరలఁ జాళుక్యరాజులలో నొకఁడు కొంతబలమును సంపాదించికొని ప్రోలరాజును లోఁబరచికొనినఁగాని తనపూర్వ రాజ్యమంతయు హస్తగతము గాదని తలంచి విశ్వనాథ దేవుఁడను వీరవర్యుని సేనానాయకుని గావించి యుచిత పరివారముతోఁ గుదురుకొన నున్న యాంధ్రసామ్రాజ్యము కూలద్రోయింపఁ బంపెను. ప్రోలరాజు మొక్కవోని పరాక్రమముతో సేనానాయకుని సైన్యమును జెండాడి మూలచ్ఛేదనము గావింపకున్నచో శత్రువృత్తము మఱలఁ జిగి

రించునని కళ్యాణపురమును ముట్టడించి రాజవంశమును జెండవైచి విరోధియనువానిని లేకుండఁ జేసి, ఖడ్గముదాల్చి తానొనర్చిన క్రూరకృత్యములు, హత్యలు స్మరించి పాపపరిహారార్థమై గంగాతీరమున దేవళములు, కోనేరులుగట్టించి జీవితశేషము పారమార్థిక చింతనముతోఁ గడప నిశ్చయించెను.

ప్రోలరాజు అనుమకొండరాజ్యము పాలించుతఱి నొక చిత్రకథ జరిగెను. దూరవాసులగు పౌరులు కొందఱు రాజధానికి బండ్లతో వచ్చుచుండ అనుమకొండ రెండు క్రోసుల దూరములో నుండ నొకబండికాలు నేలలో దిగఁబడెను. మిగిలిన బండివాండ్రందఱు నాశకటచక్రమును పైకిలాగ నెంచి కృతార్థులు కారైరి. ఆ శకటములకు సంబంధించిన జనులందఱు గ్రామములోనికేఁగి అనుమకొండ వాసుల కీయవస్థ తెలిపి జనసమూహమును సహాయముగొని బండ్లాఁగిన చోటుఁజేరి నేలలో నిరికికొనిన శకటచక్రము బలమంతయు నుపయోగించి లాగసాగిరి. కొంతసేపటికి భూగర్భమునుండి శకటచక్రము బయటపడెను. దానికమ్మి యంతయు సువర్ణమయ మయ్యెను. కాలు దిగఁబడినచోట సువర్ణచ్ఛాయ వెల్లివిరియు చుండెను.

పౌరులావింత వేగమునఁబోయి ప్రోలరాజున కెఱిఁగించిరి. ఆతఁడు పరివారముతో బయలు వెడలి యాప్రదేశము సందర్శింప నటనొక సువర్ణలింగము జ్యోతిర్మయమైనది కానవచ్చెను. రాజన్యుఁడు వెంటనే దానిని దర్శించి యాశకటముపై



నెక్కించి రాజధానిలోఁ బ్రతిష్ఠింపనెంచెనుగాని యెంతప్రయత్నించినను ఎద్దు లాశకటమును లాగఁజాలవయ్యెను. చెంతనున్న బండ్ల విప్పించి కాండ్లుకట్టి తోలినను యెద్దులు మోర బిగించి ముందడుగు వేసి పోవ నెంతప్రయత్నించినను బండికదలకపోయెను. అది దైవమహత్త్వముగ భావించి దైవస్వరూపులు, మహానుభావులు, సర్వజ్ఞశిరోమణులు, కాళేశ్వర నివాసులు నగు రామారణ్యశ్రీపాదులను, త్రికూట నివాసులు, హిడింబాశ్రమ నివాసులు నగు త్రిదండమహామునుల రావించి వారి కీవిషయము ప్రోలరాజు విన్నవించెను. వారలు పూర్వోత్తర కథనంతయు నాలకించి యాసువర్ణలింగమునకు నత్యంత భయభక్తులతో నభిషేకము చేయించి విభూతి శ్రీచందనమలంది వేదోక్తముగ సహస్రనామపూజ గావించి బిల్వపత్రములఁ బైనిగప్పి మహానైవేద్యమునుసమర్పించి 'హరహరా!' యని యెద్దులనుదోలుమనిరి. శకటము తేలికగా నడువ సాగెను. ప్రజ లామహాత్ముల శక్తికి విస్మయమునొందిరి.

రాజ్యాంగరహస్యవేత్తయు, పరబ్రహ్మస్వరూపుఁడు, విజ్ఞానరాశియగు రామారణ్యశ్రీపాదులు ప్రోలరాజుతో 'ఇది సామాన్య సువర్ణలింగము కాదు. స్పర్శవేదిలింగము. దీనిని సోఁకినచో నినుము బంగారమగును. నూతనముగ నాలయము, పురము గట్టించి యందు దీనిని బ్రతిష్ఠింపవలయునని యానతీయ సమ్మతించెను. రామారణ్యశ్రీపాదులు శ్రీవిద్యాధర

చక్రమునుబట్టి కోటకు రేఖలువ్రాసి యగడ్తలు త్రవ్వించి అనుమకొండవైపౌక ద్వారమేర్పరచి చెంత నొకదివ్యాలయమున నాలింగమును బ్రతిష్ఠ చేయించెను. నూతనముగ నిర్మించిన పురమునకు నేకశిలానగరమని పేరుఁబెట్టి శ్రీపాదులు నిజనివాసమున కరిగిరి. స్పర్శవేదిలింగమునకు సోఁకించినమాత్రమున దినమునకొక పుట్టియినుము అంతియు బంగారమగుచుండెను. రాజన్యుఁడు దానిని ధర్మార్థము వినియోగము చేయుచుండెను.

చిరకాలమునకుఁ బ్రోలరాజున కొకపుత్త్రుఁడుజనించెను. విధివిహితంబుగా నా బాలునకు నామకరణాది శుభకార్యంబులు నెరవేర్చి మహోత్సవాగతులగు విద్వాంసులముందు రాజన్యుఁడు కుమారుని జన్మకాలనక్షత్రాదికముల విన్నవించి బాలకుని భవిష్యజ్జీవితము నిర్ణయింపఁ బ్రార్థించెను. బ్రాహ్మణోత్తములు తమలోఁ దాము సంశయించుచు రాజుతో మాఱాడ వెఱచిరి. చకితుఁడై రాజన్యుఁడు విద్వాంసుల సందర్శించి యంజలి మోడ్చి "కానక గన్న యీకందువునకు బాలారిష్టములు లేవుగదా! ఈశ్వరవరప్రసాదమున సంతానవృక్షమునుండి లభించిన యీ ఫలము మాచేతినుండి తొలంగిపోవ భగవత్సంకల్పముకాదుగదా! ఆజ్ఞయిం"డని సదైన్యముగఁ బ్రశ్నించెను. విద్వాంసులు దూరమాలోచించి,

కం॥ తనయెఱిఁగిన యర్థంబొరుఁ
డనఘా! యిది యెట్లు సెప్పుమని • యడిగినఁ జె



ప్పనివాఁడును సత్యము జె
ప్పనివాఁడును ఘోరనరక • పంకమునఁబడున్

అను నీతివచనమును దలంచుకొని సత్యము చెప్పక దాచఁగూడదని రాజన్యునితో "ఆర్యా! ఈ కొమారునివలన మీకు మరణము గలుగును. కొమారుఁడు చిరాయుశ్శోభితుఁడనుట కెట్టిసందియము లేదు" అని విన్నవించిరి. రాజు బ్రాహ్మణుల సగౌరవముగఁ బంపివైచి ప్రోలరాజు తనధర్మపత్ని కీరహస్యమేకాంతమున నెఱింగించెను. ఆయమయు నొకవైపు పుత్త్రప్రేమము మఱియొకవైపు భర్తృభక్తి హృదయము నుఱ్ఱూతలూపఁ జాలసేపు నిశ్చేష్టురాలై కర్తవ్యభారము భర్తపై నుంచెను. ప్రోలరాజు కానకగిలిగిన నెత్తురు కందును విడువఁజాలక ఆత్మమరణమున కియ్యకొనఁజాలక పత్నియనుమతిచొప్పున నాబాలకుని నర్థరాత్రమున రహస్యముగఁ గొనిపోయి స్వయంభూస్వామి మండపమున బొత్తులువఱచి యందుఁ బరుండఁబెట్టి పుత్రమోహవిషణ్ణయగు పత్నిచే బిడ్డనికిఁ బాలిప్పించి పుత్త్రబంధము ద్రెంపుకొనఁజాలక యెటులో బయటఁబడెను.

మఱునటిదినమున ఆలయ పరిచారకులు చూచుసరికిఁ గేవుకేవుమని యేడ్చు నీనెత్తురుకందువు కాన్పించెను. వారలు వెంటనే యీరహస్యము నంతయు నర్చకులకు నివేదించిరి. వా రాశిశువును గాంచి దివ్యాకారశోభితుఁడగు నీబాలకుఁడు

చక్రవర్తులయింట జనింపఁదగినవాఁడు. ఇట్టి దుర్గతికి లోనుగా
వలసినయవస్థ యేమికలిగెనో యని వానిని గొనిపోయి యింట
నుంచి యారహస్యమును ప్రోలరాజులకు నివేదించిరి. రాజా
బాలుఁడు తనకుమారుఁడె యని యెఱింగియు నెఱుంగని
యటుల నటించి ప్రేమముఁ జంపుకొని యర్చకునితో ఎవఁడైన
నేమి! పసిబిడ్డఁడు. రక్షింపఁదగినవాఁడు యుక్తవయస్సు వచ్చు
వఱకుఁ గాపాడి విద్యాబుద్ధులునేర్పి వానిని సంస్థానమున కప్పు
గింతురేని స్వతంత్రముగ జీవింపఁగలవాఁడగును. వీనిచే మీకుఁ
బుణ్యము పురుషార్థము కలుగును. బాలకుని పోషణమున
కగు వ్యయమును సంస్థానమే భరింపఁగల" దని చెప్పి బాలకుని
సంరక్షణమునకై కొందరు విశ్వాసయోగ్యులగు భటుల నియో
గించెను. అర్చకులలోఁ బెద్దయగు రుద్రజియ్యయనునాతఁ డా
బాలుని పోషణభారము దన తలపై నుంచుకొని యుక్తవయస్సు
వచ్చినపిదప విధ్యుక్తముగ నుపనయనము గావించి బ్రాహ్మణ
ధర్మానుసారముగ వేదశాస్త్రాదికము, క్షత్రియ ధర్మానుగుణ
ముగ ధనుర్విద్యాదికము నేర్పి జాగరూకత నాబాలుని గాపా
డసాగెను. అర్చకుఁ డాబాలునకు రుద్రదేవుఁడని నామకరణము
గావించెను. ఈతఁడె మన కథానాయకుఁడు. పవిత్రవంశమున
జనించినవాఁడును ఆంధ్రవాఙ్మయమునకు ఆంధ్రదేశమునకుఁ
బ్రత్యేకవ్యక్తిత్వము సమకూర్పఁదగిన మహానుభావుఁడగుటచేఁ
గాఁబోలు నీబాలకుఁడు స్వల్పపరిశ్రమచేతనే సర్వశాస్త్రపరిజ్ఞా



నము శస్త్రవిద్యానైపుణ్యము గడించి సాటివారిలో సర్వవి
ధముల నెన్నికకెక్కి యౌవరాజ్యపట్టాభిషేకమునకుఁ దగు
ప్రాయము గలవాఁడయ్యెను.

ప్రోలరాజు షట్కాలశివపూజానిరతుఁడు. స్వయం
భూస్వామి యాలయమున కాతఁ డొంటరిగా వచ్చి పూజాది
కములు గావించిపోవు నాచారముగలదు. కొంతకాలమునకు
స్వయంభూస్వామి యనుగ్రహమున వేఱొకకుమారుఁడు కలి
గెను. వానికి మహాదేవరాయలని నామకరణము గావించి
వాత్సల్యముతోఁ బెంచుచుండెను. ఒకనాఁడు ప్రోలరాజు
ప్రయాణము కానిశ్చయించి వేఁకువజామున లేచి పరివార
ముతో బయలుదేరి ద్వారమున ననుయాయులనుంచి తా
నొక్కరుఁడ యీశ్వరసాన్నిధ్యమున కేఁగి పూజాదికములను
శ్రద్ధాభక్తులతో నొనరింపఁదొడఁగెను. రాచనగరులో నుద
యకాల మంగళగీతలు వినరాసాగెను. ప్రోలరాజు పూజాది
కములు ముగించి శివనిర్మాల్యము గొనివచ్చుచుండ మండ
పమున నిదురించుచున్న యొక దివ్యమంగళవ్యక్తి గోచరిం
చెను. ప్రోలరాజటఁ గూర్చుండి యావ్యక్తిదివ్యాకారమును
రూపరేఖావిలాసములు గాంచి యాశ్చర్యపడుచుఁ దనలోఁ
దానుచింతించుచుఁ దలయూపుచు నిశ్చేష్టుడై చాలసేపుగడపె
ను. తుదకుఁ బ్రయాణ మనివార్యమగుటచే లేచి యావ్యక్తిని
నొక్కమాఱు కౌఁగిలించుకొనినఁ గాని పోవఁజాలనని నిశ్చ

యించి తరంగములవంటి బాహువులు సాగించి నిదురలోమైమ
ఱచియున్న యావ్యక్తిని కౌఁగిలింపఁ బోయెను. వెంటనే గాఢ
నిద్రలోనున్న యావ్యక్తి యులికిపడిలేచి విద్యుద్వేగమునఁ
బ్రోలరాజును కోశనిర్ముక్తమగు పదునుకత్తితో వక్షమునుండి
యావలకు దూరునటుల పొడిచెను. వెంటనే వృద్ధుఁడగు
ప్రోలరాజు మొదలునరికిన కదళీతరువువలెఁ బడిపోయెను.
గంటవలె వెలుఁగుచున్న దీపపు వెలుఁగున నావ్యక్తి తనకత్తి
కెఱయైన పురుషుని పోల్చికొని ప్రోలరాజని గుర్తించి గుండెలు
బాదుకొనుచు "అన్యాయముగా రాజన్యుని జంపితిని. రాజ
ద్రోహము గావించిన నాకిఁక నధోలోకమే శరణ్యము. ఎంత
యనాలోచితమునకుఁ బాల్పడితిని! నిద్రావస్థలోఁ జోరుఁడని
చేయిమిగిలితిని. ఈ పాపకార్యము రాజనగరమున నివేదించి
దోషమునకుఁ దగినశిక్షనొందుదుఁగాక" యని యావ్యక్తిబయలు
వెడలెను. ఈసమ్మర్దము నాలకించి ద్వారమున నిలిచియున్న
పరివారమంతయు మహామండలేశ్వరుని సమీపించి యీ విప
రీతావస్థగాంచి నివ్వెరపోయిరి. ప్రోలరాజు కొంతసేపటికిఁ
దెలివినొంది యూర్ధ్వశ్వాసములచే మరణవేదన నొందుచుండ
రాజకీయోద్యోగులు రాణివాసపు వారుగూడ నీకథవిని సంభ్ర
మముతో వచ్చి పలువెఱంగుల వాపోవుచు ఖడ్గప్రహారము
గావించిన నూతనవ్యక్తిని జంపవలయు ననియుఁ గత్తికొక ఖండ
ముగఁ జేయవలయు ననియుఁ బలుకఁ దొడఁగిరి. నోటమాట



వెడలుటయే కష్టముగానున్న యీ మరణావస్థలో తెఱవఁజేసి
కొని తీవ్రవాదులగు నారాజభక్తుల నందఱ వారించి "మిత్రు
లారా! శాంతివహింపుడు. హంతకుఁడు స్వామిద్రోహి కాఁడు.
నాకుమారుఁడె. అతఁడు రుద్రదేవుఁడు. భవిష్యదాంధ్రసామ్రా
జ్యచక్రవర్తి. ఇతని జననకాలముననె జ్యోతిష్కులు జాతక
ములవ్రాసి పితృమారకుఁడగునని సెలవిచ్చిరి. విపత్తునుండి
బయటపడనెంచి వీని నాలయమున రహస్యముగఁ జేర్చి యర్చ
కుల యాధీనమునం దుంచితిని. నేఁటితో నాకాయువు పరిపక్వ
మైనది. ఇప్పటికి నాకు డెబ్బదిరెండు వత్సరములు వచ్చినవి.
భోగములపై విరక్తికలిగినది. మనఃపూర్వకముగ నీబాలుఁ
డాంధ్ర సామ్రాజ్యమునకు భారవాహకుఁ డగుటకు నేను
సమ్మతించు చున్నాఁడను. మీరందఱు నాపైఁజూపిన గౌరవ
మీ బాలకునిపైఁ జూపుట కర్తవ్య" మని ప్రోలరాజు పల్కి
స్తబ్ధుఁడై చూడసాగెను.

ప్రజలందఱు భయవిస్మయములచేఁ దరంగితులై చిత్ర
ప్రతిమలవలె నిలుచుండి యాదృశ్యమును దిలకించుచుండిరి.
అనుకొనిన దొకటి అయినదొకటి. రుద్రదేవుఁడా ప్రోలరాజువాక్య
ములువినినదాది "రాజద్రోహినేకాక పితృద్రోహినిగూడనైతినా!
ఈ పాపమున కిఁక శిక్షలేదు. నాయంతపాపి భూలోకమున లేఁ"
డని తండ్రిపై వ్రాలి విలపించెను. ప్రోలరాజు తనయుని గాఢ
ముగఁ గౌఁగిలించుకొని "కుమారా! విచారింపకుము. దైవవిధి

నెరవేరినది. ఖడ్గము నూడఁబెఱుకుము. బాధతోఁ బ్రాణములు భరించుట చాలకష్టముగ నున్నది. సహగమనమునకు మీతల్లి సిద్ధురాలయ్యెనేని వలయు నవకాశముఁ గల్పింపుము. నీ సోదరుఁడు మహాదేవరాయలభారము నీతలపైననే గలదు. ఇవి పద్మాక్షీదేవి ప్రసాదించిన దివ్యాయుధములు. మన పూర్వులీ యాయుధములఁ దాల్చి విక్రమైకజీవనులై యుభయలోకములలోఁ బేరుగాంచిరి. పరిజనులారా! పౌరులారా! మీయందఱి యొద్ద సెలవునొందుచున్నాఁడనని ప్రోలరాజు పంచాక్షరీ జపము చేయుచుఁ గనులుమూసికొనెను. రుద్రదేవుఁడవనతముఖుఁడై పితృదత్తములగు నాయుధము లందుకొని తండ్రియురమున గాటముగ నాటుకొనిన ఖడ్గము నూడబెఱికెను. చిమ్మనగ్రోవితోఁ గొట్టినటుల రక్తధారలు రుద్రదేవుని మెయినిండఁ బడెను. ముఖ్యులగు నమాత్యులాయదనున రుద్రదేవుని నటనుండి తొలంగించి ప్రోలరాజు కళేబరమున కర్హమగు సంస్కారములఁ గావించిరి. రాజపత్నియుఁ గుమారుని కౌఁగిలించుకొని యానందబాష్పములతో నాతని మేను దడిపి భర్తృచితిపై వ్రాలి వీరస్వర్గరాజ్యమును జూరఁగొని జ్వాలాగర్భమున నంతర్హిత యయ్యెను.

ఒక శుభముహూర్తమున రుద్రదేవచక్రవర్తి యాంధ్ర సామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. దేశము మిక్కిలి సంకులస్థితిలో నుండెను. తన సహోదరుఁడగు మహాదేవరాయలు



పితృహత్యాకర్తయగు నన్నతోఁ గలిసిమెలసియుండఁడయ్యెను. ప్రోలరాజుకాలములో సామంతులుగనుండి పన్నులుచెల్లించుచు విధేయులై యున్నవారిలోఁ బలువురు తిరుగఁబడి స్వాతంత్ర్యపతాకముల నూపి యశాంతి సమీరము నతిశయింపఁ జేయుచుండిరి. హృదయశల్యమువలెఁ బితృహత్యావిచారము మనస్సును దీవ్రవేదనలపాలు గావించుచుండెను. ముందుఁ బితృహత్యాఘమునుండి విముక్తుఁడైనఁ గాని తనజీవితము పవిత్రము గాదనియు, దా నపవిత్రుఁడై యున్నంతవఱకుఁ బ్రజావిశ్వాసదూరుఁడు కావలసి వచ్చుననియు, నిశ్చయించి రుద్రదేవుఁడు రాజధానియగు అనుమకొండలో గొప్ప శివాలయముగట్టించి సహస్రస్తంభమండపము దీర్పించి గొప్ప దీర్ఘికను ద్రవ్వించెను. ఒరంగల్లులోఁ బెక్కుశివాలయములఁ బ్రతిష్ఠించెను. పూర్వులచేఁ బూజాపురస్కారముల నందికొనుసిద్ధేశ్వరునకుఁ బద్మాక్షీదేవికి నిత్యనైవేద్య దీపారాధనాదులకుఁ గొత్తవృత్తుల నొసంగి బొక్కసములోని ధనముతో రాజధాని కాఱుక్రోసుల దూరములోనున్న అయ్యనవోలులోని విశాలప్రదేశమున మైలారుదేవున కొకగొప్ప యాలయమును గట్టించి ఒరంగల్లుకోటలోఁగల ద్వారములవంటి విచిత్రశిల్పాభిరామము లగు ద్వారముల నాలుగువైపులఁ బ్రతిష్ఠించి అనుమకొండకుఁ బరుగుదూరములో నున్న వడ్డెపల్లిలో గొప్ప తటాకమును ద్రవ్వించి చెంత సిద్ధివిఘ్నేశ్వరుని బ్రతిష్ఠించి యచట విశాల

మగు నాలయము మండపముఁ గట్టించెను, ఇంతియగాక మొగలి
చర్లయనుచోట నేకవీరాదేవి యను శక్తిని బ్రతిష్ఠించి గొప్ప
దేవళము గట్టించి వస్తువాహనములు సమర్పించి మరల రాజ
ధానిచేరి తనపేరఁ, దనతండ్రిపేరఁ బెక్కుగ్రామములు గట్టించి
యాగ్రామములు వేదవేదాంగ ప్రవీణులగు బ్రాహ్మణోత్తము
లకు ధారవోసి యంతతోఁ దృప్తినొందక దిగ్విజయపరుఁడై విరో
ధిరాజుల వశంవదులఁ గావించుచు శ్రీశైలప్రాంతములను
హస్తగతము గావించుకొని యటఁ బత్నీయుక్తుఁడై రత్నవిభూ
షణములు మడిమాన్యములు సమర్పించి పాండ్యాధీశ్వరులపైకి
దండయాత్రకు వెడలి కాంచీనగరము శ్రీరంగములోనగుపుణ్య
క్షేత్రములు దర్శించి పాండ్యుల సామంత రాజులను గావించి
సేతుబంధన రామేశ్వరునియొద్ద కేఁగి తులాభారములు పెక్కులు
తూఁగి ధనుష్కోటిలో స్నానాదికములఁ గావించి జయాంక
ములనెలకొల్పి రుద్రదేవచక్రవర్తి జయలక్ష్మీ ద్వితీయుఁడై
రాజధానికిఁ జేరెను. మఱియొకమాఱు వారణాసీప్రాంతము
లకు దండయాత్రకు వెడలి గంగాస్నానములు గావించి షోడ
శోపచారములతో విశ్వేశ్వరునకుఁ బూజాదికములు గావించి
యనంతరము గయకేఁగి పితృదేవతలకుఁ బిండప్రదానములు
సభక్తికముగ నిర్వహించి యిప్పటికిఁ బాపవిముక్తుఁడ నైతినని
రుద్రదేవచక్రవర్తి రాజధానినగర మగు ననుమకొండకుఁ
జేరెను.



మహాదేవరాయలు విజయయాత్రలకుఁ బుణ్యక్షేత్ర
ములకు రుద్రదేవు డేఁగినపుడెల్ల రాజ్యవ్యవహారములు నిర్వ
హించుచు రాజద్రోహులతోఁ గలిసి రుద్రదేవునిఁ గడముట్టించు
నుపాయము లారయుచు సమయమునకై నిరీక్షించియుండెను.
ఇది గ్రహించి రుద్రదేవుని విరోధులగు సామంతరాజులు
ఆంధ్రసామ్రాజ్యమును హరింపనెంచి మహాదేవరాయలతో
రాయబారములు జరిపి విప్లవోద్యమమునఁ బాల్గొన వాగ్దాన
ము గావించిరి. రుద్రదేవుఁ డిదియంతయు గ్రహించి తనతండ్రి
యవసానకాలమునఁ గావించిన హితోపదేశము జ్ఞాపక
ముంచుకొని సోదరుని క్షమించెను. ప్రతిపక్షులుమాత్రము
మహాదేవరాయలు తమపక్షము వాఁడుగ విశ్వసించి యుంటచే
నియతకాలమున అనుమకొండ రాజ్యమును ముట్టడింప బయలు
దేరివచ్చిరి. ఈవిపరీత పరిస్థితులన్నియు రుద్రదేవుఁడు సాకల్య
ముగా గ్రహించి విరోధులతో సోదరుఁడు కలియకుండునటుల
వలయుఁ గట్టుదిట్టములు తొలుతఁగావించి ప్రత్యర్థుల మటు
పెట్టుటకు సైనికబలమును మిగుల వృద్ధిజేసి విరోధు లరుదెంచు
మార్గములఁ దెలిసికొని త్రోవలనరికట్టి వధింపఁ గొంతబల
మును బంపెను. మహాదేవరాయల యొద్దనుండి తమకు సరి
యగు నుత్తర ప్రత్యుత్తరములు నడువకున్నను, దురాగతులగు
ప్రత్యర్థిరాజులు అనుమకొండరాజ్యము హరింప నకాలమునకు
వచ్చి గుద్రదేవుని ధాటి కాఁగఁజాలక ప్రాణమానములఁ
గోల్పోయిరి.

ఆకాలమున రుద్రదేవుని నెదిరించిన రాజులలోఁ బలువురు ప్రసిద్ధులు గలరుగాని వారి ప్రత్యేక చరిత్రములు సమగ్రముగాఁ దెలియ వచ్చుటలేదు. దొమ్మరాజు బలవంతులలో నగ్రగణ్యుఁడు. ఈతఁడు అనుమకొండరాజ్యమును హరింప వలయునని సమధికబల సమేతుఁడయివచ్చి కోటముట్టడించెను. ఈముట్టడి కొన్నిమాసములు జరిగెను. కాకతీయ సైన్యములు దొమ్మరాజు సైన్యములఁ జించిచెండాడెను. విజయముపై నాసమాని బ్రతుకుజీవుఁడాయని దొమ్మరాజు గుఱ్ఱమునెక్కి పారిపోవుచుండగా రుద్రదేవుఁడు వెంబడించి బాణములఁ బ్రయోగించి యాతనికాయము గాయము గావించెను. దొమ్మరాజు తన యశ్వారోహణనైపుణ్యము ప్రాణరక్షణముకొఱకుపయోగించి యెందో దాగెను. రుద్రదేవుఁడీ యదనుగ్రహించి పరివారసహితముగా దొమ్మరాజు రాజ్యమునందుఁ బ్రవేశించి కోటఁ బగులఁగొట్టి రాజధానిఁ గొల్లగొని విజయస్తంభమును బ్రాతించి తనప్రతినిధి నారాజ్యమునందుంచి వెనుకకు మరలెను. రుద్రదేవుఁడు దొమ్మరాజుతోఁ బోరుచున్న సమయము తమ కనుకూలకాలముగా గ్రహించి మేడరాజు, మేళగిదేవుఁడు అనుమకొండపైకి దాడివెడలిరి. అనుమకొండయందున్న మూలబల మావీరయుగముతోఁ బోరాడునరికి రుద్రదేవుఁడు రాజధానిజేరి వ్యూహములఁ బన్ని విరోధిబలములను బంచబంగాళము గావించెను. మేడరాజు,



మేళగిదేవుఁడు పారిపోయిరి. రుద్రదేవుఁడు వారిని గోదావరీతీరమువఱకుఁ బారఁదోలి పొలవాసరాజ్యమును నాక్రమించుకొనెను.

వర్ధమాన పురమునందుఁ జోడరాజ్య మాకాలమున మిగుల వైభవోపేతముగా నుండెను. ఉదయాదిత్యుని వంశీయులును కాశ్యపగోత్రులును నగు భీమరాజు, గోకర్ణుఁడను నిరువురు సహోదరులు పాలించుచుండిరి. వీరిలో భీమరాజు మిగుల దుండగుఁడు. చండశాసనుఁడు. దయాదాక్షిణ్య భావములఁ గలనైన నెఱుంగనివాఁడు. సవతితల్లితో స్నేహము గావించిన మహాపాపి. రాజ్యలోభముచేఁ దోఁబుట్టువును విసముఁబెట్టి చంపిన దురాగతుఁడు. కందూరురాజ్యమును బరిపాలించు తైలపదేవుఁడు. ఆంధ్రసామ్రాజ్యమునకు సామంతుడయ్యుఁ జిరకాలము సుంకము చెల్లింపఁడాయెను. రుద్రదేవుఁ డందులకుఁ గోపించి కందూరురాజ్యము ముట్టడింపఁ దైలపదేవుఁ డభిమాన సంరక్షణార్థము ప్రాణత్యాగము గావించికొనెను. రుద్రదేవుఁడు సుంకపుధనము రాఁబట్టుకొని రాజ్యమునఁ దనప్రతినిధి నుంచి అనుమకొండఁ జేరెను. ఈ యవకాశమును బురస్కరించికొని భీమరాజు కందూరురాజ్యమును ముట్టడించి తన రాజ్యమునఁ గలుపుకొని ప్రజలఁ బీడింప మొదలుపెట్టెను. రుద్రదేవుఁ డీక నూఱకున్న లాభములేదని వర్ధమాన నగరము మీఁదికి దండయాత్రకు బయలువెడలి కోటఁ బగులగొట్టించి

కందకములను బూడ్పించి రాజధానినంతయుఁ దగులఁబెట్టించి యుపవనముల రూపుమాపి నగరమును బాడుచేసెను. తల దాచుకొనుటకుఁ దావులేక భీమరాజు అంతఃపురకాంతలతోఁ దోఁబుట్టువులతో రక్తసంబంధులతో నెందోపాఱిపోయి రుద్ర దేవుని పేరు వినఁబడినంతవఱకుఁ దలయెత్తఁ డయ్యెను. అంతలో కందూరు వర్ధమానపుర రాజ్యములు రుద్రదేవుని హస్తగతములయ్యెను.

చోడోదయుఁడను నొకరాజు విస్తారసైనికబలముతో స్వతంత్రుఁడై తిరుగఁబడఁగా రుద్రదేవుఁ డాతనినగరమును ముట్టడించెను. అనుమకొండ సైనికులు చోడోదయుని నగరమును ధ్వంసము గావించిరి. రుద్రదేవుఁడు బాణములఁ బ్రయోగించి చోడోదయుని దేహమంతయు గాయములతో నిండునట్లు చేసెను. ఆయువుపట్లలో బాణములు గ్రుచ్చుకొనుటచేఁ జోడోదయుఁ డొడలెఱుంగక రాజమందిరము విడిచి కానల వెంటఁబడి ప్రాణములు విడిచెను. సమర్థులగు రాజులందఱు రుద్రదేవునకు సామంతులైరి. మహాదేవరాయలు రుద్రదేవుని యసాధారణ పరాక్రమమునకు ముగ్ధుఁడై ద్వేషము మాని కార్యాలోచనములం దన్నతో సర్వవిధముల నేకీభవించుచుండెను.

రుద్రదేవుఁడు పరాక్రమాతిశయముచే ఆంధ్రదేశమంతయు నాక్రమించుకొనెను. అంతియగాక కర్ణాటదేశమునందలి



భాగములను ద్రవిడదేశములోఁ గొంతభాగమును సరిహద్దులందున్న మహారాష్ట్ర దేశమును సాధించెను. రుద్రదేవుని రాజ్యమునకు హద్దులు తూర్పుదిక్కున సముద్రమనియు, దక్షిణ దిక్కున శ్రీశైలమనియుఁ, బడమటిదిక్కునఁ జాళుక్యరాజధాని యగు కల్యాణ పురమనియు, ఉత్తరపుదిక్కున మాల్యవంతమనియుఁ జెప్పఁబడెను. ఇంత విశాలరాజ్యమును బరాక్రమముచే నార్జించి శాశ్వతస్థాయిగాఁ గాకతీయ సామ్రాజ్యమును పేర నిలిచియుండుటకుఁ బాటుపడిన రుద్రదేవుని పవిత్రసంకల్పము సర్వజనసంభావనీయ మనుటలో సంశయము లేదు. ఈ వీరాధివీరుని పరిపాలనముతోఁ బట్టు దప్పిన చాళుక్య చోడ రాజ్యము దాదాపుగ నంతరించెను.

రుద్రదేవుఁడు లలితకళలను మిగులఁ బ్రేమించి పోషించెను. అనుమకొండలో నపూర్వ శిల్పరమణీయమగు నొక దేవాలయము గట్టించి ముందు వేయిస్తంభములతో గొప్ప మండపము గట్టించెను. ఇవు డామండపము చాలవఱకుఁ గూలిపోయినది. ఆలయముమాత్రము నేఁటికి దర్శనీయమై మనోహరముగ నున్నది. ద్వారములందుఁ గల లతాచిత్రములు స్తంభములపైఁగల పురాణకథావిగ్రహములు జీవకళ లుట్టిపడుచుఁ గనువిందు గూర్చుచున్నవి. నాఁడుపెట్టిన మెఱుఁగు నేఁటికిఁ గొంచెమేని కనుమాయక యచ్చెరువు కలిగించుచున్నది. గర్భాలయ ద్వారబంధములపైఁగల శిల్పములు, విగ్ర

హాసులు ప్రత్యేకదర్శనీయములు. ఆలయాభిముఖముగ నున్న నంది చూచి యానందింపఁదగినది. ఇంక నాకాలమున రుద్రవిభుని త్యాగాధారముచేఁ బ్రతిష్ఠింపఁబడిన యపూర్వ శిల్పదేవాలయములు కలవుగాని వాని వర్ణనమిచట గావించుట ప్రశస్తము కాదు. రెండవ ప్రతాపరుద్రుని కాలమున యవనులు గావించిన దండయాత్రలో నీ యాలయము రూపుమాపఁబడెను. హతశేషమగు నాలయభాగము, రుద్రదేవుని విజయకథలఁ దెలుపుశాసనము, కోనేరు నేటికిని దర్శనయోగ్యములుగ నున్నవి. రుద్రదేవుఁడు నగరముచుట్టు పెద్దమట్టికోట గట్టించి యున్నివైపులఁ గట్ట నాధారపఱచి తటాకములఁ బ్రతిష్ఠించెను. సేనానాయకులుగూడఁ బెక్కుతటాకముల ద్రవ్వించి రాజ్యమంతయు సుభిక్షము గావించిరి. ఆంధ్రసామ్రాజ్యమున నాకాలమున క్షేత్రములు సస్యసంపూర్ణములై మనోహరముగా నొప్పుచుండెను.

రుద్రదేవుఁడు శైవమునం దభిమాన భావము గలవాఁడు. అట్లుండియు నాకాలమున మిగుల వ్యాప్తముగానున్న జైనమతమునెడ నెట్టి విద్రోహమును గావించి యెఱుంగఁడు. తన యాస్థానమునందు వీరశైవ, జైన, అద్వైత, విశిష్టాద్వైత పండితులకు సమగౌరవము నొనరించెను. పలుమారు తులాభారములఁ దూఁగి సువర్ణము విద్వాంసులకుఁ బంచియొసంగెను. అనుమకొండ సామ్రాజ్య నగరముగా నుండుటకుఁ



దగినదిగాఁ దోఁచకపోవుటచేఁ దన తండ్రికాలమునుండి కట్టింపఁబడుచున్న ఏకశిలా నగరమునకు లక్షలకొలఁది ధనము వ్యయము గావించి బురుజులు, కోటలు, కందకములు, కొత్తళములు నిర్మించెను. రుద్రదేవుని యాస్థానమునందున్న కవులలో పాలకురికి సోమనాథుడు, గురు మల్లికార్జున పండితారాధ్యులవారు, రామేశ్వర భట్టారకుఁడు లోనగు ప్రముఖులు పలువురుగలరు. రుద్రదేవుఁడు కవులతో నిష్టగోష్ఠులు గావించి వినోదించుటయేగాక తాను స్వయముగాఁ గవిత్వమును చెప్ప నేర్చి కర్ణాటసంస్కృతాంధ్ర భాషలలో నసమాన పాండిత్యము నార్జించి "విద్యాభూషణుఁ" డను బిరుదము బడసెను. ఇంతియగాక రాజకీయధర్మములు, రాజవిధులు చర్చించు నీతిసారమను నొక పద్యకావ్యమును రచించి యాంధ్రభాష నలంకరించెను. ఇప్పు డాగ్రంథము లభింపకపోవుట సంతాపకరము. ఈయన యాస్థానమునందున్నటులఁ బైచెప్పిన గురుమల్లికార్జున పండితారాధ్యులవారు దండనాథుఁడుగ నుండి యాస్థానమునందు విద్యావినోదములలోఁ బాల్గొనుచు శివస్తోత్ర గ్రంథములఁ బెక్కింటిని రచించెను. రుద్రదేవుని నడిమివయస్సున నీ పండితారాధ్యులు మరణించిరి.

పాలకురికి సోమనాథుఁడు మల్లికార్జున పండితారాధ్యులవారి యనంతరము కొంతకాలమునకు రుద్రదేవుని యాస్థానముఁ బ్రవేశించి మృదుమధురమగు దనయాంధ్రకవిత

నాధారముగఁ జేసికొని వీరశైవమతము మిగుల వ్యాప్తిలో
నికిఁ దెచ్చెను. మతావేశపరవశుఁడగు నీసోమనాథుఁడు జైనుల
బాధలఁ జంపించె నని స్థానికచరిత్రములందుఁ గలదు. ఇతని
గ్రంథములు పరమతదూషణము, స్వమతస్తుతి గలవి. గాన
నీతనియెడ నారోపించిన దోషము లాకాలపుఁ జరిత్రము సమ
గ్రముగా నెఱింగిన వారికి సత్యములని తోఁచుటకు సంశయ
ముండదు. రుద్రదేవునియొద్ద సేనా నాయకులుగ నున్న బేతిరెడ్డి,
నామిరెడ్డి, రుద్రదేవ సేనాని లోనగు వీరుల చరిత్రము సమగ్ర
ముగఁ దెలిసికొనవలసి యున్నది. రుద్రదేవుని సోదరుఁడగు
మహాదేవరాయలు మూఁడుసంపత్సరములు రాజ్యము పాలిం
చినటులఁ జరిత్రములందుఁ గలదు. రుద్రదేవుఁడు జీవించి
యుండఁగా శౌణదేశాధీశ్వరుఁడును యాదవ నరపాలకుఁడును
నగు జైత్రపాలుఁడు త్రిలింగదేశము మీఁదికి దండెత్తి వచ్చి
నపుడు మహాదేవరాయ లెదిరింపఁబోయి మడిసినటులఁ జరిత్ర
ములందుఁ గలదు. శాసనము లందు రుద్రభూపాలుని యనం
తరము రాజ్యము పరాధీనము కాఁగా వీరవతంసుఁడగు రుద్ర
సేనాని పునరుద్ధరించినటులఁ గన్పట్టుచున్నది. మహాదేవరాయలు
జీవించి యనంతరము మూఁడుసంవత్సరములు రాజ్యమును
బాలించినదే సత్యమైనచో రుద్రదేవుని యనంతరము రాజ్యము
పరాధీనము గావలసిన యవసరము లేదు గావున మహాదేవ



రాయలు రుద్రదేవుని కంటె ముందుగానే మరణింప వలయును.
ఇదియె యుక్తియుక్తమగు మార్గము.

రేచెర్లగోత్రీయులగు వెలమవీరులలోఁ బలువురు కాక
తీయులకడ సేనానాయకులుగ నుండి కాంచీనగరము భేదించి
చోడరాజుల జయించితిమనియుఁ గాంచీరాజ్యలక్ష్మిని గాకతీ
యుల కైవసము గావించితిమనియు వ్రాసికొనియున్నారు.
ఆంధ్రదేశమునకుఁ గాంచీరాజ్యము మిగుల దూరముగా
నుండుటచేఁ గాకతీయులు మాటిమాటికిఁ గాంచీనగరము
లోఁబఱచికొనుటయు మఱలఁ గోల్పోవుటయుఁ బలుమాఱు
జరిగియుండును. రుద్రదేవుని కాలమునఁ గాంచీనగరమును రేచెర్ల
నామిరెడ్డి జయించి చోడరాజు నవమానపఱచి తద్రాజ్యలక్ష్మిని
రుద్రదేవుని యధీనము గావించినటుల శాసనదృష్టాంతములు
గలవు. రుద్రదేవుఁడు తన యవసాన దశలో గణపతిదేవునకు
రాజ్యము నొసంగెను. గణపతిదేవుఁడు మహాదేవరాయలకుమా
రుఁడు. రుద్రదేవుని కాలము క్రీ॥ శ॥ ౧౧౪౦ మొదలుకొని
౧౧౯౬ వఱకై యుండునని చరిత్రగ్రంథములవలనఁ దెలియు
చున్నది. ఆంధ్రజాతీయతకు ఆంధ్రవికాసమునకు ఆంధ్రజాత్య
భ్యుదయమునకు సహకారిగ నాంధ్రసామ్రాజ్యము స్థాపించిన
వీరవతంసుఁడగు రుద్రదేవుని జీవితచరిత్రము పఠనీయము. ఈ
మహనీయుని చరిత్రమెంతయో గ్రంథస్థము గావలసియున్నది.
చరిత్రకారు లీతనిఁ బ్రథమప్రతాపరుద్రుఁడని వ్యవహరించు

చున్నారు. ప్రతాపరుద్రనామమె యీయనకు లేనపుడు రుద్ర దేవుఁడని వ్యవహరింపక ప్రతాపరుద్రుఁడనుట యుక్తముగ లేదని మేము రుద్రదేవుఁడనియే వ్యవహరించితిమి.

---

# కన్నమదాసుఁడు.

పలనాడు రాజ్యము పాలించు నరసింగరాజు, నలగామ రాజు అను రాజులయొద్ద నాయకురాలను రెడ్డియువతి మంత్రి పదవియందుఁ బ్రవేశించి యంతకుముందు మంత్రిగానున్న రేచెర్లగోత్రుఁడును వెలమ వీరుఁడునగు శీలము బ్రహ్మనాయని వెడలనడిపించెను. బ్రహ్మనాయఁడు బాలమలిదేవాది రాజకుమారులను వెంటఁబెట్టుకొని గురుజాలకుఁ గొంచెము దూరమునందున్న యడవిప్రదేశముఁ తెగనఱికి మాచర్లయను నగరము కట్టించి యందుండెను. బ్రహ్మనాయకుఁడు పేరునకు మంత్రియైనను రాజ్యచక్రము తానే త్రిప్పుచుండెను. పలనాటి సీమలో బ్రహ్మనాయని దేవునిగా భావించుచుండిరి. ఒక పంచమకాంత చిరకాలము సంతానము లేక పరితపించి బ్రహ్మనాయకుని యనుగ్రహమువలనఁ గొడుకు జనించెనేని ఆయన పాదములచెంతనే పడవేయుదునని మ్రొక్కుకొనెను. దైవ వశమునఁ బంచమాంగన నవమాసములు నిండినవెనుక నొక



బాలుని గనెను. బాలుని జూడఁగనే ప్రేమగలిగి బ్రహ్మనాయని కొసంగుదునని మ్రొక్కుకొన్నసంగతి మఱచి తానె పెంచుచుండెను. బాలునకుఁ గొన్నాళ్లకు గొప్ప వ్యాధివచ్చెను. స్వప్నమున నొకపురుషుఁడు కనిపించి నీవాడినమాట తప్పుటచేఁ గుమారునకు రోగమువచ్చినది. నీమాట చెల్లించుకొందువేని కుమారుఁడు చిరంజీవి కాఁగలఁడని చెప్పెను. పంచమాంగనకు వెంటనే బ్రహ్మనాయని పాదములయందుఁ బడవేయుదునన్న మాట జ్ఞాపకమునకు వచ్చి ఆరోగ్యము కలుగఁగానే వాగ్దానము నెఱవేర్చుకొందునని మ్రొక్కుకొనఁగా బాలునకు దినక్రమమున ఆరోగ్యము కలిగెను. పంచమకాంత ఒక శుభముహూర్తమున బాలుని గొనిపోయి బ్రహ్మనాయని పాదములముందుంచి యిటుల విన్నవించెను: "మహారాజా! నీవరప్రభావమున నాకీకుమారుఁడు జనించినాఁడు. బాలుఁడు జనించినచో నీపాదములమీఁద వేయుదునని మ్రొక్కుకొని మఱచితిని. అందుచే దీరని వ్యాధులవలన నిన్న మొన్నటివరకు నవిసినాఁడు. నావాగ్దానము నెరవేర్ప నుంటినని మ్రొక్కుకొనఁగా బ్రతికినాఁడు. నేనుకన్నంతమాత్రమునఁ దల్లినికాను. నీధర్మపత్నియగు ఐతమ్మయే యీబాలునకుఁ దల్లి. మీరే తండ్రి. బాలునిపోషించు భారముమీఁది" ఇట్లువిన్నవింపఁగనే నాయఁడానందమొంది బాలుని గైకొని శిరముమూర్కొని పెంచుకొనుమని ధర్మపత్ని కొసంగెను. ఆయమయుఁ బంచమ

బాలుఁడని కొంచెమేని సంశయింపక దాదులచేఁ బాలిప్పించుచుఁ బెంచుచుండెను. సంతానము లేదను కొఱఁతను దిగనాడి యాపుణ్యదంపతు లాబాలకునితోఁ గాలయాపనము జేయుచు నొక శుభలగ్నమున నాతనికి కన్నమదాసుఁడని నామకరణము గావించిరి. కొంతకాలమునకుఁ గన్నమదాసుఁడు పెద్దవాఁడై పాఠశాలలకేగి సమస్తవిద్యల నభ్యసించిన పిదప గరిడీ సాము వ్యాయామములు గూడ నేర్చుకొని జెట్టియయ్యెను. వర్ణాశ్రమ ధర్మములకు మిగులఁ బట్టుగల యాకాలమున బ్రహ్మనాయకుఁడు పంచముని జేరఁదీసెనని నిందింపసాగిరి. కొందఱు కన్నమనాయనియెడ నకారణద్వేషము ప్రకటించుచుండిరి. ఎందఱెన్ని విధముల నాందోళన పడుచున్నను పుణ్యదంపతులగు ఐతమ్మయు, బ్రహ్మనాయకుఁడు మాత్రము పుణ్యభావముతో నాబాలుని జూచుచుండిరి. కొంతకాలమునకు ఐతమ్మ గర్భవతి యయ్యెను. బ్రహ్మనాయని యానందమునకు మేరయే లేదు. సంతోష సూచకముగా మాచెర్ల చెన్నకేశవున కెన్నియో ఉత్సవములు, వేడుకలు చేయించి నాయఁడు మహావైభవముగా సీమంతోత్సవము జరిపించెను. శుభముహూర్తమున ఐతమ్మకుఁ జక్కనికుమారుడు జన్మించెను. బాలచంద్రునివలెఁ బ్రకాశించు నాకుమారరత్నమునకు బ్రహ్మనాయకుఁడు బాలచంద్రుఁడని నామకరణము గావించి శాస్త్రపారంగతులగు బ్రాహ్మణోత్తముల రావించి బాలుని



జనన తిథి నక్షత్రాదులను దెలిపి జాతకము వ్రాయుఁడని కోరెను. నాయకురాలివంపున వచ్చిన వంచకబ్రాహ్మణుఁడు తన విద్యాప్రకటనము గావించి బ్రహ్మనాయని లోఁగొని జాతకము వ్రాయుదునని చెప్పి సెలవొంది కొన్నిదినములకు సభ చేయించి అందుజాతకపత్రికను బఠించెను. 'బాలచంద్రుఁడు మిగుల దుర్మార్గుఁడగును. వాని జన్మనక్షత్రము చెడ్డదగుటచేఁ దనవారికి బెరవారికిఁగూడ నితఁడకాలమృత్యువై సర్వకుటుంబములు రూపు మాపఁగలఁడు. బాలకునివలని యపాయము తొలగింపవలయుననినఁ దెగటార్చుట తప్ప వేఱుకర్తవ్యము లేదని కపటజ్యోతిష్కుఁడు చెప్పెను. సభ్యులు, రాజబంధువు లొకరి మొగము లొకరు చూచుకొని బ్రహ్మనాయకుని కేమియుఁ జెప్పఁజాలక మిన్నకుండిరి. ఇదియంతయుఁ బ్రహ్మనాయఁడు కనిపెట్టి పుత్త్రప్రేమను దిగనాడి సభ్యులందఱి నడిగి యనుమతి దెలిసికొని బాలునిజంపుటకే నిశ్చయించుకొనెను. అంతలో నొక వృద్ధుఁడు లేచి 'బ్రహ్మనాయకా! బాలునిజేతి మీఁదఁజంపుటయన్న సామాన్యకార్యమా? ఎవరికిఁ జేయాడును? సముద్రమునఁ బాఱవేసిన వాఁడె చచ్చును. అదియె కర్తవ్య'మని తెలిపెను. బ్రహ్మనాయఁడు పెచ్చుపెరుగుశోకము నాపుకొని తన యభిమానపుత్త్రుఁడగు కన్నమనాయకుని బిలువనంపించి ఐతమ్మకడ జనుబాలుద్రావుచున్న యేపాపమునెఱుంగని బాలచంద్రుని దెప్పించి యీబాలకుని సముద్రములోఁ బడవేసి

రమ్మని యిచ్చెను. కన్నమనీడు చాలవిచారపడి బ్రహ్మనాయకుని మాటకు బదులుచెప్పఁజాలక సభ్యులే నివారింతు రేమోయని వారల విచారకరములు, ప్రార్థనాపూర్వకములగు చూపులతో జూచెను. సభ్యులందఱును బ్రహ్మనాయకునియాజ్ఞను సత్వరముగా నెరవేర్పుమని కన్నమనాయకుని బ్రోత్సహించిరి. బ్రహ్మనాయకుఁడు తొందరపెట్టెను. కన్నమనాయకుఁడు 'కనులు దెఱువని పసికందును అన్యాయముగాఁ జంపవలసి వచ్చినదే! ఈపసిపాపని కాపాడఁ జాలని నాబ్రదుకుఁ గాల్పనా? నే నస్వతంత్రుఁడను. జనకుఁడగు బ్రహ్మనాయకుని ఆజ్ఞకు వ్యతిరేకము జరుపఁదగదు. అనుకొనుచు బ్రహ్మనాయకుని కనుసన్నల ననుసరించి సముద్రతీరమునకుఁ బోవ చందవోలునకుఁ బ్రయాణమయ్యెను. రాజమందిరమునందును పట్టణమునందును బ్రహ్మనాయకుని గృహంబునను నాఁడు విచారమునకు మేరలేకుండెను. కన్నమనాయఁకుడు మందువేసంగిలో బాలునొక తొట్టెలోనుంచికొని పైనిగుడ్డలుకప్పి త్రోవకడ్డమగు ప్రతిగ్రామమునందును, బాలిప్పించుచుఁ గొంతసేపటికిఁ జందవోలు చేరెను. ఆకాలమునఁ గల నగరరాజములలో చందవోలు ప్రఖ్యాతమైనది. చుట్టును బ్రాకారములు, కోటలు కలవు. క్రొత్తవాఁ డెవ్వఁడు నగరమున నడుగుబెట్ట వీలులేక పోవుటచేఁ గన్నమనాయఁడు బాలకునెటులో నగరముబయటనుండి సముద్రతీరమునకుఁ జేర్చెను. జాముప్రొద్దు పోయెను. అంధకారము



నలుదిక్కుల బాగుగా నావరించి యుండెను. బాలుఁడు ఆఁకలిగొని యేడ్చుచుండెను. చేతులార పసిపాపని సముద్రములోఁ బాఱవేయఁ జాలక కన్నమ నాయకుఁడు మైమఱచి యెలుగెత్తి యేడువసాగెను. దిక్కులేని సముద్రప్రాంతమున వారల నోదార్చువా రెవరు? కన్నమనాయఁ డిటుల నేడ్చుచుండఁగాఁ జెంత నెవరో "ఎవరునీవు? ఈయర్ధరాత్రమున నిర్జనప్రదేశమందు విలపించుటకుఁ గారణమే"మని యడిగిరి. వారిరువురు నీక్రిందివిధముగాఁ జీఁకటిలోనే సంభాషించుకొనిరి.

"ఎవఁడవు నీవు? ఇచటి కేల వచ్చినాడవు?"

"నేనెవఁడనో నీకుఁ జెప్పవలసిన యవసరములేదు. ఊరక ప్రసంగింపక నీవు వచ్చినత్రోవను బొమ్ము! నీకిచట నేమిపని?"

"నేనెవఁడనో నీకుఁదెలుపవఱకు నీవృత్తాంతము తెలుపవు కాఁబోలును. జాగ్రత్తగా నొడలెఱింగి నీ కులశీలములఁ దెలుపుము, లేదా నిన్నుఖండింపక మానను."

"సంగరమునకు దొరకొన్నచో నన్ను నీవు ఖండింతువని యెటులఁ జెప్పఁగలవు? విజయము బలాబలములపై నాధారపడి యుండును. ఒకవేళ నీవే గతింతువేమో!"

"మితిమీఱి భాషించుచున్నాఁడవు. నీవు దొంగవాఁడవు కానోపుదువు. కాదేని నీవృత్తాంతము మఱుగుపఱువవలసినపని యేముండును? నగలకొఱ కీబాలకుని జంపుచుంటివి కాఁబోలు"

"నిన్నుమాత్రము చంపక విడుతునా"

చీఁకటిలోనున్న నూతనపురుషుఁడు హుంకరించుచు నొఱలోని కత్తిపెరికి కన్నమనాయుని మీఁదికి వచ్చెను. కన్నమనాయఁడు కరవాలము దీసికొని నూతనునిపైకిఁ బోయెను. ఇరువురు చాలసేపు భయంకరముగా యుద్ధముగావించిరి. ఇరువురకు దేహమంతయు రక్తమయమయ్యెను. నూతనుఁడాఁపరాని కోపముతో "ఈవేళ్టునకు నీతల తెగఁగొట్టనేని నేను బ్రహ్మనాయని తమ్ముఁడనుగాను" అనిపలికెను. కన్నమనాయఁ డులికిపడి కత్తినేలపైఁబడవేసి నూతన పురుషుని పాదములపైఁబడి, అయ్యా మీరింతకుముందు బ్రహ్మనాయకుని పేర్కొంటిరి. మీ నామధేయమేమి ? నేను బ్రహ్మనాయకుని యభిమాన పుత్త్రుఁడను. మీవృత్తాంతము వినుటకు నిరీక్షించుచున్నాను' అని పలికెను. నూతనుఁడు తాను శీలము బ్రహ్మనాయకుని సోదరుడనియుఁ జందవోలు పాలించు రాజులయొద్ద సేనానాయకుఁడుగ నుండెననియుఁ దనపేరు పేరిసీడనియుఁ దెలిపెను. నూతనుని కన్నమనాయఁడు కౌఁగిలించుకొని 'తెలియక సంగరమునకు దొరకొంటిని క్షమింపు'మని వేఁడుకొనెను. పేరిసీడు కన్నమనాయనివృత్తాంతము, బాలచంద్రుని సముద్రములో వేయవలసిన పరిస్థితులు దెలిసికొని పరితపించెను. పేరిసీడు కన్నమదాసునితో 'బాలకు నన్యాయముగా సముద్రములో వేయుటకంటె పాపము వేఱొండులేదు. నాకొసంగినచోఁ బెంచుకొందును' అనెను. బాలచంద్రునిఁ గన్నమనాయఁడు పేరిసీని కిచ్చి సెలవు



పుచ్చుకొని బ్రహ్మనాయకునితో విధ్యుక్తధర్మము నెఱవేర్చితినని విజ్ఞాపనము జేసికొనెను. బ్రహ్మనాయఁడు, ఆతని పత్నియుఁగొంచెముసేపు దుఃఖించి క్రమముగా విచారము మఱచిరి. కొన్నిసంవత్సరములు జరిగినమీఁదట పేర్నీడు బాలచంద్రుని తన వెంటఁగొని బ్రహ్మనాయకుని కప్పగించి సుగుణరత్నాకరుఁడగు కుమారుని జంపుదురా? కన్నమనాయనిదయచే నీశిశువు బ్రదికినాఁడు. లేకున్న మనవంశము నశింపవలసినదే గదాయని నిష్ఠురములాడెను. ఐతాంబయు బ్రహ్మనాయఁడును దనకుమారుఁడు మఱల వచ్చినందులకు బ్రహ్మనందము నొంది యింతటియదృష్టము కలుగఁజేసిన కన్నమనేఁడు ప్రశంసాపాత్రుఁడని యాతని వేయినోళ్ళఁ గొనియాడిరి. నాఁడు మొదలు కన్నమనీఁడు బాలచంద్రునిపైఁ దన పంచ ప్రాణములుంచి యతనిశ్రేయస్సే తనదిగా భావించి తానెఱింగిన విద్యలన్నియు నాతనికి నేర్పుచు వెంటనిడుకొని త్రిప్పుకొనుచుండెను. బాలుని విద్యావివేకములకుఁ గన్నమనేని సోదరప్రేమకుఁ బ్రజలందరు సంతసించిరి.

కొంతకాలము గడచినమీఁదట నాయకురాలు మాచెర్ల వైభవము చారులవలన నాలించి యెటులేని బ్రహ్మనాయకుని, రాజకుటుంబమును బరాభవింపఁ దలంచి పలువురు దొంగలను బిలువనంపి వారి నందఱను మాచర్లలోని రాజమందిరము, బ్రహ్మనాయకుని గృహము దోచిరండని పంపెను.

దొంగలు సకాలమునకుఁ జంద్రవంకనదీతీరమునఁ జేరి భోజ నాదు లొనరించి దొంగతనమునకు సమయ మరయుచుండిరి. బురుజు పై నెక్కి బ్రహ్మనాయకుఁడు గాంచఁ బలువురు నూతను లుకనిపించుటచే ననుమానించి అభిమానపుత్రరత్నమగు కన్న మనాయని పిలిచి దొంగలేమైనచోఁ దగినబుద్ధిచెప్పి రమ్మని పంపెను. కన్నమనాయఁడు పరివారసహితుఁడై చంద్రవంక నదీ తీరమున నున్న కంచెచెంతనిలచి యాలింపఁగాఁ బ్రసంగముల వలన వచ్చినవారు దొంగలనియు నాయకురాలిచేఁ బంపఁబడి మాచర్లదోచుటకు వచ్చిరనియుఁ దెలియవచ్చెను. వెంటనే కన్నమనాయఁడు పరివారముతో ముందునకు దుమికి ఏవ్రయ త్నములు లేక యిష్టగోష్ఠినలుపుచున్న దొంగలనందఱ బంధించి వారియొద్దఁ గలయాయుధము లన్నింటిని రాచనగరు నకుఁ బంపి గోనెలఁ దెప్పించి వానినిండ నిసుకనించి దొంగల నెత్తిపైఁ బెట్టించి గురుజాలకు నడిపించి అందఱ నొకదొడ్డిలో నికిందోలి తాను ద్వారము గాచియుండెను. కన్నమనాయఁడు తనచేఁ బంపబడిన చోరులను బరాభవించినందులకు నాయ కురాలు కోపించి తూలనాడెను. కన్నమనాయఁడు నాయకురా లొనరించిన దురంతము గురిజాలవాసులందఱకుఁ దేటతెల్ల ముగావించి నాయకురాలి నిందావచనము లన్నింటికిఁ బ్రత్యు త్తరము నొసంగి గృహాభిముఖుఁడయ్యెను. ఎంతకును కన్నమ నాయకుఁడు రాకపోవుటచే బ్రహ్మనాయకుఁడు తెల్లవారి విచా



రింపఁగా గురిజాల కేఁగినటులఁ దెలియవచ్చెను. మధ్యాహ్న మైనను కన్నమనాయఁడు గురిజాలనుండిగూడ రాకపోవుటకుఁ జాలచింతించి బ్రహ్మనాయఁడు స్వయముగా గురజాలకుఁ బయన మయ్యెను. కన్నమనాయఁడు తిప్పక సురక్షితముగా రాఁగలఁడు. మీరు గురుజాలకుఁ బోవలదని నాయనితో భటులు, ఆప్తులుచెప్పిరిగాని ఆతఁడు వినక బయలుదేరెను. కన్నమనా యఁడు గావించిన పరాభవము తలంచికొని నాయకురాలు ప్రతిక్రియకొఱకు వెదకుసరికి బ్రహ్మనాయకుఁడు గురిజాల చేరి తనకుమారుఁడు సురక్షితముగాఁ జోరులను వంచించిన విషయము విని చాలసంతసించెను. నాయకురాలు గురిజాల నడివీధిలో కోడి పందెములు, పొట్టేళ్ళ పందెములు, పికిలిపిట్టల పందెములు, కౌజు పందెములు, పెట్టి యెటులో బ్రహ్మనా యకు నొప్పించి యందుఁ దానెగెలిచెను. ఓడినవారు ఏడు సంవత్సరములు అరణ్యభూములలో నివసించి పిదప రాజ్యముఁ బొందునటులఁ గట్టడి చేసికొనుటచే బ్రహ్మనాయకుఁడు పరి వారముతో నడవులపాలై నియతకాల మెంతో శ్రమమీఁద జరిపి తన రాజ్యము తనకు వశముచేయుమని రాజకుమారుల పక్షమున నలగాము రాజాదులకు వర్తమాన మంపెను. కన్నమ నాయఁడు రాయబారములతోఁ గార్యమెన్నఁటికేని యనుకూ లింపదనియు ఏడు సంవత్సరములనుండి రాజ్యమును జూర గొన్న విరోధులు మాటలతోఁ దిరుగ రాజ్యము నొసంగ

రనియు సంగరమున కాయితమగుట యుక్తమనియు బ్రహ్మ
నాయకునితో విన్నవించెను. బాలచంద్రుఁడు గూడ సంగర
ము చేయుటయందుఁ దనకుఁగల యుత్సాహము సూచించెను.
బ్రహ్మనాయకుఁడు కొమ్మరాజు పుత్త్రుఁడును ప్రతిపక్షరా
జగు నరసింగరాజున కల్లుఁడునగు అలరాజును సంధివిషయమై
ప్రసంగించుటకు గురిజాలకు వృద్ధబంధుజనానుమతంబునఁ బం
పెను. సంధిప్రయత్నము వ్యతిరేకమైనచో సంగరమునకేని సిద్ధ
ముగా నుండవలయునని బ్రహ్మనాయఁడు బంధువులకు ఆప్త
లకు ముందుగఁ దెలిపి యుద్ధపరికరములను జాగ్రత్త పఱచు
చుండెను.

బ్రహ్మనాయని పక్షమువారికిని నాయకురాలిపక్షము
వారికిని సంధికుదురకపోయెను. సవతితల్లికుమారులగు బాలమలి
దేవాదులకు రాజ్యములో భాగమునీయమని నలగామరాజు
ఖండితముగాఁ దెలిపెను. రాయబారమునకు నేఁగిన అలరాజును
నిర్దయగా వధించిరి. ఏడుసంవత్సరములు అజ్ఞాతవాసము జేసి
వచ్చిరని గూడ సవతితల్లి కుమారులపై నలగామరాజునకు నర
సింగరాజునకు నాయకురాలికిఁ గరుణరాదయ్యెను. సంగరము
నకుఁ గారముపూడిచెంత నాగులేటితీరమునఁ గల విశాలప్రదే
శమును నెలవుచేసికొని యుభయపక్షములవారు చాల భయం
కరముగాఁ బోరాడిరి. కన్నమనాయఁ డీసమయమున సంగరవిధ
మును బ్రహ్మనాయని కెఱుఁగఁజేయుచు నుండెను. శత్రు



పక్షము విస్తారముగ నుంటచే బ్రహ్మనాయఁడు కన్నమనాయ
కుని బ్రోత్సహించి విజయము గలుగువఱకు సంగరము గావిం
పుమని వీరతాంబూలము నొసంగెను. కన్నమనాయఁడు భైరవ
ఖడ్గము బట్టుకొని యుద్ధరంగమున కుఱికి శత్రువుల నందఱను
అరటిచెట్లులను నఱకినటుల నఱుకుచుండెను. వీరు లెవరును
కన్నమనాయని నెదిరింపఁజాలరైరి. రణరంగము క్షణము
సేపులో రక్తప్రవాహములతో నిండిపోయెను. ఎక్కడఁజూచిన
తానయై కన్నమనాయఁడు బ్రహ్మనాయకుని యాన శిరసావ
హించి శత్రుబలమునంతయు నిరవశేషముగావించెను. ఉభయ
పక్షములందును పేరుగల వీరులందఱు మరణించిరి. ఏకపుత్త్రుఁ
డగు బాలచంద్రుఁడు గూడ మరణించెనని బ్రహ్మనాయకుఁ డిం
చుక విచారపడి మఱల ధైర్యము గొని కర్తవ్యము యోచించు
సరికి కన్నమనాయఁడువచ్చి నాయకురాలు దక్క మిగిలిన శత్రు
బలమంతయు నాశనమయ్యెనని విన్నవించెను. బ్రహ్మనాయఁడు
కన్నమనాయనిఁ గౌఁగిలించికొని 'కుమారా! నాఋణముతీర్చి
కొంటివి. నీకదనప్రశస్తి లోకమునంతయునచ్చెరువుపెట్టినది. మన
ము ప్రపంచములోనికివచ్చి పుణ్యమో పాపమో గడించితిమి.
ఆప్తులందఱు మరణించిరి. నాయకురాలొకతె జీవించి యేమి
ప్రతిఘటింపఁ గలదు? కావున మనమిఁక నూర్ధ్వలోకముచేర
నదను సమీపించినది. సంగరమునకు ముందు మన కులకాంతల
నందఱను మేడపిలో నుంచివచ్చితిమి. వారలనందఱను ఇచ్చ

టికిఁ గొనిరమ్ము. విశ్వాసపాత్రుఁడవు నీవు పోయినఁగాని వారురారు. తత్క్షణమ కొనిరమ్మ'ని చెప్పెను. కన్నమనాయఁడు ఆనవాలుగా బ్రహ్మనాయకుని ఖడ్గము దీసికొని మేడపికిఁ బోయి యటనున్న కాంతాసమూహమునకు సంగరక్రమమ్మునంతయు నివేదించి బ్రహ్మనాయకుని యాజ్ఞదెలిపెను. రాజపత్నులు, కులకాంతలు, తమ బంధుబృందము మరణించి నందులకుఁ జాలనేపు దుఃఖించి బ్రహ్మనాయుని సన్నిధికిఁ బ్రయాణమైరి. బ్రహ్మనాయఁడు గతించిన వీరుల యస్థికలు దీసికొని సమీపమునందున్న గుత్తికొండ బిలములోని ప్రవాహమునందుఁ గలుపఁబోవుచుఁ గులకాంతల నందఱను వెంటఁగొని యందుఁబ్రవేశించి యొక్కొక్కరి పేరుతోఁ దిలోదకములొసంగుచుండెను. బ్రహ్మనాయఁడు సకుటుంబముగా బిలములోనికిఁ బోయి యున్నాఁడుగావున నీసమయము బిలద్వారము మూసితిమేని యాతఁడు మడియఁగలఁడని తలంచి నాయకురాలు కొందఱు భటులను ద్వారము మూయఁబంపెను. కన్నమనాయకుఁడా సంగతిగ్రహించి ద్వారము మూయుచున్న వంచకులనందఱను ఖండించి వారలను బ్రోత్సహించిన నాయకురాలినిబట్టి తెచ్చెను. బ్రహ్మనాయఁడు వీరులందఱకు ఉత్తరక్రియలాచరించినంతనె వీరకాంతలందఱు సహగమనము సలిపి పుణ్యలోకములు బడసిరి. నాయకురాలు బ్రహ్మనాయని పాదములకు నమస్కరించి యెఱుంగక కావించిన సాహసమునకు మన్నింపు



మని ప్రార్థించెను. దయాస్వభావుఁడగు బ్రహ్మనాయకుఁడు నాయకురాలికిఁ బూజాకుసుమములు, తీర్థము నొసంగి యాదరించి బిలమునందలి ప్రవాహమునందుఁ జొచ్చి యదృశ్యమయ్యెను. కన్నమనీఁడు బ్రహ్మనాయనికి భక్తివిశ్వాసములతో దర్పణాదు లొసంగి తానును బ్రవాహమునఁ జొచ్చి యంతర్హితుం డయ్యెను.

కన్నమనేఁడు ఆకాలమున మిగుల హీనముగా భావింపఁబడు పంచమకులమందుఁ బుట్టినను బుద్ధివిశేషమునను ధర్మాచరణమునందును భూతదయయందును అగ్రవర్ణులకంటె యోగ్యుఁడని ప్రశంసింపఁ దగినవాఁడు. ఈతఁడు పిత్రాజ్ఞానిర్వాహణమునందు శ్రీరామచంద్రునకు, సోదరవాత్సల్యమునందు ధర్మరాజునకుఁ, బరాక్రమమునందు గర్ణునకు సమానుఁడు. దీనత్రాణ పరాయణుఁడును సర్వభూత ప్రియుఁడునగు బ్రహ్మనాయని క్రమశిక్షవలననే కన్నమనాయఁడు విఖ్యాతిసందెను. అగ్రవర్ణులమని చెప్పుకొను వీరపురుషులు సంస్కర్తలై బ్రహ్మనాయనివలెఁ బంచములఁ బ్రేమించి యుచితవిద్యా వివేకమునుప్రసాదించి ముందునకుఁ గొనితెచ్చినచో నాఁడు మొదలు నేఁటివరకు నెందరు కన్నమనాయనివంటి వీరచూడామణులు, దేశభక్తు లుదయించువారో గదా! పలనాటి యుద్ధములో గతించిన వీరులతోఁబాటు కన్నమనాయనికిఁ గూడ వీరపూజ నాఁటినుండి నేఁటివరకు జరుగుచున్నది. కన్నమనాయని నేఁటికిని

బంచములకంటె నితరాగ్రవర్ణులే విశేషించి పూజించుచున్నారు. దేశభక్తి, బలపరాక్రమములు, పితృభక్తి, ధర్మనిష్ఠ, సేవాదీక్ష లోనగు మానవ ధర్మములను నిర్వహించుటలో నసమానుఁడగు కన్నమనేని యాదర్శములు ఆంధ్రలోకమునకు మార్గదర్శక మగుగాక!

[ఆంధ్రమంత్రులు అను గ్రంధమునందలి బ్రహ్మనాయని చరిత్రము, ఆంధ్రవీరులు మొదటిభాగమునందలి బాలచంద్రుడుఅను వీరులచరిత్రము పఠించినచోఁ గన్నమనేని చరిత్రమునందు సూచింపబడిన ప్రధానకథాంశములు ద్యోతక మగును.]

# వేమారెడ్డి

ఆంధ్ర రాజులలో రెడ్డివారు ప్రథమగణ్యులు. స్థానాంతరములం దుంటచే వీరు జాతిసాంకర్యములు కలుగకుండుటకుఁ దమశాఖను పెక్కుఉపశాఖలుగా విభజించి యందుండి గుంపులని చిన్నతెగల విడఁదిసి సంబంధ బాంధవ్యములు జరుపుకొనుచున్నారు. వీరలు చిరకాలమునుండి ఆంధ్రదేశమునందు నివసించి కాకతీయ సామ్రాజ్యము మహోన్నత దశయందున్నపుడె స్వతంత్రరాజులుగ సేనాధీశ్వరులుగా నుండి క్రమముగాఁ బ్రత్యేకరాజ్యములను స్థాపించిరి. వారిలో వేమారెడ్డి గణనీయుఁడు.



వేమారెడ్డివంశమునందు దొంతిఅల్లాడరెడ్డి మూలపురుషుఁడని స్థానికచరిత్రములందుఁ గలదు. ఇప్పటిచరిత్రకారులదృష్టిలోని కీతఁడు రాకపోవుటచే నీపేరుగలవాఁడు లేడనుచున్నారు. చరిత్రాంశములతో నేకీభవించు స్థానికచరిత్రములకుఁ బ్రాముఖ్యమీయక తప్పదుగానఁ గూటస్థుఁడుగాఁ దలంపఁబడు నీవీరుని చరిత్రము నెఱుంగుదము. దొంతి అల్లాడ రెడ్డి పంటరెడ్డి కులములో జనించినవాఁడు. నిజాము రాష్ట్రమునందలి చెదలువాడలో నీతఁడు వ్యవసాయము చేసికొని జీవించుచుండెను. ఒకనాఁ డీరైతు భూమిదున్నుచుండఁగా లంకెల బిందెలు బంగారు నాణెములతో నిండినవి దొరకెను. గ్రామవాసులందఱు ఆధనము హరింపవలయునని యత్నించుచుండుటచే రాజధానిగా నుండు అనుమకొండకుఁ జేరి యచటనొక సువర్ణ వీరరాఘవ విగ్రహము చేయించి పూజించుచుండెను. అచ్చటగూడఁ గొన్నియపాయములు కలుగుచుండుటచే అల్లాడరెడ్డి ధనవస్తువాహనాదులతో కొండపల్లి సీమకువచ్చి కవులూరునందును ధరణికోటయందును బ్రాసాదములు గట్టించి సుఖముగా నుండెను. కొంతకాలమునకు దురదృష్టమున ఓరుగల్లు రాజ్యమును బరిపాలించు ప్రతాపరుద్ర చక్రవర్తిని తురకలు బంధించి ఢిల్లీనగరమునకుఁ గొంపోయిరి. సామంత

రాజులు, సేనానాయకులు స్వతంత్రసంస్థానములు స్థాపించిరి. అపుడు రాజప్రతినిధిగానుండి నూతనరాజ్యములు స్థాపించినవారిలో ప్రోలయరెడ్డి యొకఁడు. ఈయన తరువాత రాజ్యమునకు వచ్చి ఆంధ్రదేశమున నసమానకీర్తి గడించిన మహావీరుఁడే మనకథానాయకుఁడును శూరచూడామణియు నగు వేమారెడ్డి భూపాలుఁడు.

వేమారెడ్డి పూర్వులు సంపదలతోఁ దులదూగుచు దుర్గములు కట్టుటకు ధనము నార్జించిన విషయము దెలుపు నొక చిత్రకథ వాడుకలో నున్నది. కథయొక్క సత్యాసత్యము లెటులున్నను వినుట కుత్సాహకరముగా నుంటచే నిట నుదాహరించుచున్నారము. దొంతి అల్లాడరెడ్డి కవులూరిలోనుండి అతిథిపూజాతత్పరుఁడై ప్రఖ్యాతుఁడై యుండు నపుడు ఆయన యింటికి అకాలమున నొక వైశ్యుఁడు వచ్చెను. అల్లారెడ్డి అతిథిపూజా తత్పరుఁడుగాన ఆగతుఁడగు వైశ్యుని మిగుల నాదరించి ఆహారము చేసికొనుటకు వలయుపాత్రముల వస్తువుల నొసంగఁగా నా వైశ్యుఁడు తనయొద్దనున్న పసరుబరిణెగల గుడ్డల మూటను చిలుకకొయ్యకుఁ దగిలించి వంటపని మీఁదబోయెను. కొంతసేపటికి పసరు తొణికిపడుటచే క్రింద నున్న యినుపములుకు లన్నియు బంగారమయ్యెను. అల్లాడరెడ్డి చూచి మిగుల నాశ్చర్యమునొంది మూటలో నేమి గలదో చూడఁ బసరుండెను. దానిని ఏలోహముమీఁదఁ బోసినను



బంగారముగా మాఱుచుండెను. వర్తకున కీపసరు చిక్కనీయక హరించి దీనిసహాయమున ధనము విశేషముగా నార్జించి రాజ్యము స్థాపింపనెంచి పసరుబరిణెమూఁటను దనగృహములో దాఁచి పసరుమూట తొలుత వర్తకుఁడుంచిన గృహమునకు అల్లాడరెడ్డి నిప్పుపెట్టెను. గృహము కాలిపోవుట చూచి వైశ్యుఁడు పరుగెత్తుకొనుచువచ్చి తాను సేకరించిన పసరుమూటకూడ నందే కాలిపోవుచున్నదని తలంచి వింధ్యాద్రికేగి మహాయోగుల నాశ్రయించి తానార్జించిన దివ్యరసము తగులఁబడిపోవుచున్నందులకు విచారపడి తానును అగ్నిహోత్రమునం బడి మరణించెను. గతమునకు అల్లాడరెడ్డి వగచి నిదురింప రాత్రి వేళ వర్తకుఁడు కలలోనికివచ్చి 'రెడ్డిదొరా! నీకు లభించిన పరుసవేదితో ధనము నార్జించి దేవళములు కోటలుగట్టి పరోపకారివై జీవింపుముగాని యందొక కాసునేని స్వాయముగా నుపయోగించుకొనకుము. చిరకాలము పెద్దలసేవించి పడసిన స్పర్శవేది అదృష్టవంతుఁడవగుటచే సులభముగా నీకు లభించినది. నాపేరు వేమన్న. నేనింత మహోపకారము నీకుఁ గావించితినిగాన నీసంతతి కంతకు నా వేమనామము పెట్టుము." అని చెప్పెను. అల్లాడరెడ్డి అందుల కియ్యకొని యాధనమును గోటలు, పేటలు గట్టించి ప్రజోపయోగముగా వినియోగించెను. ఈ కథ కొండవీడు, కొండపల్లి, ధరణికోట ప్రాంతములలో

వాడుకగానున్నది. ఈకథకును వేమారెడ్డినామమునకును గల సంబంధ మెంతవఱకు సత్యమో తెలుప వీలుకాకున్నది.

వేమారెడ్డి క్రీ. శ. ౧౩౨౦ మొదలు ౧౩౪౯ వఱకు రాజ్యము పాలించెనని చరిత్రవిదులు తలంచుచున్నారు. ప్రతాపరుద్ర చక్రవర్తి తురకరాజులతోఁ బోరాడి స్వాతంత్ర్యము నిలుపుకొను సమయమున దేశము చాలవఱకుఁ బరాధీనము కాసాగెను. అపుడు వేమారెడ్డి కొన్నిదుర్గముల లోఁబఱచికొని పాలింపఁదొడఁగెను. ఇంతలోఁ గాకతీయరాజ్యమస్తమించుటతో వేమారెడ్డి మిగుల స్వతంత్రుఁడయ్యెను. పిదప వేమారెడ్డి ఆంధ్రదేశమును తురకల హస్తగతము గాకుండఁ గాపాడెను. తురకలు హరించిన దేవబ్రాహ్మణ వృత్తులు తిరుగసాధించి తానుస్వయముగా పూర్వగృహీతలకు ధారపోసి వైదికమతమును నిలువఁబెట్టెను. ఓరుగల్లు మొదలుకొని కొండపల్లి వఱకుఁగల దేశమును వెలమవా రాక్రమించుకొనిరి. రాచవారు తిరుగఁబడి వెలమవారి స్వతంత్రమును బడఁగొట్ట యత్నించుచుండిరి. ఈ యంతఃకలహములను గుర్తించి తురుష్కులు దండయాత్రలు గావించుచు ఓరుగల్లు ప్రాంతములను గొల్లగొట్టుటచూచి ధరణికోట ప్రాంతములందుఁ దన ప్రతినిధులను నిలిపి విరోధులెవరును గృష్ణదాటి రాకుండను దేశమునందు నెట్టి యశాంతి పొడసూపనట్లు వేమారెడ్డి మిగుల జాగ్రత్తగాఁ గట్టుబాటులు చేసెను. క్రమముగా రాచ



వారు రాజ్యసంపదలఁ గోలుపోయి పద్మనాయకులధాటికోర్వఁ జాలక యితర ప్రాంతములకు వలసఁబోయిరి. పద్మనాయకులనఁబడు వెలమవీరులు ఓరుగల్లు మొదలుకొని కృష్ణవరకుఁ బాలించుచుఁ దరుణముగనిపెట్టి రెడ్డిరాజ్యమును గూడఁగబళింపవలెనని పలుమాఱు ప్రయత్నించి సరిహద్దులలో భయంకర సంగ్రామము లొనరించి విఫలప్రయత్నులై వెనుకకు మఱలిరి. నాఁటనుండి రెడ్డివారికి వెలమవారికిఁ జిరకాలము తగవులు, సంగరములు జరుగుచు వచ్చెను. వేమారెడ్డి తన రాజ్యమునం దంతటను రాజప్రతినిధులుగాఁ దన సోదరులను అగ్రజులను, జ్ఞాతులను, మాతామహకుటుంబమువారిని నుంచి తాను అద్దంకి రాజధానిగా జేసికొని నెల్లూరు మొదలు గోదావరీ మండలమువఱకుఁ బరిపాలించెను. కర్నూలు మండలము గొంత భాగమును, కృష్ణా గుంటూరు మండలములు పూర్తిగను, నెల్లూరి మండలములోఁ జాలభాగమును, గోదావరీ మండలములోని తూర్పు భాగమును వేమారెడ్డి పాలించెనని విశ్వసింపవచ్చును. ఈయన మన్నెరాజులను గూడ గెలిచితినని చెప్పుకొనుటచేఁ గటకమువఱకు దండయాత్రల కేఁగెననియు నాప్రాంతము లచిరకాలమునకె పరహస్తగతమై యుండు ననియుఁ దలంచవచ్చును. వేమ భూపాలుఁ డార్యధర్మములను నెలకొల్పుటలోను బునరుద్ధరించుటయందును మిగులఁ జేరెన్నిక గాంచెను. ప్రతాపరుద్రదేవుని ధర్మములు ఖిలమై యువన

పరిపాలనమున విచ్ఛిన్నముకాఁగా వేమారెడ్డి తాను ప్రభుత్వ
మునకువచ్చి పునరుద్ధరించినటుల అమరావతిశాసనమునందుఁ
జెప్పుకొనినాఁడు.

వేమారెడ్డి గతించినను అతనివంశము నశించినను నేఁటి
వఱకు నాతని ధర్మములు శాశ్వతముగా నున్నవి. వేమవరము
అను పేరుతో నెన్నియో గ్రామములుకట్టించి వేదవేదాంగ
విదులగు బ్రాహ్మణులకు దానముచేసివైదికమతమును నిలువఁ
బెట్టెను. నూటయెనిమిది దేవాలయములు కట్టించి యందీశ్వర
ప్రతిష్ఠగావించి, నటులకు గాయకులకు భజనపరులకు అర్చకు
లకుఁ బుష్కలముగా వృత్తుల నొసంగెను. దుర్గమముగా నున్న
శ్రీశైలమునకును అహోబిలమునకును మెట్లుకట్టించి యాత్రి
కులకెంతయో సౌకర్యము కలుగజేసెను. విరోధులను రాజ్యపు
సరిహద్దులలో నేని అడుగిడ నీయకుండ జాగ్రత్తచేసి ప్రఖ్యాతి
నొందెను.

వేమారెడ్డియొద్ద రాజ్యాంగ విదుఁడును బరిపాలనా
కౌశలుఁడును ధర్మపరాయణుఁడును నగు కాశ్యపగోత్రసంజా
తుఁడైన రామాప్రెగడయు నతని యనంతర మాతని మనుమఁడగు
మల్లినాథుఁడును మంత్రులుగానుండి రాజ్యమును మిగుల నభి
వృద్ధిలోనికిఁ గొనివచ్చిరి. సేనానాయకులుగా సహోదరులగు
అన్నారెడ్డియు, మల్లారెడ్డియు, గుమారుఁడగు అనపోతారెడ్డి
యు, మేనమామ కుమారుఁడగు సూకారెడ్డియునుండి రాజ్యాభి



వృద్ధికి సహకారులైరి. వీరిలో మల్లసేనాని విద్యాప్రియుఁడు.
ఎఱ్ఱాప్రెగడ మహాకవి నీ మల్లసేనాని తొలుతఁ దన యాస్థానము
నందుఁ గవిగా నుంచికొని గౌరవించి చిరకాలము పోషించి
పిదప వేమభూపాలకుని ప్రాపకమునందుఁ జేర్చెను. సముద్ర
తీరమునందున్న కురుమలూరునం దీమల్లారెడ్డి నివసించి ద్వీపాం
తరముల నుండి పడవలపై వచ్చు విదేశవస్తువులకు సుంకములు
నిర్ణయించుచు నుండెను. ఈయన కవితాభిమానము గలవాఁడు
గాన మిగులఁ బ్రశంసాపాత్రుఁడు. వేమారెడ్డి రాజ్యము
పాలించు సమయమున మోటుపల్లి గొప్ప రేవుపట్టణముగా
నుండెను. కాకతీయరాజులచట శుల్కాధికారి నుంచి దిగు
మతి సరకులకుఁ బన్నులువిధించి శాసనశిలలను బ్రాతించిరి.
వేమారెడ్డి యాజ్ఞను బురస్కరించుకొని సోదరుఁడగు మల్లారెడ్డి
అపరిమిత పరివారసహితుఁడై విరోధిహస్తగతమై యున్న
మోటుపల్లిని జయించెను. అది మొదలు రెడ్డిసామ్రాజ్యమునకు
సుంకముల వలన మితిలేని యాదాయము వచ్చుచుండెను.
నూకారెడ్డి ధరణికోట ప్రాంతములనుండి వెలమవీరులగు అన
పోతానాయకుఁడు, మాదానాయకుఁడు ముందునకు రాకుండఁ
బలుమాఱు నిలువరించెను. కటకాధీశ్వరుఁడగు గజపతిని
కృష్ణ కావలనే యెదిరించి వెనుకకుఁ బాఱఁదోలెను. వేమా
రెడ్డి శివభక్తుఁడైనను వైషమ్యభావమును విడచి శివకేశవ దేవా
లయములు ప్రతిష్ఠించుటయే గాక యన్నింటికి సమానముగా

వృత్తుల నొసంగెను. అవచి దేవయసెట్టియను కోటీశ్వరుఁడగు వైశ్యుఁడు వేమారెడ్డికి సహకారిగను మిత్రుఁడుగా నుండి వలయు సమయముల నెంతయేని ధనసహాయము గావించుచుండెను. అవచి దేవుఁడు శివపూజా విధానమునందును అతిథి పూజా తత్పరత యందును దానధర్మ విధానములందును నిరుపమానుఁడై కీర్తిగడించెను.

వేమారెడ్డి విద్యాతపో వృద్ధులగు బ్రాహ్మణులకు పెక్కు లగ్రహారముల నొసంగెను. దేవాలయములు, తటాకములు ప్రతిష్ఠించి పరోపకారబుద్ధి ప్రకటించెను. చలివెందరలు, సత్రములు, తోఁటలు నెలకొల్పి సప్తసంతానములఁ బూర్తి చేసెను. ధర్మశాస్త్రములందుఁ జెప్పఁబడిన సమస్తధర్మములు యథాశాస్త్రీయముగాఁ గావించెను. తనయెడ భక్తిగలవాఁడై రాజ్యక్షేమమునకై పాటుబడుచున్న సోదరుఁడగు మల్లారెడ్డికిఁ బుణ్యము కలుగునటుల అమరేశ్వరస్వామి దేవాలయ శిఖరముపైఁ గనక కలశములను బ్రతిష్ఠించెను. వేమారెడ్డి పరిపాలనమం దెట్టి దండయాత్రలుగాని సంగరములుగాని లేకపోవుటచేఁ బ్రజలు సుఖముగానుండిరి. సుంకములు, పన్నులు మిగుల స్వల్పముగ నుంటచే వ్యాపారము, వ్యవసాయము మిక్కిలి యభివృద్ధిలోనికి వచ్చెను.

వేమారెడ్డి కవితాగౌరవము గలవాఁడు. పలువురు కవులీనృపాలు నాశ్రయించి పద్యములు రచించి సత్కారముల



నొందిరి. ఈయన రాజకీయ వ్యవహారములు ముగించుకొన్న పిదప విశ్రాంతికాలమునంతయుఁ బండితులతో విద్యావినోదము లొనరించుచుఁ గడపుచుండువాఁడు. రాజ్యమునందలి ప్రసిద్ధ విద్వాంసు లందఱు ఆస్థానమున కేతెంచి సాహిత్యవినోద ప్రసంగములతోఁ గాలముగడుపు చుండువారు. ఆంధ్రకవులలోఁ బ్రసిద్ధుఁడగు ఎఱ్ఱాప్రగడ మహాకవి వేమభూపాలుని యాస్థానమునందుండి తొలుత రామాయణము పద్యకావ్యముగా వ్రాసి యంకితము గావించెను. ఆ మహాకావ్యమునందలి పద్యములు కొన్ని లక్షణగ్రంథములందు మాత్రము కనుపించుచున్నవి. ఇపు డా గ్రంథరాజమెందును గోచరింపదనుట సంతాపకరము. ఎఱ్ఱాప్రగడగ్రంథములలో సమగ్రమైనది ఆంధ్రమహాభారతముతో అన్నివిధముల సమానముగాఁ దులదూఁగఁ దగినది హరివంశము. ఇట్టి యుత్తమకావ్యమును ఎఱ్ఱాప్రగడ రచించి వేమభూపాలుని కంకితముగావించి యసమానకీర్తి కల్పించెను. ఎఱ్ఱాప్రగడవంటి మహాకవిచే నంకితము నొందఁగల్గిన వేమారెడ్డి సుకృతము ప్రశంసాపాత్రము. తనజీవితము వైదికధర్మ సంరక్షణము కొఱకును ధనమునంతయు రాజ్యస్థాపనము, చిత్రకళాపోషణము లోనగు సత్కార్యములకును, అవకాశము విశ్రాంతి ధర్మశాస్త్రాధ్యయనాదికములకు నుపయోగపరచి ఆంధ్రదేశ చరిత్రమునందుఁ బ్రథమగణ్యుఁడైన వేమభూపాలుని చరిత్రము చాలవఱకు మఱపునకు వచ్చుచున్నదని తెలు

పుటకుఁ బరితాపము కలుగుచున్నది. చిరకాలము వేమారెడ్డి బాహుదర్పమున మొక్కవోని పరాక్రమమున రాజ్యమ్మును బరిపాలించి తన జ్యేష్ఠపుత్త్రుఁడును ధర్మవిదగ్రగణ్యుఁడునగు అనపోతారెడ్డికి రాజ్యభారమునర్పించి కీర్తికాంతను భూలోకమున శాశ్వతముగా నెలకొల్పి స్వర్గలోక మలంకరించెను.

---

# హరిహరరాయలు—బుక్కరాయలు

---

ఆనెగొంది రాజధానిగాఁ జేసికొని ఆంధ్రకర్ణాట దేశములను బాలించుచున్న జంబుకేశ్వరరాయలు ఢిల్లీనుండివచ్చిన మహమ్మదీయ సైన్యముతోఁ జిరకాలము పోరాడి వీరమరణ మొందెను. రాజ్యాంగవిదుడగు మహమ్మదీయనృపుడు తన కెంతకును రాజ్యము స్వాధీనము గాకపోవుటచేఁ బ్రజావిశ్వాసపాత్రుఁడగు హరియప్ప వడయరు అనుమంత్రిని రాజుగఁ జేసి సుంకములు సకాలమునఁ జెల్లించు కట్టుబాటులొనర్చి తన రాజ్యమునకు వెడలి పోయెను.

కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమై ప్రతాపరుద్ర చక్రవర్తి బంధీకృతుఁడుగ ఢిల్లీకి యవనులచేఁ గొనిపోఁబడిన పిమ్మట మరల స్వతంత్రరాజ్యస్థాపనమున కవకాశములు కలుగకపోయెను. యవనులధాటికి తాఁగఁజాలక ప్రజలు సుభిక్షముగానున్న యుత్తర ప్రదేశములకు వెడలిపోయిరి. వెలమవీరుఁడగు అనపోతానాయకుఁడు స్వతంత్రరాజ్యము స్థాపించెను గాని సరియగు దుర్గములు, విశ్వాసపాత్రులగు పరిజనులు లేకపోవుటచే యవనులధాటివలన నారాజ్యముగూడ క్షీణించుచుండెను. ఈపరిస్థితులు గమనించి ఆంధ్రసామ్రాజ్యమునందు సుగంధ భాండాగారాధ్యక్షులగు హరిహరరాయలు, బుక్కరాయలు అను వీరసోదరులు అమితధనసంపత్తితో, వస్తువాహనములతోఁ, బరివారముతో విద్యారణ్య స్వాములవారి ప్రోత్సాహమున స్వతంత్రరాజ్యము స్థాపించుటకు అనుకూల ప్రదేశములు వెదకుచుఁ గొన్నిదినములకుఁ బైనిచెప్పిన ఆనెగొందికిఁ జేరి రాజును లోఁబఱచికొని తామె రాజుగ రాజ్యము పాలించుచుండిరి. విద్యారణ్యులు నూతన సామ్రాజ్య స్థాపనకు వలయుప్రయత్నములు చేయుచుండెను.



హరిహరరాయలను బుక్కరాయలను వెంటనిడుకొని విద్యారణ్యస్వామి యొకదినంబున నూతన సామ్రాజ్యము స్థాపించుటకు అనుకూలప్రదేశ మెచటనున్నదో వెదకుటకు బయలుదేరెను. కొంతదూరము పోవఁగాఁ జుట్టును గొండలచే నావరింపఁబడి సురక్షితమగు నొకవిశాలప్రదేశము తుంగభద్రాతీరమున వారికి గోచరించెను. ఆప్రదేశము మనోహరముగా నుంటచే నందు సంచరించుచు విశేషముల నరయుచునుండఁ గొన్ని వేటకుక్కలు కుందేళ్లచేఁ దరుమఁబడి పరుగెత్తుట కన

బడెను. విద్యారణ్యులవా రదిచూచి మిగుల నాశ్చర్యపడి రాజసోదరుల కావింతఁజూపించి: 'రాజకుమారులారా! ఈప్రదేశము నూతనరాజధాని కనువగుతావు. ఇచట రాజ్యమును స్థాపించితిమేని చిరకాలము వెలుఁగొందఁగలదు. ఇదియె నాకభిమతప్రదేశ' మనఁగా వారును ఆమోదించిరి. విద్యారణ్యులు శ్రీవిద్యాచక్రానుసారముగ సరిహద్దులు నిర్ణయించి నగరవీథులు రాజమందిరములు, ప్రకృతిజనుల నెలవులు, దుర్గములకుఁ దావులు నిశ్చయించి శుభముహూర్తమున విద్యానగరమను పేరుతో నూతననగరరాజప్రతిష్ఠ గావించెను. ఆ శుభముహూర్తబలముననో, రాజసోదరుల అదృష్టవశముననో అచిరకాలములో విద్యానగరము మహాపట్టణముగా మారెను. విద్యారణ్యులు పెట్టిన శుభముహూర్తమున హరిహరరాయలు తన రాజధానిని ఆనెగొందినుండి విద్యానగరమునకు మార్చుకొని హితబంధు సామంతరాజసమక్షమున మహోన్నత వైభవముతోఁ బట్టాభిషిక్తుఁడాయెను. పరాక్రమశాలియు న్యాయమూర్తియు నగు బుక్కరాయలను బ్రజానుమతంబున విద్యారణ్యులవారు విజయనగర సామ్రాజ్యయువరాజు నొనరించెను. రాజసోదరు లిరువురు నాఁటగోలె నూతనరాజ్యమును విస్తరింపఁజేయుటకు సర్వశక్తులు ధారవోసి విజయయాత్రలకుఁ బరికరములు సమకూర్పఁదొడఁగిరి.



విద్యానగరపు సరిహద్దులలో బల్లాలదేవుఁడను హొయిసల రాజ్యమును బరిపాలించుచుండెను. అతనిరాజ్యము నెటులేని హరించి తమ రాజ్యములోఁ గలుపుకొనవలయునని హరిహరరాయలు, బుక్కరాయలు తీవ్రకృషిచేయుచుండిరి. ఆకస్మికముగా మహమ్మదుతుగ్లకు హొయిసలరాజ్యమునకు రాజధానియగు ద్వారసముద్రమును ముట్టడించి కోటఁబగులఁగొట్టి సంపదల నన్నింటిని జూరఁగొనెను. ఇఁక నిటనున్నచో నెప్పటికైన నపాయము తప్పదని బల్లాలదేవుఁడు దక్షిణార్కాడు మండలములోని తిరువణ్ణామలకుఁబోయి యది రాజధానిగాఁ జేసికొని పాలించుచుండెను. హరిహరరాయలు తన సహోదరులగు కంపభూపతి, బుక్కరాయలు, మారభూపాలుఁడు, ముద్దరాజు అను నలువురకు విశేషసైన్యమును ఇచ్చి సమస్తరాజుల జయించిరమ్మని పంపఁగా వారు సమీపముననున్న చిన్నచిన్న రాజుల నంకితులను గావించుకొని రాజధాని చేరిరి. అపుడె బల్లాలరాజుయొక్క రాజ్యము పూర్తిగఁ గర్ణాటరాజ్యములోఁ గలసిపోయెను. ఆంధ్రదేశమున సుప్రసిద్ధ దుర్గములుగా గణింపఁబడు పెనుగొండ, చంద్రగిరి, ఉదయగిరి, కనకగిరి దుర్గములు విద్యానగర రాజ్యములోఁ గలసిపోయెను. దినదినక్రమమున విద్యానగరరాజ్యము అభివృద్ధిలోనికి వచ్చుటఁ జూచి చిన్నచిన్న రాజులు తమంతతామె యంకితులై సుంకములు చెల్లింపనంగీకరించిరి. కల్పవృక్షములవలెఁ దనకన్ని విధముల సహా

కారులగు నలువురు సోదరులను నాలుగుచోటుల శాంతిస్థాప
నమునకుఁ బంపుచు విద్యారణ్యుల సహాయమున దుర్గములను
గోటలను బలపరచుచుఁ జిరకాలము రామరాజ్యమువలె హరి
హరరాయలు పాలించుచుండెను. క్రమముగాఁ గర్ణాటదేశము,
ద్రవిడదేశములోని కొన్ని భాగములు సముద్రప్రాంతములు
వనవాసి, మహిశూరు లోనగు రాజ్యములన్నియు హరిహర
రాయల పరిపాలనములోనికి వచ్చెను. విశాలమగు తనరాజ్య
మునఁ బ్రజాసుఖమె తన సుఖముగా భావించి అవసరమగు
తావులకుఁ దన సోదరులఁ బంపి ప్రజాసౌఖ్యములు విచారిం
చుచు హరిహరుఁడు రాజ్యము ధర్మబద్ధముగాఁ బాలించెను.

కర్ణాటరాజ్య మీవిధముగా దినదినాభివృద్ధియగుచుండఁ
గనే ధూమకేతువు వలె బహమనీరాజ్య మొకటి స్థాపింపఁ
బడెను. ఢిల్లీచక్రవర్తియొద్ద సేనానాయకుఁడుగా నున్న హసన్
గంగూ అను మహమ్మదీయుఁడు అల్లా ఉద్దీను షాహా అను
బిరుదనామముతో నీనూతన రాజ్యమును క్రీ. శ. ౧౩౪౭ లో
దక్షిణాపథమునందు (డక్కను దేశమున) నెలకొల్పి క్రమ
ముగా నభివృద్ధికిఁ దెచ్చుచుండెను. మహమ్మదీయులు ముందు
నకు వచ్చి విజయనగర రాజ్యమును గూడఁ గబళింపఁ దీవ్రకృషి
చేయుచుండిరి. విజయనగరాధిపతి తన బలములో విశేష
భాగమును సరిహద్దులలోనుంచి తురకలనురాజ్యమునం దడు
గైనఁబెట్టకుండఁ జేసెను. యవనుల దాడికి లోనుగాక సురక్షి



తముగా నుంటచే విద్యానగరరాజ్యమె మనకు శరణ్యమని
నలువురు ప్రజలు దక్కను భూములను విడిచి కర్ణాట రాజ్య
మునకు వచ్చిరి. హరిహరరాయల కాలమునఁ బ్రసిద్ధుఁడైన
గౌచన సోమనాథమహాకవి పెక్కుగ్రంథముల నాంధ్రభా
షలో రచించెను. ఈకవి హరిహరరాయల రాజ్యకాలమునం
దుండి బుక్కరాయలచేఁ బంపాసరోవర సమీపమునందున్న
విరూపాక్షస్వామి సన్నిధానమునందు బుక్కరాయ పురమును
అగ్రహారముగాఁ బడసెను. ఆంధ్రకవులకు విద్యానగరమునకుఁ
జిరకాలమునుండి సంబంధము గలదనియుఁ గర్ణాటరాజ్యాధీ
శ్వరు లనేకులు విద్యానగర ప్రభువులందఱు ఆంధ్రకవులఁ
బోషించి భాషను జెంపొందించిరనియుఁ జెప్పుటలోఁ గొంచె
మేనియు నతిశయోక్తి యుండదు. ఆనాఁడింక నెందఱు కవులు
మహారాజ ప్రాపు బడసి సుఖముగా జీవించిరో తెలుపు
నాధారములు లేవు.

హరిహరరాయల కాలమున విద్యానగరరాజ్యము ఆఱు
భాగములుగా విభజింపఁబడి యుండెను. అందు ఉదయగిరి
రాజ్యమొకటి. ఈరాజ్యమును దొలుత కంపభూపతియు నతని
యనంతరము పెద్దకుమారుడగు సంగమరాజు, శావన్న యొడ
యలు పాలించిరి. విద్యారణ్యుల సోదరుఁడగు సాయనా
చార్యులు సంగమరాజునొద్దమంత్రిగానుండి నెల్లూరునందు నివ
సించుచుండెను. రెండవది పెనుగొండరాజ్యము. ఇందు గుత్తి,

చంద్రగిరి రాజ్యములు కలిసియుండెను. ఈరాజ్యములు రెంటిని గలిపి హరిహరరాయల సోదరులలో నొకరు పాలించుచుండిరి. మూడవది ఆరగమలె రాజ్యము. ఇందు వనవాసి, చంద్రగుత్తి, గోవా రాజ్యములు చేరియున్నవి. ఇందు గొంత భాగమును మారభూపాలకుడు గౌడబ్రాహ్మణుడగు మాధవమంత్రిని సచివునిగా నుంచికొని పాలించుచుండెను. షిమొగజిల్లాయును, ఉత్తరకన్నడ జిల్లాయును గలసి ఆకాలమునందు ఆరగమలెమండలమను పేరుతో వ్యవహరింపబడుచుండెను. నాలుగవది ములువాయిరాజ్యము. ఇది ముద్దభూపతి పరిపాలనమునం దుండెను. ఐదవది తుళురాజ్యము. ఇందు బరకూరు, మంగటూరు చేరియుండెను. దీనిని హరపాదగౌడరా జనునాతడు మంత్రిగానుండి పాలించుచుండెను. ఆఱవది రాజగంభీర రాజ్యము. దీనిని బుక్కరాయల కుమారుడగు కుమార కంపరాయలు పాలించుచుండెను. ఈవిధముగా రాజ్యము ఆఱుఖండములుగా విభజింపబడుటచే బరిపాలనమునకు సుకరముగా నుండి విరోధులకు దుర్గమముగా నుండెను. వలసిన తావులకు విద్యానగరమునుండి సైన్యము, ధనము సకాలమునకు జేరునటుల నేర్పాటులు చేయబడెను. అందుచే జిన్నరాజులెవరును రాజ్యములోని భాగములనేని చేరిచూడ లేకపోయిరి.



హరిహరరాయల జననకాలము గుర్తింపదగు నవకాశములులేవు. ఆయన రాజ్యమునకువచ్చి విద్యానగరమునందు బట్టాభిషిక్తుడై క్రీ. శ. ౧౩౩౬ నుండి క్రీ. ౧౩౫౫ వఱకు పందొమ్మిది సంవత్సరములు పాలించి పరలోక మలంకరించెను. యువరాజుగ నుండి పేరొందిన బుక్కరాయలు అన్నగారు మరణించినవార్త వినినవెంటనే హోసపట్టణమునం దొక ప్రతినిధిని నిలిపి తాను విద్యానగరరాజ్యమునకు వచ్చి పట్టాభిషిక్తుడాయెను.

బుక్కరాయలు పరాక్రమాదికమున హరిహరరాయల కించుకేనియు దీసిపోవువాడు గాడు. విద్యానగర రాజ్యమున కీతడు పాలకుడుగా వచ్చుసరికి బహమనీసుల్తాను మహమ్మదుపాదుషా, ఓరుగల్లు ప్రాంతములను బరిపాలించు అనపోత భూపాలుని యేలుబడిలోనున్న భువనగిరి, గోలకొండ దుర్గములను హరించి కర్ణాటరాజ్యమును లోగొనుటకు సిద్ధముగా నుండెను. బుక్కరాయలు ముందున కడుగుబెట్టకుండ సరిహద్దుల నన్నివిధముల గాపాడుచున్నను మహమ్మదుషా విజయనగరముమీదికి దండయాత్రకు అపరిమితబలముతో వచ్చి ఘోరసంగ్రామము గావించెను. కడకు బుక్కరాయలె జయించుటచే మహమ్మదీయులు నష్టావశేషమగు సైన్యముతో నింటిత్రోవ బట్టిరి. బుక్కరాయలు పరాజయము నెఱుంగక వీరవతంసమని పేరొంది ప్రతి సంగరమునందును జయమొపడ

యుచుఁ జిరకాలము రాజ్యము పాలించెను. కొంతకాలము గడచినమీఁదట మహమ్మదుషాహ బుక్కరాయలు సంధిగావించికొని ఒకరి రాజ్యముపైకి వేఱొకరు రాకుండఁ గట్టడి గావించుకొనిరి. అదిమొదలు బుక్కరాయలు సరిహద్దులను గాపాడు యత్నముమాని తిరుగఁబడిన సామంతరాజుల పైకిని నూతనరాజ్యములమీఁదికిని దండయాత్రలకు బయలువెడలి కర్ణాటరాజ్యమును మిగుల నభివృద్ధిలోనికిఁ దెచ్చెను.

బుక్కరాయలు రాజ్యము పాలించుసమయమున నతని పెద్దకుమారుఁడగు కంపరాయలు పలుమాఱు విజయయాత్రలకేఁగి విజయలక్ష్మీద్వితీయుఁడై తిరిగివచ్చెను. దక్షిణదిశకు జైత్రయాత్రకేగుతఱి నీ నృపాలునివెంట గోపమంత్రియు, సాళువమంగరాజును సహాయులుగా నుండిరి. ద్రవిడదేశపాలకుఁడగు సాంపరాయలకును గంపభూపతి సైన్యమునకును గొప్పసంగరము జరిగెను. సాంపరాయ లమితబలముతో బాలేరు నాధారముచేసికొని ప్రతిపక్షసైన్యము నెదిరించెను. కంపరాయని సైన్యము సంగరమున నారితేరినదగుటచే ఉపాయాంతరములచేఁ బాలేరుదాటి ఆకస్మికముగాఁ బైఁబడి ద్రవిడసైన్యమును దునుమాడెను. సాంపరాయలు పడవీడు దుర్గమునందుఁ జేరెను. ధైర్యస్థైర్యములతోఁ జిరకాలము పోరాడి కంపభూపాలుఁడు సాంపరాయలను వశపఱచికొని ఆతనిని సామంతునిగా నేర్పరచి సాంపరాయస్థాపనాచార్య బిరు



దము వహించెను. మహమ్మదీయులు మధురజయించి దేవళములు రూపుమాపుచుంటచే అర్చకులు శ్రీరంగములోని విగ్రహమునుదెచ్చి తిరుపతిలో దేవస్థానమునందు దాఁచిరి. ఈ సంగతి కంపభూపతి సేనానాయకుఁడును జెంజిసీమాపాలకుఁడును విష్ణుభక్తుఁడునగు గోపనార్యుఁడువిని తురుష్కులఁ బాఱదోలుపఱ కావిగ్రహమును శృంగవరపుఁ గోటయందుఁ జేర్చి పూజించునటులఁ గట్టడిచేసెను. దేవాలయ ధ్వంసకుఁడగు మహమ్మదీయసేనాని మధురనుండి శ్రీరంగమునకు వచ్చి దేవళమునసే బసగావించి కొన్నిదినముల కనారోగ్యముగానుండి సమయవరమను గ్రామమునకు స్వల్పపరివారముతో నేఁగెను. అతని దుర్బలస్థితిని గనిపెట్టి గోపనార్యుడు చెంజి నుండి బయలువెడలి సంహరించి శ్రీరంగములో మఱల విగ్రహమును బ్రతిష్ఠించెను. ఈ మహమ్మదీయునకు వెఱచి సత్యమంగలమునందుఁ దలదాఁచు కొనుచున్న వేదాంతదేశికులు శ్రీరంగమునకు వచ్చి తనకవితా కల్పనలచే గోపమంత్రిని సంతోష పఱచెను. కంపరాయలు గడించిన ప్రతివిజయమునందును గోపమంత్రియే గాక సాళ్వమంగు గూడనుండి యుండెను. సాళ్వమంగు ఆకాలమునఁ జేరెన్నిక గన్నవీరులలో నొకడు. బుక్కరాయలటు పుత్త్రుని సహాయమునం గూడ సామ్రాజ్యమును మిగుల నభివృద్ధిలోనికిఁ దెచ్చెను. ప్రసిద్ధి వహించిన వ్యాపార స్థలములను

రేవు పట్టణములని పేరొందిన గోవా పట్టణ మాకాలమున విదేశ వ్యాపారమున కాస్పదముగా నుండెను. విజయనగర సామ్రాజ్యమునకు ద్రవిడదేశమునందలి చాలభాగము బుక్కరాయని కాలమున లోఁబడియుండెను. మళయాళము, సింహళము లోనగు దూరదేశములను బాలించు రాజులు సైతము బుక్కరాయల ధాటికి వెఱచి యెప్పు డెట్టియపాయము గలుగునోయని సామంతులవలె రాయబారులచే వస్తువాహన రత్న సువర్ణాదులు కానుకగాఁ బంపు చుండువారు.

బుక్కరాయలు సర్వసమత్వము, పాపభీతి, దైవభక్తి, పరోపకారబుద్ధిగల ఉత్తమగుణసంపన్నుఁడు. ఈయన శైవమతము నం దాదరభావము గలవాడైనను అన్యమత ద్వేషము లేక కాలము గడపెను. వైదికమతమునం దెక్కుడు అభిమానము గలవాఁడుగ నుండి విద్వాంసులగు బ్రాహ్మణులకు విశేషించి వృత్తుల నొసంగి మిక్కిలి యాదరించెను. బుక్కరాయలు సముద్రము, నాగవ్వచెఱువు, బచ్చప్ప చెఱువు లోనగు ప్రసిద్ధములగు తటాకముల నీనృపాలుఁడు నెలకొల్పి రాజ్యమునందు కఱవు లేకుండఁ జేసెను. బుక్కరాయలు కళింగదేశము, ఓఢ్రదేశము గూడ జయించి మహేంద్రగిరివఱకు దండయాత్ర గావించి నటులఁ గొన్నిచోటులఁ జెప్పఁబడెను. ఈయన మంత్రులలో నొకఁడగు మల్లినాథుఁడనఁబడు భోజనమల్లుఁడు యవనుల జయించిన మహావీరుఁడు. విద్యానగర సామ్రాజ్య నిర్మాతల పవిత్ర జీవితములను బఠించు సందర్భమున సామ్రాజ్య స్థాపకుఁడును వైదికమతాభిమానియు అపరశంకరుఁడని ప్రశంసింపఁదగిన వాఁడును నగు మాధవవిద్యారణ్యులవారి జీవితము నెఱుంగుట చాల నవసరము.



మాధవాచార్యులు, సాయణాచార్యు లను నిరువురు సోదరులుగలరు. వీరు జగద్విఖ్యాతులగు విద్వాంసులు. వీరిది యజుర్వేదము, బోధాయన సూత్రము, భారద్వాజగోత్రము. యవనవ్యాప్తిచే దేశమందు అరాజకము ప్రబలి వైదికమతమునకు విప్లవము కలుగనుంటచే మాధవాచార్యులు హరిహరరాయ బుక్కరాయలఁ బ్రోత్సహించి విద్యానగర రాజ్యమును స్థాపింపఁజేసెను. పేరునకు రాజులుగ నాసోదరరాజుల నుంచి రాజ్యచక్రము నంతయు మాధవాచార్యులే స్వయముగా బొంగరమును ద్రిప్పినటులద్రిప్పి మతధర్మములను గాపాడుటకుఁ దన జీవితమునంతయు ధారవోసెను. మాధవాచార్యులు, సాయణాచార్యులు సంస్కృతములో సమస్తవిషయములందును గ్రంథములను రచించి గీర్వాణభారతి కఖండమగు సేవ గావించిరి. మాధవాచార్యులు సన్యాసము స్వీకరించి విద్యారణ్య స్వామియను నామాంతరము వహించి శృంగేరీపీఠమున కధ్యక్షుఁ డయ్యెను. సన్యాసాశ్రమమునందు సైతము విద్యారణ్యులు విద్యానగర సామ్రాజ్యక్షేమమునకుఁ బాటుపడుచుండెను. మాధవ విద్యారణ్యులవారు విద్యానగరమును బరి

పాలించిన ప్రథమ హరిహరరాయల బుక్కరాయలద్వితీయ హరిహరరాయలకాలములలో మంత్రిగ ధర్మోపదేశకుఁడుగా నుండి రాజ్యక్షేమమె వైదికమతక్షేమముగా భావించి ఆయా రాజులను వైదికధర్మప్రవర్తకులుగ నేర్పఱచి నూఱు సంవత్సరములకంటె నెక్కుడుకాలము జీవించి క్రీ. శ. ౧౩౮౬ లో సమాధిగతుఁడయ్యెను. తమ్ముఁడగు సాయణాచార్యులుగూడ సంగమరాజునొద్ద మంత్రిగానుండి విద్యానగరమునకుఁ దగినసేవ గావించి రాజ్యసహాయమున మతసంరక్షణమున నెక్కువ పాటుపడెను.

విద్యారణ్యులవారి యుపనిషద్భాష్యములు, వేదాంత పంచదశి, వివరణ ప్రమేయసంగ్రహము, బ్రహ్మవిద్యాశీర్వాద పద్ధతి లోనగు గ్రంథములు అద్వైతమతప్రవిష్టులగు విద్వాంసులు మిగులఁ బూజ్యభావముతోఁ బఠించుట యీ మహానుభావుని ప్రశస్తికిఁ దార్కాణము. తొలుతరాజ్యమును నిలువఁ బెట్టుకొన్నఁగాని మతధర్మములఁ గాపాడుకొనఁ జాలవని మహాసామ్రాజ్యమును నెలకొల్పి దాని క్షేమమె తన క్షేమమని భావించిన విద్యారణ్యుల జీవితము నేటి పండితలోకమున కాదర్శప్రాయ మయ్యెనేని భరతఖండము సర్వవిధముల నభ్యున్నతికి రాకపోదు. మానవజీవితమునకు, మతమునకు, విజ్ఞానమునకు, స్వారాజ్యమునకు సంబంధము కలుగఁజేయుట మహాత్ముఁడగు విద్యారణ్యుల యాశీర్వచనమున నాంధ్రులకుఁ బట్టువడఁ బరమాత్ముఁ డనుగ్రహించుఁగాత!



హరిహర రాయలకు బుక్కరాయలకు ఉత్తరవయస్సునందు మాధవమంత్రియను మఱియొక విద్వాంసుఁడు విద్యానగర సామ్రాజ్య ధూర్వహుఁడై మంత్రి పదవియందుండి మిగులఁ బేరొందెను. కొందఱు మాధవవిద్యారణ్యులు మాధవమంత్రి యొకఁడని తలంచుట భ్రాంతిమూలము. ఇరువుర గోత్రము, తల్లిదండ్రుల పేరులు చూచిన వేఱువేఱు పురుషులని స్పష్టముగాఁ దెలియుచున్నది. మాధవమంత్రి గీర్వాణమునందుఁ బెక్కు గ్రంథముల రచించెను. నాస్తికమతమును ఖండించెను. బుక్కరాయల ప్రభుత్వకాలమున నీతఁడు పశ్చిమదిశ కధిపతిగానుండి విరోధిరాజులకు వీరస్వర్గము ప్రసాదించుచుండెను. ఈ వీరుఁడు గోవాపట్టణమును జయించి యందుఁ బాదుకొనియున్న మహమ్మదీయులను ద్రోలి యాదవుల కారాజ్యము ప్రసాదించెను. ఈయన జీవితచరిత్రము నింకను దెలిసికొనవలసియున్నది. ఇంక నెందఱు స్వార్థత్యాగు లీ సామ్రాజ్య సహాయులైరో యెఱుంగనయితికాదు. విద్యారణ్యులవారు మకుటములేని చక్రవర్తియై విద్యానగర రాజ్యమును సర్వవిధముల నభ్యున్నతికిఁ దెచ్చెను. ఆ కాలమునఁ గేవల విద్యావినోదములతోఁ గాక సంగరరంగములతోఁ గాలయాపనము జేసిన మాధవమంత్రి, సాయణాచార్యులు, సాళ్వమంగు, గోపప్రధాని యొనరించిన మహత్తర సేవవలననే వైదికమత మింతవఱకు మనదేశమున నిలుచుట కవకాశము

గలిగినది. ధర్మసంరక్షణమునకై రాజ్యము స్థాపించి ప్రజా శాంతికొఱకు సర్వస్వము ధారపోసి మతమునకు జాతికి జన సముదాయమునకుఁ గల్పతరువువలె నున్న విద్యానగరరాజుల జీవితములు పఠనీయములు. విద్యానగర సామ్రాజ్యము నందలి యాదాయములోఁ జాలభాగము ఆకాలమునం గవులకు, మతాధిపతులకు, విద్వాంసులకు నుపయోగింపఁ బడు చుండెడిది. ప్రతిపౌరుఁడు సామ్రాజ్యరక్షణమును గృహ కృత్యముగా భావించు చుండువారు.

రాజనఁ బ్రజలకు సేవకుఁడు. ప్రజాసౌఖ్యముల కాతఁ డుత్తరవాది. సమస్తధర్మముల నాచరణములోఁ బెట్టి దేశ మును సత్పథమున నడపుటకు రాజె బాధ్యుఁడు. ఇట్టి బాధ్యతల గురుతెఱింగి రాజ్యస్థాపనమునందుఁ గాక రాజ్యాభ్యుదయ కాలమునఁ గూడ స్వధర్మము మఱువని హరిహరరాయ బుక్కరాయల జీవితము అనంతరము విద్యా నగరరాజ్య మేలిన నృపులందఱకు నాదర్శప్రాయముగఁ బరిణమించెనేని పరాధీనత ఆంధ్రులకు దటస్థించునది కాదు. విద్వాంసులు సామ్రాజ్యాభ్యుదయమునకుఁ బాటుపడుటయు సన్న్యాసస్వీక రణానంతరము మతాధిపతిగానుండియు దేశమునెడ నను రాగము వహించుటయు విద్యారణ్యుల జీవితమునందుఁ గల పవిత్రాంశములు. మహామహుఁడగు విద్యారణ్యుని దైవభక్తి



తోఁ బూజించుటకంటె నా యనఘుని సదాచరణముల నాదర్శముగాఁ దీసికొనుటయే మనభావ్యభివృద్ధికి హేతువు.

---

# అనపోతనాయఁడు

ఇతఁ డప్రతిమానశూరుఁడై యాంధ్రదేశములోని చాలభాగము మిగులఁ బరాక్రమముతోఁ బాలించి విఖ్యాతిఁ గాంచెను. శూరవర్యుఁడగు నీమహానుభావుని జీవితచరిత్రము పఠనీయమనుటలో సందియము లేదు. కాకతీయ వంశాలం కారుఁడగు ప్రతాపరుద్ర చక్రవర్తి యోరుగల్లు రాజ్యము పాలించుతఱి సింగమనాయఁడు సేనానాయకుఁడై ప్రతిఘటిం చిన సామంతరాజుల దర్పమడంచి యాంధ్రసామ్రాజ్యమును నిష్కంటకము గావించి స్వామిభక్తి వెల్లడించెను. ప్రతాప రుద్రచక్రవర్తి యవనులచే బంధితుఁడైన పిమ్మట నాంధ్ర సేనానాయకు లంద ఱాంధ్రసామ్రాజ్యమును విచ్చలవిడిగాఁ బంచుకొని పాలించుచుండిరి. నిజాము దేశములోని యాంధ్ర దేశము నాసమయమున సింగమనాయఁ డాక్రమించుకొనెను. ప్రస్తుత కథానాయకుఁ డీశూరుని పుత్త్రుఁడు. ఇతఁడు రేచెర్ల గోత్రియుఁడు. వెలమకుల భూషణుఁడు. ఈవీరుని చరిత్రమును తెలిసికొందము.

అనపోతనాయకుని చరిత్రమును నరయుటకుముం దాతని జనకుఁడగు సింగమనాయనిచరిత్రము కొంతవఱకుఁ దెలిసికొనుట యావశ్యకము. సింగభూపాలుఁడు ప్రతాపరుద్రదేవుని యొద్ద సేనానాయకుఁడుగ నుండి మగతలయను గ్రామ సమీపమున భయంకరసంగ్రామ మొనరించి సామ్రాజ్యమునకు వ్యతిరేకించిన మచ్చకొమ్మనాయకుఁడను శూరుని వధించెను. జిలుగుపల్లి యొద్ద రుద్రనాయఁడను వీరుని ఘోరయుద్ధమున జయించి ప్రతాపరుద్రునిమన్ననకుఁ బాత్రుఁడయ్యెను. ఇతఁడు మచ్చనాయకగండ, సామంతరాగోల యను బిరుదములనే కాక యెనుబది వరములనుసైతము ప్రతాపరుద్రుని వలన నొంది యసీతివరముల సింగమనాయఁడని విఖ్యాతిఁ గాంచెను. ఆంధ్రకవు లనేకులు సింగమనాయని వీరజీవితము గానము గావించి కృతార్థులైరి. సింగమనాయనిచరిత్రము గ్రహింప నీక్రిందిపద్యములు సాయము కాఁగలవు.

"ఉ॥ లాలితశౌర్యశక్తి నవలత్తు తెనుంగుదళంబు నాజిలోఁ
దోలిన పాండ్యభూవిభునితోడి పెనంకువ కోర్చి సన్నుతిన్
వ్రాలి ప్రతాపరుద్రుసభ వర్ణనకెక్కిన యెఱ్ఱదాచ భూ
పాలసుతుండు సింగని కభంగుని కేబిరుదైనఁ జెల్లదే॥

ఉ॥ దాచయ సింగభూవిభుని దాడికి నోడి యరాతిసంఘముల్
వే చని యీరమ్ముల్ పొదలు వృక్షచయంబులుదూరమేను



లన్। బోఁచిన కంటకక్షతులు తోయజలోచన లాగ్రహం
బుతోఁ। జూచి నిజేశులందలిగి చూతురు పాయక చూతు
సుగ్రతన్॥"

సింగమనాయఁడు త్యాగశీలుఁడు దేవబ్రాహ్మణభక్తి పరుఁడునై యనేక ధర్మకార్యములు గావించుటయే కాక యేలేశ్వరమున ననేక బ్రహ్మప్రతిష్ఠలు గావించినటుల సర్వజ్ఞ సింగమనేఁడు "రసార్ణవ సుధాకరము" లోఁ జెప్పియున్నాఁడు. సింగమనాయఁ డప్రతీప ప్రతాపంబున నాంధ్రదేశములోని రాచకొండ దేవరకొండ దుర్గముల స్వాధీనముఁ గావించుకొని యాంధ్రదేశముఁ బాలించుతఱి నితరదుర్గపాలకులకు నితనికి నంతఃకలహములు పెచ్చరిల్లెను. సామంతులుగ నున్న జల్లిపల్లి దుర్గపు రాచవారు పలుమారు ప్రతిఘటించి యపజయము గడించి శూన్యసంకల్పులైరి.

వీరవర్యులగు జల్లిపల్లిరాచవారు పలుమాఱు సింగమనాయనితోఁ బ్రతిఘటించి నష్టపడియు నిరుత్సాహము నొందక యొకానొక సంగ్రామములో నాతని బావమఱదియగు చింతపల్లి సింగమనాయఁ డనువీరుని బట్టి తమకోటలోని కారాగారమున బంధించిరి. సింగమనాయఁ డది తెలిసికొని యావీరుని వదలిపెట్టుఁడని యనేకపర్యాయములు రాచవారికి వర్తమానము చేసెను. ఫలము లేకపోయెను. సింగనాయఁడు మిగులఁగోపించి జల్లిపల్లి దుర్గము నిర్మూలముఁ గావించి

రాచవారి వధించి యెటులేని చింతపల్లి సింగమనాయుని బంధవిముక్తుని గావింపదలంచి తన సైనికబలము నంతయు వెంటఁగొని దాడివెడలెను. జల్లిపల్లి రాచవారు సింగమనాయుని విజృంభణమునంతయుఁ జూచి యపజయము తప్పదని నిశ్చయించుకొని వెఱవు వేఱుగానక దురాత్ముఁడు మాయాకుశలుఁడగు తమ్మళ దమ్మాజియను నొకవీరుని జల్లిపల్లి రాచవారు రాయబారమంపిరి. తమ్మళ దమ్మాజి తనరాకముందు రాజభటులచే సింగమనాయకున కెఱుంగఁజేసి యాతని సమ్ముఖమున కేఁగి చింతపల్లి సింగమనాయుని యా క్షణముననె విడచిపెట్టుటయే గాక యపరాధముగూడ చెల్లింతుమనియు క్షమింపుమనియు వేఁడుకొనెను. సింగమనాయఁ డానందించి సైనికుల నందఱును రణోద్యోగము చాలింపుఁడని యాజ్ఞాపించెను. దమ్మాజీ సింగమనాయునితోఁ జాలసే పిష్టగోష్ఠిగ భాషించి భాషించి నమ్మకపుట్టునటుల వర్తించి కాసెలోనున్న బాకుతో సింగమనాయుని వక్షఃస్థలమున నిటునటు దిగునటుల గాఢముగఁ బొడిచి యావార్త బహిరంగము కాకముందె పాఱిపోయెను.

క్షణములో నీవార్త సైనికనివేశములో నల్లుకొనెను. వీరవర్యులు కొందఱు కోపమాపుకొనలేక దమ్మాజినిబట్టి తేవలయునని యున్నతాశ్వములనెక్కి బయలువెడలిరిగాని యాతఁడంతకంటె శీఘ్రముగ దుర్గముజేరెను. విచారకరమగు నీఘోరవార్తవిని సైనికులందఱు చాల విచారించిరి. సింగమనాయనిపుత్త్రులగు అనపోతనాయఁడు, మాదనాయఁడు తండ్రి వెంట నా సంగ్రామమునకు వచ్చియె యుండిరిగాన నావార్త వినఁగనే తండ్రిసమ్ముఖమునకుఁ జేరిరి. సింగమనాయఁ డాయుధఘాతో మరణశయ్యయందుండియుఁ గొంచెమేని విచారము నొందక దుఃఖమునొందు తనయుల నిర్వురఁ జేరఁజీరి బుజ్జగించి విచారముతో నిటులనెను. "కుమారులారా! ఈబాధతో నింకఁ బ్రాణములఁ గొంచెముసేపేని నిలువఁజాలను. బాకు పెకలించిన వెంటనే నాప్రాణముపోవ సిద్ధముగనున్నది. పరమునందేని నాయాత్మ శాంతినొందుటయే మీయభిప్రాయమైనచో, మీరు నిజమైన పుత్త్రులగుచో, రేచర్లగోత్రీయుల పరాక్రమరక్తము మీరక్తనాళములలోఁ బ్రవహించుచున్నచో జల్లిపల్లి రాచవారొనరించిన దురాగతమునకుఁ బ్రతిఫలముగ వారలరక్తముచే నాకుఁ దిలతర్పణముల నొసంగఁ గోరెదను. మీరిరువురు తడవుసేయక యంగీకారము నెఱింగించి యాయుధోత్పాటనము గావింపుఁడు." సింగమనాయఁడు కన్నులు మూసికొనెను. భీమార్జునులకుఁ దీసిపోని యాసోదరవీరు లిరువు రేకకంఠముగ 'మీయాజ్ఞనెఱవేర్చి పితృఋణము నుండి విముక్తులమయ్యెద' మనుచు జనకునిహృదయమున నాటికొనిన యాయుధముఁ బెకలించిరి.



పితృమరణసందర్శనముచే బాలురగు ననపోత నాయనికి మాదానాయనికిఁ బౌరుష మతిశయించెను. పితృవాక్య పరి

పాలనము గావించుటయో, శక్తిలేకున్న ఘోరసంగ్రామమున శక్తియున్నంతవరకుఁ బోరి మరణించుటయో కర్తవ్యమని వారికిఁ దోఁచెను. బ్రతుకుపై నిరాశ జనించెను. పేరుఁజెందిన శూరులందఱా సమయమున నాకుమార రాజన్యుల సమ్ముఖమున కేతెంచి బుజ్జగించి 'మేమందఱము చంపను జావను సర్వసిద్ధముగా నున్నారము. సింగమనాయఁడు మీకు జనకుఁడు, మాకుఁ బాలకుఁడుగావున నాతనియాజ్ఞ పాటించుట మనయందఱకు సమానధర్మము గావున మీరు నాయకత్వము వహింపుఁడు. ఇపుడు రాచవారిమారణమున కుపక్రమింత' మని హెచ్చరించిరి. కర్తవ్యము నారయు నాకుమారు లత్యుత్సాహముతోఁ దండ్రికి దహనాది సంస్కారములు గావించి సైనికుల నందఱ సమావేశపఱచి ప్రతాజ్ఞ నివేదించిరి. స్వామిభక్తిపరాయణులగు నాయాంధ్రవీరు లందఱు కరవాలముల జళిపించుచుఁ దమ యంగీకారములను వెల్లడించిరి.

స్వల్పకాలమునకె దేవరకొండ, రాచకొండలలో నున్న మూలబల మంతయు రప్పింపఁబడెను. జల్లెపల్లి ప్రాంత మంతయు వెలమవీరుల సైన్యముతో నేల యీనినటు లుండెను. జల్లెపల్లిలోని క్షత్రియులగుండె లదరెను. విజయముపై నాస తొలంగెను. ఐనను శక్తికొలంది పోరాడి సంగ్రామరంగమున మరణించుటయే యిహపరసాధకమని భావించి వారును సంగరమున కాయిత్తమైరి. సింగమనాయని యాజమాన్యము క్రింద



నుండ నొల్లని స్వతంత్ర శీలురగు రాచవారు, కమ్మవారు, రెడ్డివారు జల్లెపల్లి రాచవారికి సైన్యముతో నేతెంచి తోడ్పడిరి. ఉభయ వీరులు సంగ్రామమునకుఁ జెంజెర్ల ప్రాంతము రంగస్థలముగా నిర్ణయించుకొనిరి.

జల్లెపల్లి దుర్గాధీశ్వరులగు చంద్రవంశ చాళుక్య రాజుల పక్షమునఁ గోన మల్లారెడ్డి, మంగళపూడి యిమ్మడిరెడ్డి, రావులవరపు మల్లారెడ్డి, పోలూరి పోలారెడ్డి, బండికోటారెడ్డి, వినుకొండ మారారెడ్డి, కుంట్లూరు మారారెడ్డి, అరవపల్లి గౌరిరెడ్డి, కొత్తపల్లి కొండారెడ్డి, గారారెడ్డి, నారారెడ్డి, కొలెచెలమకొండ మాచారెడ్డి, మొదలగు రెడ్డిరాజులును రామగిరి దుర్గపరిపాలకులును అనంతగిరి, కందికొండ, జమ్మిలోయలోనగు రెండువందలదుర్గముల బరిపాలించు సామంతులును సైన్యముతో వెలమసైనికులఁ బ్రతిఘటించుటకై తలపడిరి. జల్లెపల్లి రాచవారందఱు మూలబలముల నన్నింటిని మొగలూరు దుర్గమున సురక్షితముగ నుంచుకొని మిగుల సాహస విక్రమములతో వెలమవారి సైన్యమును బ్రతిఘటించిరి. ఇరువాగులవారి కింతయనరాని నష్టము కలిగెను. వీరవర్యులనేకులు గతించిరి. సంగరరంగ మంతయు రక్తప్రవాహముచేఁ బంకిలమయ్యెను. ప్రతిపక్షుల హేతిఘాతములకు జంకక వెలమవారి సైన్యములు మృత్యుదేవతా వదనగహ్వరమును జొచ్చునటులఁ బగతుర సేనలోఁ జొఱఁబడి నుగ్గునూచము గావించిరి. రాచవారి

సైనికులు వెలమసైనికుల కెందును దీసిపోక విక్రమముతోఁ బ్రతిఘటించిరి. యుద్ధము చాల విరామముగ జరిగినను జయాపజయములు నిర్ణయింప నసాధ్యమయ్యెను. పితాజ్ఞను నెఱవేర్ప కుండఁగనే యంతరించుట తమకుఁ గర్తవ్యము కాదని యారాజసోదరులు భావించి సైనికులఁ బేరుపేరు వరుసలఁ బిల్చి బహూకరించి యిటులనిరి: 'పదాతులారా! మిమ్ము వేల్పులు స్వర్గద్వారములు తెఱచి సగౌరవముగ నాహ్వానించుచున్నారు. సూర్యమండలము మీకు స్వాగతము నొసంగుచు దన సారంగములనుండి మిమ్ము స్వర్గలోకముఁ జేర్పఁగలదు. కాని రాచవారి రక్తముచేఁ బితృదర్పణములు మేమొనరింపక ముందుఁ బరమునకున్న సింగమనాయని సందర్శించుటకంటె నక్రమము వేఱులేదు. మీపైఁ గర్తవ్యభారము మిక్కుటముగాఁ గలదు. పగతురవధించి మాయుద్యమము గట్టెక్కింప వలయును. లేదా వంశాంకురమైన లేకుండ మనమందఱము గతింపవలయును." ఈవాక్యములు వినఁగనే ప్రతిపక్షులు చలించిరి. వెలమవారి సైనికు లినుమడించిన యుత్సాహముతోఁ బ్రతిపక్షులబలములను జిందరవందర గావించుచు వీరవిహారముఁ గావింపసాగిరి. సైనికులతో సమముగ రాజసోదరులుగూడ రణరంగమున కుఱికిరి.

కొంతకాలమునకు రాచవారి బలములన్నియు వినాశనము గావింపఁబడెను. పరాజయ భయముచేఁగొందఱు రాచ



కొమరులు రణరంగమును వదలి మొగులూరు దుర్గములోఁ జేరి దాఁగిరి. వెలమవారి బలమంతయు విజృంభించి యారాచ పౌజుల సర్వవిధముల నాశనముగావించి యనేక సేనానాయకుల జీవగ్రాహులుగఁ బట్టుకొని బంధించిరి. కడకుఁ బరాజయము రాచవారికె స్థిరపడియెను. సింగమనాయనియాజ్ఞ నెఱవేర్పఁ గలిగితిమని యాంధ్రసైనికులు మిగుల నానందించి ద్విగుణితోత్సాహముతో హతశేషమగు బలముతో మొగులూరుదుర్గమును ముట్టడించిరి. అనపోతానాయుడు, మాదానాయఁ డుచితపరివారముతో దుర్గమునఁ బ్రవేశించి యందు ప్రాణభీతిచే దాఁగయున్న నూటొక్కరు రాచనాయకులను జీవగ్రాహులుగఁ జేకొని స్కంధావారముఁ జేరిరి.

అనపోతానాయకుఁడు సోదర ద్వితీయుఁడై నిర్దాక్షిణ్యముగ బంధితులైన రాచవారినందఱకంఠములఁ గరవాలముతోఁ జెండాడి వారిరక్తము నంతయు బానలనిండఁ బట్టి వారి మేదోమాంసముల నొక్క రాసిగాఁజేసి వంశించి యొకానొక పుణ్యదివసంబున మంత్రపూతముగఁ బితృతర్పణము గావించి భూతబలిగావించి యామాంసఖండములచేఁ బిశాచ శాకినీ డాకినీ భేతాళాది గ్రహముల నానందపఱచి పితృఋణవిముక్తులై విజయలాంఛనము లాయా స్థానములలో నెలకొల్పించి నిజనివాసముల కరిగెను. మఱియొక మాఱుగూడ హతశేషులగు రాచవారు విజృంభింప రణరంగమున వధించి భూత

బలిగావించి అష్టదిగ్రాజ మనోభయంకర, సోమకులపరశురా
మాది' బిరుదములు గాంచి సమకాలీక రాజన్యులలో మిన్న
యై యనపోతనాయకు మిగుల విఖ్యాతి నార్జించెను. అనపోత
భూపాలుఁడు సోమకుల పరశురామాది బిరుదముల వహించి
నట్లు నాతని శాసనములయందె గాక రసార్ణవసుధాకరమున
నైత మాతనిపుత్త్రుఁడగు సర్వజ్ఞ సింగభూపాలుకుఁ డీక్రింది
విధముగా వ్రాసియుంటచే నీకథ విశ్వసనీయ మైయున్నది.

శ్లో॥ సోమకుల పరశురామే భుజబలభీమేఽధిభూమిగోపాలే
యత్రిచ జాగ్రతి శాస్త్రరి జగతాం జాగర్తి నిత్యకళ్యాణం॥

(సోమకుల పరశురాముఁడు, భుజబల భీముఁడు, రణ
దేవేంద్రుడు మొదలగు బిరుదరాజములు గల యన్నపోత
భూపాలుఁడు రాజ్యము పరిపాలించుచుండఁగా లోకములో
శుభపరంపర వెలయసాగెను.)

అనపోతనాయకుఁడు జల్లెపల్లి క్షేత్రమునఁ గావించిన
ఘోర సంగ్రామముతో నాతనిప్రశస్తి దశదిశా పరివ్యాప్త
మయ్యెను. ప్రతిఘటింపవచ్చిన రాజవంశీయు లందఱకు సంపూ
ర్ణమైన పరాభవము కలిగెను. అనపోతనాయనిపౌరుష మా
విజృంభణముతో నాటివారికిఁ దెలియుటచే విద్వేషభావమును
మానికొని ప్రతిపక్షులు శాంతమార్గగాములై సంచరించిరి.
అనపోతనాయని విజయములఁ దెల్పునీ క్రిందిగద్యమును నామన
గల్లునివాసులగు బట్టులు నేఁటికిఁ బఠింపుచున్నారు.



"బిరుదునకై పసించు నిందువంశంపు రాజులు ఐదు
లక్షల యిరువదివేలు బలంబులతోఁ ద్రిభువనరాయ
బిరుదాంకుండని యెఱుంగక జల్లెపల్లి వీరక్షేత్రంబున
నెదిరించిన అఱువదివేల గుఱ్ఱంబులతోను, ఏనూరు
మత్తేభంబుల తోడను, పది లక్షల కాల్బలంబులతోను
నెదురునడచిన పద్మజులకును తెనుంగులకును గంధ
కస్తూరీ పరిమళద్రవ్యంబు లొసంగి తమ్మెదిరించినయహం
కార మహామానుష భార్గవులైన పద్మజులను రణరంగ
దుర్జయులైన తెనుంగులను రణోత్సాహులై వీరసాహ
సాహంకారంబులతోను మెఱయు రాజులను కమ్మనాయ
కులను రంకెలువైచు బిరుదురాహుత్తులను సముఖపు
చదువర్లతోఁ గూడి కలహమందు నుగ్గునుగ్గాడి నూ
టొక్క రాజులశిరములు ఖండించి యెనుబది యొక్క
రాజుల కీకసంబులుగా నుగలాడించి, పదియుమువ్వురు
రాజుల రణబలిగావించి, ఆ రణక్షోణినర్చించి దిగం
బరుడై కాళీ, మహాకాళీ, శాకినీ, డాకినీ భూతప్రేత
పిశాచాలం దలంచి రణదేవ పోతరాజ కలహకంటకాది
దేవతల నారాధించి ధ్యానించి రణరాజ రణశూర రణ
వీరాది నిజబలంబులకు జయంబు గలుగునట్లుగా వైరి
రాజులను బలిగావించి బట్టురాజును తాను రణంబు
గుడిపి తనవీరాధివీర సాహసంబులు పొగడించుకొని

> తన ఖడ్గధారలఁ దునిగినవారల స్వర్గంబున కనిపి, తన
> రేచర్ల గోత్రోద్భవుల కాచంద్రతారార్క మభ్యు
> దయాభివృద్ధి కలుగునట్లు దేవీ వరంబుబడసి ......"

అనపోతానాయఁ డొనరించిన జల్లెపల్లి క్షేత్రవీరవిహారమీ గద్యమువలన విదితము కాఁగలదు.

క్షత్రియవీరులు నారెసారె కనపోతనాయనితోఁ బ్రతిఘటించి వీరమరణము నొందుచుండిరి. ఆకాలమున నినుగుర్తి యను నొక దుర్గమును పూసపాటివారి సంబంధులగు క్షత్రియులు పరిపాలించు చుండిరి. స్వతంత్ర శీలురగు నారాచవారు బలముల నాయితముఁ జేసికొని యనపోతానాయకునితోఁ బ్రతిఘటింప నెంచిరి. సాటివారినందఱ సామంతులను గావించి కొని యావదాంధ్రదేశము నేకచ్ఛత్రముగఁ బరిపాలింప సంకల్పించిన యనపోతనాయఁడు రాచవారినడంప సంకల్పించి తమ్ముఁడైన మాదానాయకునకు సర్వసేనాధిపత్యము నొసంగి సంగరమునకుఁ బయనమయ్యెను. మాదానాయకునితో ౬౦౦౦౦ కాల్బలములు, ౨౦౦౦౦ ఆశ్వికులు, ౭౦౦౦ ఏనుంగులు, ౧౦౦౦౦ సేనానాయకులు రణమునకుఁ బయనమైరి. సైన్యమును ముందు నడపుచు ననపోతానాయకుఁడొక యున్నత గజమునెక్కి పోవుచుండెను. వెలమసోదర వీరుల విజృంభణము నంతయుఁ జారులవలన నాలకించి రాచవారందఱు యుద్ధమునకు సన్నద్ధులై బురుజులపై వీరవర్యులనిల్పి ద్వారముల కుభయపార్శ్వముల



నాగ్నేయ యంత్రముల నెలకొల్పి ప్రతిపక్షులరాక కెదురు చూచుచుండిరి.

అనపోతనాయనికి సామంతులై యుండనొల్లని రెడ్డివారు, కమ్మవారు, రాచవారు, నినుగుర్తి దుర్గపాలకులకుఁ దోడ్పడి సంగ్రామమున కాయితమైరి. అన్ని ప్రదేశములనుండి యురుదెంచిన యారాచవారిబలము ౫,౬౦,౦౦౦కు మించి యుండెను. అనపోతనాయకుని ప్రభుత్వము విధ్వంసము గావింప వలయునని రాచవారును, రాచవారి విజృంభణము నశింపఁ జేయ వలయునని వెలమవారు విక్రమించి ఘోర సంగ్రామము గావింపనాయత్తమైరి.

విశ్వాస పాత్రులును స్వామిభక్తులునగు వెలమసేనానాయకులు బహిరంగ స్థలమునందుండియు దుర్గములయందు దాఁగి యగ్నిగోళములను కుమ్మరించి సైన్యము నంతయు నురుముగావించుచున్న రాచవారికి లొంగక విజృంభించి దుర్గద్వారములఁ భేదింపఁదొడఁగిరి. రాచవారు బలముల నన్నింటెని దుర్గద్వారము చెంతఁజేరి ద్వారము పగిలిపోయినచోఁ బ్రతిపక్షసైన్యమును బ్రతిఘటింపవచ్చునని సంగ్రామప్రయత్నములఁ గావించుచుండిరి. అనపోతానాయకుఁడు, మాదానాయకుఁడు మదగజంబుల నారోహించి ద్వారమును పొడిచింప సాగిరి. గజశిరోఘాతములచే ద్వారము భిన్నమగుచుండెను. గజముల శిరఃప్రదేశము లాద్వారపుగుబ్బలు తగులుటతోడనే

ప్రియ్యలై రక్తము ప్రవహించెను. వెంటనే యావీరులు వేఱొక యేనుఁగులజంటను రప్పించి వానినారోహించి ద్వారభేదనము నకుదలపడిరి. ఇట్లు విశ్వప్రయత్నముమీఁదఁ బద్మనాయక వీరులు ద్వారమును భేదించి ముందడుగువేసిరి. రాచవారు మూర్తీభవించిన ధైర్యమో యనునటుల స్థానము వదలక లోని కేతెంచు ప్రతిపక్షవీరుల నందఱ యథావిధి నురుమాడి దుర్గ సంరక్షణమున నప్రమత్తులై విక్రమించిరి. బురుజుల చెంత నున్న సైనికులు మాటిమాటికిఁ బద్మనాయక సైన్యముతోఁ దలపడి పోరుచు నాగ్నేయాస్త్రముల విచ్చలవిడిగాఁ బ్రయోగించుచు నింతయనరాని విప్లవము ఘటించిరి. సంగరమర్మజ్ఞుఁడగు ననపోతనాయఁడు ప్రత్యర్థుల యొక్కయుఁ దన యొక్కయు బలాబలములు విచారించి దుర్గములో నెటులేని ప్రవేశింపకున్నచో నపజయము తటస్థించి తీరునని నిశ్చయించి సైనికులనందఱి ద్వారమునుండి లోనికి జొఱబడ నాజ్ఞాపించెను. సముద్రమువలెనున్న పద్మనాయక సైన్యము ద్వారము గాపాడు రాచవారిబలముల నురుమాడుచు గొంచెముసేపటికి దుర్గములోని యన్నిభాగములకుఁ బ్రవేశించి యాయుధశాలల నాక్రమించుకొని ప్రతిపక్షుల నెక్కడివారి నక్కడ నురుమాడిరి. కొన్నిదినంబు లుభయదళంబుల కింతయనరాని ఘోరసంగ్రామము జరిగెను. కడకు జయముపై నాసవదలి యుద్ధకార్యము నిర్వహించు రాచవారు ప్రాణభీతిచే దుర్గ



శిఖరమునఁగల రహస్యగృహమున కేఁగి దాఁగికొనిరి. నాయకులు లేమిచేఁ గొలఁదికాలము మాత్రము పోరాడి యుక్తాయుక్త మెఱుంగక రాచవారిసైన్యమంతయు వెలమవారికి వశమయ్యెను. హతశేషులగు సైనికులు బ్రతుకుము జీవుఁడా యని పిఱికి వందలై దొంగత్రోవలను బట్టి పారిపోయిరి. కొంతసేపటి కిను గుర్తిదుర్గము రాజకులమువారి యధీనమునుండి తొలఁగి పద్మ నాయకుల హస్తగతమయ్యెను. రాచవారు కొందఱు శిఖరమున దాఁగియున్న సంగతి రహస్యజ్ఞులచే ననపోతానాయకుఁడు, మాదనాయకుఁడు గ్రహించి శైలము నెక్కి యాగృహమునన్వేషించి ద్వారమును ముట్టడించి దొంగత్రోవలన్నింటి నరికట్టి సాహసించి లోనఁబ్రవేశించి యందున్న కొండ రాఘవ రాజు, కొండ్రాజు, జగ్గరాజు, గోవిందరాజు, జూటూరు సూరరాజు, స్వర్ణసేనమరాజు, సాళ్వ రాఘవ రాజు, తిరుమల ప్రోలరాజు, కుప్పరాజు, నరసరాజు, శ్రీనాథగౌతమీ భూనాథ రాజు, శ్రీపతిరాజు, బాలదేవరాజు, మొదలగువారి నందఱను బంధించి యాక్రందనము గావించుచున్నను శరణుగోరినను పాదములపై వ్రాలి క్షమార్పణము కోరుచున్నను వదలక దయాశూన్యులై వధించిరి.

బలవంతులగు ననపోతరాయునిచే మాదనాయనిచే ముం దెట్టియపాయములు వచ్చునోయని యాప్రాంతముల నాశ్రయించి జీవించు రాజవంశీయులందఱును దేశత్యాగము

గావించి ప్రచ్ఛన్నముగ నటనట జీవింపనేఁగిరి. అనపోతనాయఁడును దయాశూన్యుఁడై రాచపురుగును మిగుల్తు మేని యేనాఁటికైన నపాయము రాకమానదని తనయాజమాన్యమునఁగల దేశమంతటనుగల రాచవారలనందఱను బాలురనక వృద్ధులనక స్త్రీలనక శిశువులనక తెగటార్చి సోమకుల పరశురామ బిరుదము సార్థకము గావించికొని శత్రుజనకంటకుఁడై రాజ్యము పాలించెను.

కాలక్రమమున దాదాపుగ నిజామురాష్ట్రములోని యాంధ్రదేశమంతయు ననపోతభూపాలకుని హస్తగతమయ్యెను. అతడు భువనగిరి, ఓరుగల్లు, రాచకొండ, రామగిరి, గోలకొండ, కంబముమెట్టు, దేవరకొండ దుర్గములు స్వాధీనముగావించుకొని విరోధియనువానిఁ దలయెత్తనీయకుండ సర్వైశ్వర్య సంపన్నుఁడై వయఃకాలమునంతయుఁ బరరాజ్యాకర్షణముతో విజయయాత్రలతోఁ గడపుచుండెను. విజయయాత్రల కేఁగుచు మార్గమధ్యముననున్న యయ్యనవోలు మైలారుదేవునిసందర్శించి యాగ్రామము నంగరంగ వైభవాదికములతో నుత్సవాదికములు జరుగుటకై దానమొనరించి యనపోతనృపుఁడట నొకశాసనము స్థాపించెను. ఈవీరవతంసుని విక్రమజీవితము చాలవఱ కాశాసనమున లిఖింపఁబడియున్నది. అందు సోమకుల పరశురాముఁడగు నీ యనపోతరాజుపరాక్రమ మీవిధమున వర్ణింపఁబడి యున్నది.



“శ్లో॥ ముని రజనిపరశురామః
స్థానే వినియుజ్య వైష్ణవం తేజః
సోమకులపరశురామే
ధరామవ త్యన్న పోతభూపాలే॥”

(తా॥ పరశురాముఁడు తన విష్ణుసంబంధమగు తేజమునంతయు సోమకుల పరశురాముఁడగు ననపోతభూపాలకుని స్థానమునం దుంచెను.)

అనపోతనాయకుఁ డాంధ్రదేశమునంతయు వశముగావించుకొని రాచకొండ రాజధానిగనొనరించుకొని శత్రుజనభీకరముగా రాజ్యము చిరకాలమేలెను. ఈరాచకొండ నిజామురాష్ట్రములో నల్లగొండమండలమున నున్నది. ఇది హైదరాబాదునకుఁ దూర్పుగా ౩౮ మైళ్ళదూరమునఁ గలదు. అనపోతనాయని రాజ్యవిస్తృతి బలసామర్థ్యములు గ్రహింప నుద్దేశింతుమేని యీదుర్గచరిత్రము తెలిసికొనుట యావశ్యకము. గ్రామముచుట్టు మిగుల దృఢతరమైన కోటయు మిగుల లోఁతుగల యగడ్తయుఁ గలవు. దుర్గమునకు నాలుగువైపుల నాలుగుద్వారములు కలవు. అందుఁ దూర్పుద్వారము పుట్టివాడ దర్వాజాయనియు, దక్షిణద్వారమును భైరవునిగండి యనియుఁ బడమటిద్వారమును నేనుఁగుల దర్వాజాయనియు నుత్తరద్వారమును భువనగిరి గండియనియు వ్యవహరింపఁ బడుచున్నవి. ద్వారములన్నింటిసమీపమున గండభేరుండ వీరాం

జనేయ కాలభైరవాది వీరవిగ్రహములును వానిక్రింద నన
పోతనాయకుని బిరుదములు సమగ్రముగఁ జిత్రింపఁబడి
యున్నవి. కోటయొక్క యంతరాళమున రాచకొండ యను
గ్రామమును దన్మధ్యమున రెండు కొండలు గలవు. అందొకటి
రాచకొండయనియు మఱియొకటి నాగనాయనికొండ యనియు
బిలువఁబడుచున్నవి. రాచకొండ రాజువసించునది. ఇందు రాజ
నివాసోచితములగు చిహ్నము లనేకములు నేటికిఁ గానవచ్చు
చున్నవి. రాచకొండపై శిలామయములును శత్రుజనాభేద్య
ములు నగు నాలుగుకోటలును నున్నతములగు బురుజులును
దర్శనీయములై యలరారుచున్నవి. రెండవకొండయగు నాగనా
యనికొండపైఁ గూడ నొక దృఢతరమగు దుర్గముఁ గలదు. నాగనా
యఁడను శూరవర్యుఁ డాదుర్గమును నాశ్రయించి యుంటచే
దానికాపేరు వచ్చెను. నాగనాయనిచరిత్రము ముందుఁ బఠింప
నవకాశము కలదు. అనపోతానాయని సోదరుఁడగు మాదానాయ
కుఁడు దేవరకొండయను దుర్గమున నుండి యగ్రజుని యాజ్ఞాను
సారముగ రాజ్యము పాలించుచుండెను. ఈయుభయ దుర్గములు
30 మైళ్ళదూరములో నుండెను. ఆకాలమున నాంధ్రదేశములో
ననపోతానాయకునియంతటి బలవంతుడగు రాజు లేఁడు. ఢిల్లీ
పాలించు నవాబుతక్క ననపోతనాయని నెదుర్కొను రాజు
మధ్యదేశమున లేఁడనుట సహజోక్తియే.



అగ్రజునకు సహాయముగ దేవరకొండదుర్గము పరిపా
లించు మాదానాయని చరిత్రము పఠించుటయు మనకుఁ బ్రకృ
తముఁ కాదు. మాధవనాయకుఁడు పరిపాలించు దేవరకొండ
దుర్గము. సామాన్యమైనది కాదు. రాచకొండ దుర్గమును
మించినదనియె చెప్పవచ్చును. దేవరకొండ దుర్గమున ౩౬౦
బురుజులు ౯ రాజద్వారములు ౩౨ దొడ్డితోవలు కలవు.
దుర్గమునఁ గొన్ని దేవాలయములు ౩౨ పెద్దబావులు కలవు.
అనపోతనాయని పరిపాలన కాలములో నీదుర్గమును
జూపల్లివారు, వేనేపల్లివారు, కటికినేనివారు, మునుగోటివారు,
గుమ్మడపువారు, కొత్తవారు, మిర్యాలవారు, పానగంటివారు
గుగ్గిలపువా రనుతొమ్మిదిమంది వెలమనాయకులు సైన్యాధ్య
క్షులై సంగ్రామధర్మముల నిర్వహించుచుండిరి. మాధవనాయ
కుఁడు మిగులత్యాగశీలుఁడై విక్రమశాలియై యనేకధర్మములు
గావించి ప్రతిసంగ్రామమున నగ్రజునకు సాయపడి కృత
కృత్యుఁ డయ్యెను.

మాధానాయకుఁడు శ్రీశైలమున సోపానములు
గోపురమండప ప్రాకారములు గట్టించిన శ్రీశైలోత్తర
ద్వారమున నొకమండపము నిర్మించెను. ఇతఁడు సర్వవిధ
ముల ననపోతరాజునకు సమానుఁడనుట కీవద్య మాధారము
కాఁగలదు.

సీ॥ "పరశురాముఁడు తండ్రి • పగ సాధ్యముగఁ జేసి
తరతరమ్ము నృపుల • తలలు నఱికె
సగరుండు తండ్రికై • పగఁగొని రోషించి
తాలజంఘాదుల • తలలు రాల్చెఁ
దఱిమి యశ్వత్థామ • తండ్రికై యెంతయు
నల పాండుసైన్యంబు • తలలుదుంచె
మహిమీఁద సింగయ • మాధవోర్వీశుఁడు
తండ్రికై రాజుల • తలలుగోసెఁ
గీ॥ గాక యబ్బంగి సంగరాం • గణములందు
వైరివీరుల గెలువ నె • వ్వాఁడు చాలుఁ
దనర భార్గవ సగరులు • ద్రౌణి రావు
మాధవుఁడు దక్క శూరులు • మఱియుఁ గలరె॥"

ఆకాలమున మహారాష్ట్రదేశములోని చాలభాగము, ఆంధ్రదేశములోని కొలఁది భాగమును తనయధీనమునందుంచుకొని అల్లాయుద్దీన్ షాహాయను మహమ్మదీయుఁడు కలుబరిగి ముఖ్యపట్టణముగ రాజ్యముపాలింపఁ దొడంగెను, విద్యానగరమునకు ననపోతనాయని రాజ్యమునకుఁ దనరాజ్యము సరిహద్దులలో నుంటచేఁ గాలము గనిపెట్టి యా రెండురాజ్యములలోని దుర్గములను అల్లాఉద్దీను గొన్నింటిని స్వాధీనము గావించికొనెను. సరిహద్దులలోనుండి యీమహమ్మదీయుఁడు గావించు దుర్నయము నంతయు విద్యానగరముఁ బరిపాలించు



బుక్కరాయలు, రాచకొండ పరిపాలించు ననపోతరాజు గ్రహించి సమీపముననున్న యవనుని మట్టుపెట్టుట కెంతయో యత్నించుచుండిరి. ఇంతలో అల్లాఉద్దీన్ షాహా క్రీ. శ. ౧౩౫౮ లో గతించెను. అతని రెండవకుమారుఁడగు మహమ్మద్‌షాహా పితృరాజ్యమునకు వచ్చెను. ఆనూతనుని పరిపాలనమున రాజ్యమం దశాంతి మెండయ్యెను. సేనానాయకులు రాజద్వేషముతో వర్తించుచుండిరి. ప్రజలుగూడ రాజుపై ననూయఁ జూపసాగిరి. ఈస్థితిలో నాతనితల్లి మల్లికాజెహాన్ విశేషముగ ద్రవ్యము సైన్యముఁ దీసికొని మక్కా మదీనా యాత్రలు గావించుటకై తురుష్కదేశమున కేఁగెను. ఈ సందిగ్ధస్థితిఁ గనిపెట్టి బుక్కరాయలు, అనపోతనాయఁడు నైకమత్యము వహించి మహమ్మదీయరాజ్యము నంతము నొందింప నిశ్చయించుకొని మహమ్మదుషాహాసంస్థానమునకుఁ జేరియొక రాయబారిని బంపుచు 'మీతండ్రిహరించిన మాయాంధ్రదేశములోని భాగములు మాకు వదలివేయవలయును, లేకున్నచో మేమిరువురము మీరాజ్యముపైకి సంగ్రామమునను రానున్నార' మను సందేశమును దెలుపఁ బంపిరి.

రాయబారు లిరువురు కలుబరుగఁ జేరి మహమ్మదుషాహాను సందర్శించి తమరాజన్యుల సందేశమునంతయు నివేదించిరి. సందిగ్ధావస్థలోనున్న మహమ్మదుషాహా యేమియుఁ బ్రత్యుత్తరముఁ జెప్పఁజాలక 'యిదిగో అదిగో ప్రత్యుత్తరము

నొసంగుదు' వని చాలకాలము గడపి రాజ్యమునం దశాంతి నెలకొల్పు నుద్యోగులఁ దొలఁగించి ప్రభుభక్తివరాయణులు విశ్వాసవంతులు నగు నూతనోద్యోగుల కధికారపదవుల నొసంగి పొగులపైఁ గ్రొత్తపన్నులు విధించి బొక్కసము క్రమ క్రమముగా వృద్ధిగావించి సైనికబలమును స్వల్పకాలములోనె మిగుల నభివృద్ధిలోనికిఁ దెచ్చెను. వంచనోపాయము తోఁ దన బలము సంగ్రామమునకుఁ జాలినంత సమకూర్చికొని యాంధ్రులగు రాయబారులఁ జూచి 'మీరు స్వస్థానముల కేఁగ వచ్చును. కొలఁదికాలము సైనికులతో మేము స్వయముగా వచ్చి మీరాజన్యులకుఁ బ్రత్యుత్తరము నొసంగెద' మని మహమ్మద్‌షాహా వారిని వంపివేసెను. 'పదునెనిమిది మాసము లుంచికొని చెప్పవలసినసంగతి యిదియా' యని యా నవాబును దెప్పి చేయునదిలేక కలరూపునంతయుఁ దమరాజన్యుల కెఱింగించి సంగ్రామప్రయత్నములో నుంట మేలని వా రిరువురు నిజనివాసములకుఁ జేరిరి. అనపోతనాయఁడు మహమ్మదుషాహా దురంతము విని యాగ్రహించి సంగ్రామ ప్రయత్నములు చేయుచు బలముల నన్నింటి నోరంగల్లు దుర్గమునకుఁ జేర్చెను. బుక్కరాయలు కొంత సైన్యమును ననపోతనాయని సహాయార్థమై యోరుగంటికి సకాలమునకుఁ బంపెను.

మహమ్మదుఖాను ఓరుగల్లు ముట్టడించుటకై యమిత్రమగు సైన్యము నొసంగి సైన్యాధిపతియగు బహదూరుఖానును



బంపెను. దురాశయుఁడగు నాతఁడు గోలకొండ హద్దుజేసికొని మధ్యనున్న గ్రామము లన్నింటిని దోచుచు దురంతములు గావించుచు దేవాలయములను మత మందిరములను రూపుమాపుచుఁ గొలఁదికాలమునకె ఓరంగల్లు సమీపించెను. మహమ్మదీయులబల మమితముగా నుండుటచేతను దమ సైనికులందఱు వ్యాధులచేఁ గృశించియుంట వలనను సంగ్రామము గావింప నశక్తుండై యామహమ్మదీయవీరునితో ననపోతానాయకుఁడు సంధి కంగీకరించెను. సంధి నియమముల ప్రకారము రావలసిన రొక్కమునంతయుఁ దీసికొని యవన నృపాలుడు గృహాభిముఖుఁడై త్రోవఁ గొట్టుచు నమితోత్సాహమున నిజవాసంబున కేఁగి యేలికకుఁ దన విజయ వార్త నంతయు నెఱింగించి యుచితసత్కారముల నొందెను.

'దినము మంచిదైన యూరెల్ల దొంగిలు'మన్నట్లు మహమ్మదుషాహ మఱల నేకశిలానగరమును ముట్టడింప వలయునని యుద్దేశించెను. ఇంతలోఁ గొందఱు మహమ్మదీయులు మహమ్మదుషాహ సమ్ముఖమున కేఁగి యనపోతనాయకుఁడు తమయొద్దఁ గొన్ని యశ్వములను గొని సరియగు వెల నొసంగక యవమానించెననియుఁ బ్రతిక్రియఁ గావించి యవమాన దుఃఖమును వారింపుమనియు ననేకవిధముల వేఁడుకొనిరి. మతావేశపరుఁడగు మహమ్మదుషాహ వారల కభయహస్త మొసంగి యాంధ్రరాజన్యుని బంధించి తీరెదనని పకీ

రులముందు వీరప్రతిజ్ఞఁ గావించెను. "మహమ్మదు సిరాజు ద్దీన్" అనునొక భక్తుఁడు విజయము మనకుఁ గలిగి తీఱునని పది దినము లేకధాటిగ ప్రార్థనములు గావించి పదునొకండవ దినమున యుద్ధమున కేఁగ మహమ్మదుషాహాను ప్రేరేపించెను. ఆ శుభముహూర్తమున మహమ్మదు షాహా సైయఫద్దీను గోరి యనువానికి రాజ్యము నొప్పగించి యమితమగు బలముతో ననపోతానాయకుని బ్రతిఘటింపఁ బయలువెడలి కొంత కాలమునకుఁ గళ్యాణముపురముఁ జేరి యట ప్రయాణాయాసమును దీర్చికొని సైన్యము నెక్కువగా వెంటఁగొని పోయినఁ జాల కాలమగుటయే గాక ప్రయప్రయాసలు సైతము మిక్కుటముగ నగునని తలంచి వెంటవచ్చిన సైన్యములోఁ జాల భాగము వెనుకకుఁ బంపి నాలుగు వేలమంది యాశ్వికులను బదివేలమంది సైనికులను మాత్రము వెంటఁగొని యాంధ్ర నగరరాజమునకుఁ జేరెను. మహమ్మదుషాహా కొంచెము ముందుగ నలువురు భటులనుబిల్చి ఓరుగల్లుద్వారముకడ నిల్చి ద్వారరక్షకులను బ్రమత్తులఁగావించి యేదియో వ్యవహారముఁ బెట్టుకొని యున్నచోఁ దా నాకస్మికముగ బలముతో వచ్చి ద్వారమును భేదింతునని చెప్పివంపెను. నలువురు యవనులటులె యోరంగల్లు ద్వారముచెంతఁ జేరి తాము గుఱ్ఱపు బేరగాండ్రమనియు ననపోతభూపాలుని కొఱకుఁ గొన్నియశ్వములను దూరదేశమునుండి కొనివచ్చితి మనియు



భాషించుచుండఁగా ద్వారరక్షకు లావార్తలు నిజములని విశ్వసించి యుచితవిధుల మఱచి వారితోఁ బ్రసంగించుచుండిరి. ఇంతలో నాకస్మికముగ మహమ్మదీయ సైన్యమువచ్చి ద్వారమును సమీపించి లోనఁ బ్రవేశించెను. ద్వారపాలకు లులికిపడి ద్వారములు బంధింపఁ బ్రయత్నించిరి గాని దృఢతరములగు నా ద్వారములు వేయుట యసాధ్యమయ్యెను. ప్రచ్ఛన్నముగ భాషింపుచున్న యానలువురుయవనులు నిలువుటంగీలలో గుప్తముగనున్న కరవాలములఁ బెఱికి ద్వారపాలకుల వధించిరి. ఆ యదనున మహమ్మదుషాహా బలములనన్నింటిని ద్వారమునుండి పురములోనికిఁ గొనిపోయెను. స్వామిభక్తుఁడును విక్రమశాలియునగు (నాగనాయఁడు) నాగయ రుద్రదేవుఁడు వారల నెదిరించి పురద్వారముచెంత నడ్డగించి సమీపమునఁ గలఁ బురుజునాశ్రయించి స్థిరముగ నిలువఁబడెను. మహమ్మదీయు లాధీరుని ధాటికాఁగఁజాలక బురుజునకన్నివైపులమంటలఁ బెట్టి యామంటతోఁ బైనున్న నాగయ రుద్రదేవుని గ్రమ్మిరి. చాలసేపు ప్రతిపక్షుల దురంతములకుఁ బ్రతిక్రియఁ గావించి కావించి యలసి జాఱి యగ్నిహోత్రమునఁబడి యావీరుఁడు వీరమరణము నొందెను.

ఎంతయో ప్రయాసపడి యవనసైనికులు పురములోఁ బ్రవేశించిరి. ఆంధ్రవీరులు కోటగోడలమీఁదను బురుజుల మీఁదను మేడలమీఁదను నిల్చి యవనదళములపై విచ్చల

విడిన నాగ్నేయగుళికలఁ గ్రుమ్మరింపసాగిరి. పేరుజెందిన యాంధ్రవీరు లనేకులు కరవాలము లుభయహస్తములఁ గీలించి మార్తురబలములతోఁ దలపడి ఘోరసంగ్రామము గావించిరి. ఆనాఁడాంధ్రులు చూపిన యద్భుతవిక్రమమున కనపోతరా జాశ్చర్యము నొంది తానొక యున్నతాశ్వము నెక్కి సైనికుల కుచితధర్మము నెఱింగించుచుఁ బ్రతిపక్షసైన్యముల నిరుమాడించుచుండెను. ఆంధ్రులధాటి కాఁగలేక యవన సైన్యమంతయు ఱాతిపైఁబడిన గోలికాయలవలె తలకొక త్రోవను బాఱిపోయిరి. అనపోతనాయఁడు స్వయముగ మహమ్మదుషాహ నెదిరించి యాతనితోఁ జాలసేపు పోరాడెను. అనపోతనాయనిచే మరణముఁదప్పదని యాతఁడు నిశ్చయించుకొని ప్రాణముపై దీపిచేఁ బాఱిపోయెను. ఆంధ్రసామ్రాజ్యమునకు విజయార్థమరుదెంచి పరాభవము గడించినందులకు గుర్తుగ మహమ్మదుషాహశరీరముపై ననపోతరాజన్యుఁడు రెండుమూఁడు బలమైనగాయములు చేసి పాఱిపోవువానిని వధించుట మగఁటిమికాదని వెనుకకుమరలెను. మహమ్మదుషాహ చావఁగామిగిలిన పదునైదువందల సైనికులతోఁ దల ప్రాణముతోఁక బట్టగాఁ గలుబరగపురమునకుఁ బరాభవమావ మగు నభాగ్యదేవతతోఁ గూడఁ బ్రవేశించెను.

చెప్పరాని పరాభవముతోఁ గలుబరగఁ జేరియు మహమ్మదుషాహ మరల నాంధ్రనగరమును ముట్టడింప బలంబుల



నాయితము చేయుచుండెను. కలుబరగ బహామనీవంశము నిర్మూలముగావింపకున్న నేసమయమున నేయపాయము కలుగునో యని యనపోతనాయఁడు చాలతడవు విచారించి ఢిల్లీ చక్రవర్తిగానున్న ఫిరోజీషాహకడ కొకరాయబారము పంపెను. రాయబారులు ఢిల్లీనగరమున కేగి ఫిరోజిషాహను దర్శించి బహామనీరాజ్యము నంతమొందించి కలబరగ ఢిల్లీలోఁ గలుపుకొందురేని యనపోతభూపాలుఁడు మీకు సర్వబలములతో సహాయము రానున్నా" డనియు లేక మీ రుచితబలములఁ బంపుదురేని తనబలములతోఁగూడ ననపోతభూపాలుఁడు సంగరకార్యము నిర్వహించు'ననియు విన్నవించిరి. నవా బప్పుడు కుటుంబకలహములలో మగ్నుఁడై యుంటచేఁ గర్తవ్యశూన్యుఁడై రాయబారులకుఁ బ్రత్యుత్తరము నొసంగక ప్రకృతము తా నా యుభయమార్గముల నంగీకరింపఁజాలఁడనియుఁ బరులకు సహాయముఁ గావింపఁదగినంతబలము తనచెంత లేదనియుఁ దమ రాజుతోఁ దెలుపుమని మాత్రము చెప్పెను. రాయబారులు నిరుత్సాహముతో నాంధ్రనగరమున కేఁగి జరిగినయంశము నంతయు ననపోతభూపాలున కెఱింగించిరి.

అనపోతనాయఁడు ఢిల్లీనవాబుతో మంత్రాంగముల చేయుచున్న సంగతి గూఢచారులవలన మహమ్మదుషాహ యాలకించి కోపము నొందినవాఁడై యనపోతరాయని రాజ్యచ్యుతుని గావించుటయో యతనిచే నంతరించుటయో కర్తవ్య

మని యమితబలసమన్వితుఁడై యేకశిలానగరమునకు దాడి వెడల యత్నించి తనయావద్బలమును రెండుగా విభజించి యం దొకభాగమును "అజీము హుమాయూన్" అనువాని యాధిపత్యముతో విదర్భదేశమును ముట్టడింపఁ బంపి మిగిలిన సగముబలమునకు సరదరుఖానుని యధ్యక్షునిగావించి యాతనివెంటనే తాను స్వయముగా నోరుగంటికిఁ బయనమయ్యెను. ఈసమయమున మునుపటివలెనే సయ్యదియుద్దీనుగోరీయే సైన్యాధికముల స్వల్పముగా నుంచికొని కలుబరగ దుర్గముఁ గాపాడుచుండెను. మహమ్మదీయబలము కొంతకాలమునకు ఒరంగల్లుచేరెను.

యవనబలము లాకస్మికముగ నోరుగల్లు ప్రవేశించువఱకచట తగినంతమంది సైనికులు లేకుండిరి. ఒకపద్మనాయక వీరుఁడుమాత్రము ద్వారమును గొలఁదిబలముతోఁ గాచుకొనియుండెను. సైనికులందఱు ననపోతనాయనివెంటఁ గొండవీటిరెడ్డిరాజులఁ బ్రతిఘటించుటకై ధరణికోటప్రాంతములకేఁగియుండిరి. మహమ్మదీయులు స్వల్పబలముతోనున్న యేకశిలానగరము నవలీలభేదించి యేయాటంకము లేకుండ లోనఁ బ్రవేశించిరి. మహమ్మదీయులు రాజ్యమునఁబ్రవేశించి యనేక దురంతములఁ గావించిరి. వేగులవారీయుదంతము నంతయు ధరణికోటకేఁగి యనపోతనాయని కెఱింగించిరి. వెంటనే యనపోతనాయఁడులికిపడి రెడ్డివారితో నెటులో సంధిగా



వించుకొని యేకశిలానగరము ప్రవేశించెను. మహమ్మదీయ సైన్యము విజయసూచకముగాఁ గోటలో గుడారములో విడిసియుండిరి. ప్రతిఘటించినచో విజయ మసాధ్యమని సంగరమర్మజ్ఞుఁడగు ననపోతనాయనికి స్ఫురించెను. అదిగాక రెడ్డివారితోఁ జాలకాల మెడతెగకుండఁ బోరాడుటచే నాంధ్రసైన్యమంతయు భిన్నభిన్నమై యుండెను. మహమ్మదీయ బలమంతయుఁ జెక్కుచెదరక కోటలో స్థిరవాసము నేర్పఱచుకొని యేకశిలానగర రాజ్యమును మ్రింగివేయవలయునని బయలుపందిరులు వేయుచుండెను. దైవముకూడ వారలపక్షముననె యున్నటుల ననపోతనాయని కశుభసూచనము లనేకములు గోచరించెను.

పుట్టినదాదిగ ననపోతరాజపజయము నొందినవాఁడు కాఁడు. ఆకాలమునఁ గల యాంధ్రరాజన్యులలో నాతఁడె పై చేయిగ నుండెను. అనపోతనాయఁ డొకసేనానాయకుని కుమారుఁ డను నంశము మాపాఠకులు మఱచియుండరు. తన బాహుబలము, శక్తిసామర్థ్యములు, బలసాహసములు వ్యయము గావించి యాతఁడు నిరాటంకముగ నాంధ్రదేశములోని చాల భాగమును తన ఛత్రచ్ఛాయక్రిందకుఁ జేర్చికొనెను. మొక్కవోని పరాక్రమముగల యనపోతరాజన్యుఁడు తనసైన్యమునకు విచారించి కొందఱు రాయబారులను మహమ్మదుషాహాయొద్దకుఁ బంపెను. అనపోతనాయఁడు రాయబారము

లకు వచ్చినదెచాలునని మహమ్మదుషాహ సంతోషించి తన దుర్బలస్థితిఁ దలంచుకొని గోలకొండ ప్రాంతముల నొసంగినచో వెనుక కేగెదనని వర్తమానమంపెను. కాల పరిస్థితులను గాఢముగ యోజించి చేయునదిలేక కట్టకడ కనపోతభూపాలుఁడు కొంతద్రవ్యము, గోలకొండదుర్గము, దానికి సంబంధించిన గ్రామములు మహమ్మదుషాహ కొసంగ నంగీకరించెను. మధ్యవర్తులుచెప్పిన సరిహద్దులు వెంటనే యేర్పాటుచేసికొని సంధిరూపకముగ నొసంగిన యపరిమిత ధనముగొని గోలకొండరాజ్యముతోఁ దృప్తిపడి మహమ్మదుషాహ గృహముచేరెను. అనపోతనాయఁడు తన జీవితకాలములో నొందిన పరాజయ మిదియొకటియె యని చెప్పవచ్చును. అనపోతనాయకుని విక్రమజీవితము వెల్లడించు పద్యములు కొన్ని యాంధ్రజనులు పఠించుచున్నారు. చరిత్ర జిజ్ఞాసువుల యభిరుచి నుద్దేశించి యాపద్యములలో ముఖ్యము లగువానిని గొన్నింటి నీక్రింద నుదాహరించి యీశూర వర్యుని విక్రమజీవిత గ్రంథము ముగించుచున్నారము.

ఉ॥ ఆలములోన సింగవసుధాధిపనందనుఁ డన్నపోతభూ
పాలకమాళి కోడి యనిఁ బారిన వైరుల నాలభంగినే
తోలునుగాని చంపఁడేఁట దోసమటంచును నౌర రాయగో
పాలున కుర్విలోనఁ బశువర్గముఁ గాచుట సాజమేకదా!

మ॥ చిరకాలవ్రతశీలుఁడై నరుఁడు కాశీతీర్థ నిర్మగ్నుఁడై
స్థిరలీలన్ వృషభంబునెక్కి రజతాద్రిం జెంది ముక్కంటియై



టరుదే సింగయ యన్నపోత విభుబాహా ఖడ్గనిర్మగ్నుఁడై
యరివీరుండు గజంబునెక్కి సురరాజై యద్భుతంబెన్నఁగన్.

సీ॥ అశ్వరేవంతుండు • హయమునునెక్కిన
దండిరాజులగుండె • తల్లడిల్లు
దరిని దద్భీకర • కరవాలహతికిని
గర్ణాటసేనలు • కళవళించు
సంగ్రామపార్థుని • చాపటాంకృతులకుఁ
దెలుఁగురాజ్యంబెల్ల • దిగులుకొనును
ప్రబల నిశ్శంకకు • బల్లెంబు ధాకకు
నులుకులుకు పడుచుండు • రొడ్డెరాజు
తే. గీ॥ లకఁడు దరిమినచో నుండు • వితము లేక
పారిది సురధాని రాజులు • సొంపుఁదప్పి
యోటమందిరి సింహారి • కోటబయల
సన్నుతఖ్యాతి యనపోత • మన్నెరాజు॥

ఉ॥ ఒక్కఁడు జారముఖ్యుఁ డొకడూరకరోజుఁ బరేతపాలకుం
డొక్కఁడొకండు రాత్రిచరుఁ డొక్కఁడు చాఽ జడుండు
చంచలుం। డొక్కఁడొకండు యక్షఘనుఁడొక్కఁడు భిక్షుకుఁ
డేటి దిక్పతుల్ । దిక్కుల నన్నపోత జగతీతల నాథుఁడుదక్క
మేదినిన్॥

(అనపోత భూపాలుఁడు క్రీస్తుశకము ౧౩౪౪ మొదలు
౧౩౬౦ వరకు రాచకొండ ముఖ్యపట్టణముగ నాంధ్రదేశము

న బరిపాలించెను. ఇతనిశాసనములు నిజామురాష్ట్రము లోని యయ్యనవోలు, దేవరకొండ, రాచకొండ లోనగు చోటులఁ గానవచ్చు చున్నవి.)

# సాళ్వ నరసింహ రాజు.

బుక్కరాయల యనంతరము విద్యానగర సామ్రాజ్యమును (రెండవ) హరిహరరాయలు, (మొదటి దేవరాయలు, ప్రౌఢ దేవరాయలు, మల్లికార్జునరాయలు, విరూపాక్షరాయలువరుసగఁ బాలించిరి. వీరిలోఁ బ్రౌఢరాయలు చిరకాలము రాజ్యము తన పూర్వులకు సమానముగాఁ బాలించి మితిలేని ధనము భాండాగారమునఁ జేర్చి క్రీ. శ. ౧౪౪౬ ప్రాంతమున మరణించెను. ప్రౌఢదేవరాయలకు పొన్నలదేవివలన మల్లికార్జునరాయలు, సింహళదేవివలన విరూపాక్షరాయలు జనించిరి. మల్లికార్జునరాయలు తనపూర్వులుసంపాదించిన రాజ్యమును జాగరూకతతోఁ గాపాడుకొనుచుండెను. ఒక్క ప్రక్కను మహమ్మదీయులు పూర్వవైరమును బురస్కరించుకొని కర్ణాట సామ్రాజ్యమును గబళింప నుండిరి. కటకపాలకుఁడగు కపిలేంద్ర గజపతివిస్తార మగు బలమును సమకూర్చుకొని ఆంధ్రదేశమునందలి ప్రసిద్ధ దుర్గముల నన్నిటిని లోఁబఱచికొని విద్యానగరమును ముట్టడించెను. మల్లికార్జునరాయలు ఘోరసంగరము చిరకాలము



గావించి గజపతి నెటులో తరిమివేసెను. గజపతి యంతతోఁ బోక చిక్కిన దుర్గములను జిక్కినటుల లోఁగొనుచుఁ జంద్రగిరికిఁ బోవఁగా సాళ్వనరసింహరాజు గజపతిని దన పాలనము నందడుగిడనీయక సరిహద్దులవఱకుఁ దరిమెను.

మల్లికార్జున రాయల తరువాత విరూపాక్ష రాయలు విద్యానగరసామ్రాజ్యపాలకుఁ డయ్యెను. సహజముగాఁ జంచల స్వభావుఁడును భోగపరతంత్రుఁడును నగు నీ రాజు రాజకీయ వ్యవహారములఁ గొంచెమేని లక్ష్యము కలుగఁజేసికొనక యెల్లపుడు భోగస్త్రీలతోఁ గ్రీడించుచు సురాపానమత్తుఁడై యుండెను. ఈ యసమర్థుని తెలివితేటలు గమనించి మహమ్మదీయులు గోవాపట్టణము నాక్రమించికొనిరి. కపిలేంద్ర గజపతి యనంతరము విరోధిజన దుర్గమమని పేరొందిన విద్యానగర రాజ్యమును అతనికుమారుఁ డగు పురుషోత్తమ గజపతి ముట్టడించి సైన్యమును నోడించి అపరిమిత ధనమును రత్నసమూహమును సింహాసనమును గైకొని కటకము చేరెను. రాజ్యమునందుఁ బరులు ప్రవేశించుట కిదియె మొదలు. తురుష్కుల దండయాత్రలతోఁ గొంత రాజ్యభాగము గూడఁ బరాధీనము కానుండెను. గజపతి విద్యానగర సామ్రాజ్యమును గబళింపఁ దగినంతబలమును సమకూర్చుచుండెను. ఏడులక్షల వఱకుఁ దండ్రికాలమునం దున్న సైనికబల మంతయుఁ దరిగి పోయెను. మూలధనముగాఁ దండ్రి సేకరించిన ఎనుబదియైదు

కోటుల వరహాలుగూడ నాశమయ్యెను. సర్వవిధముల మహో
న్నతదశయందుండి ప్రకృతిసహజమగు శైలదుర్గములచేతను
దుంగభద్రావాహినిచేతను సురక్షితముగానున్న విద్యానగర
సామ్రాజ్యమును జేసేతుల విరూపాక్షరాయలు పాడు
చేయుటఁజూచి సామంతులు సేనానులుగూడఁ దిరస్కారభావ
ముతో నుండిరి. ఇంక నుపేక్షించినయెడలఁ బరిస్థితులు విష
మించునని రాజశేఖరురాయలు తన తండ్రియగు విరూపాక్ష
రాయలను జంపించెను. ఇతని సోదరుడగు రెండవ విరూపాక్ష
రాయలు రాజశేఖరురాయలను జంపించెను. భ్రాతృహంత
యగు రెండవవిరూపాక్షరాయలయెడఁ బ్రజలహృదయములం
దసంతృప్తిజనించెను. రాజ్యమునం దంతటను దిరుగుబాటు
లభివృద్ధియయ్యెను. ఎవనికి వాఁడె స్వాతంత్ర్యమును బ్రకటింప
యత్నించుచుండెను. ఉదయగిరిరాజ్యము అంతకుముందె గజ
పతు లావరించుకొనుటయుఁ జంద్రగిరి, పెనుగొండ, గండి
కోట రాజ్యములు సాళ్వ నరసింహభూపాలుని స్వాధీనమునం
దుంటయుఁ గర్నాటరాజ్య దుర్బలస్థితికిఁ దార్కాణములుగ
నుండెను. ఈ స్థితిగతులలో బహమనీ సుల్తానులు కర్ణాట
రాజ్యమును హరింప సిద్ధముగా నుండియు సాళ్వ నరసింహ
భూవిభునిధాటికి వెఱచి యూఱకుండిరి.

'విద్యానగర రాజ్యము నుపేక్షించినచో యవనులు
హరింపక మానరు. విద్యారణ్యాది మహానుభావులు తమశక్తి



ధారవోసి నెలకొల్పిన యీమహారాజ్యమునుగోలుపోతిమేని ఆర్ష
ధర్మము లంతరించి దేశమంతయు సంక్షోభ మొందకమానదు,
అని సాళ్వనరసింహరాయఁడు తలంచి తనక్రింద దుర్గాధ్యక్షుఁ
డుగానున్న తుళువనరసరాయలను బిలువనంపి విద్యానగరరాజ్య
మును ముట్టడింపుమని యాజ్ఞాపించి తనయొద్దనున్న సైన్యమునంత
యు సహాయముగాఁ బంపెను. నరసరాయఁడు తనబాలమిత్రుఁ
డును రాజ్యకార్య విశారదుఁడును సంగరకౌశలుఁడు నగు
తిమ్మరుసుమంత్రిని సహాయముగాఁ గైకొని యొక శుభ
ముహూర్తమున విద్యానగరమును ముట్టడించెను. సాళ్వనర
సింహ భూపాలుని ధర్మపరిపాలనమునందు అభిమానముగల
సేనానాయకులు నరసభూపాలునకు స్వాగతము నొసంగి విద్యా
నగర సామ్రాజ్యమును స్వాధీనపఱచిరి. తుళువనరసరాయలు
మేళతాళములతో రాజవీధులలో నూరేఁగుచు నగరము
లోనికిఁ వచ్చుచుండెను. ఒకభటుఁడు రాజమందిరములోనికిఁ
బోయి భోగపరాయణుఁడగు విరూపాక్షరాయలకు "సాళ్వనర
సింహభూపాలునిపంపునఁ దుళువ నరసరాజువచ్చి సామ్రా
జ్యము నంతయు లోఁబఱచు కొనుచున్నాఁడు. వీలున్నఁ బ్రతి
కృతి గావింపు"మని విన్నవింపఁగా సంతోషభంగకరమగు నిట్టి
సందేశముదెచ్చితివాయని భటునవమానించి బైటికిఁ బంపెను.
నరసరాజు తానుసాధించిన నగరభాగముల నన్నింటిని భటుల
కప్పగించి రాజమందిరము ప్రవేశించెను. నరసరాజు దగ్గరకు

రాఁగా నిఁక నుపేక్షింపఁ దగదని యీరాజమాతృఁడు అంతః పురకాంతలను రాజమందిరమును సంపదలను విడిచి ప్రాణభయముతో దొడ్డివాఁకిలి తెఱచికొని పారిపోయెను. నరసరాజు కోటను భాండాగారమును ధనకనకవస్తువాహనములను. రక్తపాతము లేకుండ సాధించి యీవిజయవర్తమానము తన యజమానియగు సాళ్వ నరసింహరాజునకుఁ దెలిపి పట్టాభిషిక్తుఁ డగుటకు రమ్మని వర్తమాన మంపెను. ప్రజలందఱు మఱల సత్ప్రభువె తమకు లభించెనని మిగుల నానందించి పట్టాభిషేకమహోత్సవ మెపుడుజరుగునా యని నిరీక్షించు చుండిరి. నరసరాజు రాజకీయోద్యోగుల నందఱను బరిశీలించి పూర్వరాజ పక్షపాతు లగువారిని వెదకి యుద్యోగముల నుండి తొలంగించి యాపదవులను విశ్వాసపాత్రులగు తన నౌకరుల కొసంగెను. విద్యానగర రాజ్యమునం దంతటను నూతనోద్యోగులను నరసరాజు నెలకొల్పి విప్లవోద్యమములకుఁ దావే లేకుండఁ జేసెను.

శాస్త్రవేత్తలు పెట్టిన శుభముహూర్తమునఁ బట్టాభిషేకమహోత్సవము జరుపుటకు నేర్పాటులు చేయఁబడెను. సామంతులకు రాజబంధువులకుఁ గవులకు గాయకులకు సేనానాయకులకు ఉద్యోగులకు ఆహ్వానపత్రికలను నరసరాజు, తిమ్మరుసుమంత్రి స్వయముగాఁ బంపిరి. సాళ్వ నరసింహ భూపాలుని దామంద అంతకు మున్నె యెఱింగి యుంట



చేతను నాతని ధర్మపరిపాలనము చిరకాలమునుండి వాంఛించుచుంట చేతను ఆహూతులందఱు సకాలమునకు విచ్చేసిరి. సామంతులు, పౌరులు కట్నములుగా విలుగల రత్నములు, బంగారము, భూషణములు గొనివచ్చిరి. శుభముహూర్తము దాటకుండుటకు ముందె నారాయణవనమునుండి నరసింహరాజు సను స్వపరివార బంధుమిత్ర సహితుండై చనుదెంచి (శా. శ. ౧౪౦౭, సరియగు క్రీ. ౧౪౮౬ లో) కర్ణాట రాజ్యమునకుఁ బట్టముగట్టుకొనెను. నరసరాజు, తిమ్మరుసుమంత్రియు రాజ్యభార ధురంధరులై రాజ్యకార్యము లుత్సాహముతో నెరవేర్చుచుండ సాళువ నరసింహరాజు కర్ణాటరాజ్యమునకు నపూర్వశోభ సమకూర్చి విరోధులకుఁ బ్రక్కలోని బల్లెమై ప్రజారంజకముగాఁ జిరకాలము ధర్మబద్ధముగా రాజ్యమును బరిపాలించి కీర్తి గడించెను.

సాళ్వ నరసింహరాజుపూర్వు లందఱు తొల్లింటినుండి విద్యా నగర సామ్రాజ్యమునందు మంత్రులుగను సేనాపతులుగను రాజప్రతినిధులుగ నుండి విశ్వాసపాత్రులై కీర్తి గడించిరి. మొదటినుండి హరిహరరాయల వంశముతో సాళ్వవారికి సంబంధ బాంధవ్యములుగూడఁ గలవు. విద్యానగర రాజ్యమున కీతఁడు వచ్చిన వెంటనే సైనికబలమును మిగుల నభివృద్ధిలోనికిఁ దెచ్చెను స్వదేశమునం దుత్తమాశ్వములు విస్తారముగా లభింపక పోవుటచే నరసింహరాజు రాజభాండా

రమునందలి ధనము విరివిగా నుపయోగించి పారశీదేశము నుండియు అరబ్బీ దేశమునుండియు ఉత్తమాశ్వములను దెప్పించెను. బ్రతికిన గుఱ్ఱమునకైనను మార్గమధ్యమునఁ జచ్చిన గుఱ్ఱమునకైనను మూడు గుఱ్ఱములకు వేయివరహాల చొప్పున ధనమొసంగి అశ్వముల నన్నింటినో కొని అశ్వికదళము నభివృద్ధి గావించెను. చచ్చిన గుఱ్ఱములతోఁకలఁ జూపినంత మాత్రముననే విలువయొసంగు చుండుటచే యవనవర్తకులు ధారాళముగా అశ్వవ్యాపారముగావించి విజయనగర రాజ్యమును అశ్వబృందములతో నించివేసిరి. నరసింహారాజు అశ్వికదళసహాయమునఁ దనశక్తి సామర్థ్యములు పూర్తిగా నుపయోగించి అన్యాక్రాంతములైన రాజ్యముల నన్నింటిని దిరుగ సంపాదించెను. ఉదయగిరి, రాయచూరు, కొండవీడు దుర్గములు సాధించుకొనుటకుఁగూడ యత్నించెను గాని యంతలో నాతఁడు కాలధర్మము నొందెను.

సాళువ నరసింహారాజు ఆంధ్రవాఙ్మయమున కెంతయుఁ జేయూత నొసంగెను. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని సత్కరించి జైమిని భారతము నంకిత మొందెను. పలువురు కవు లీనరపాలుని గుణకీర్తనము గావించినటులఁ జాటువులవలన నెఱుంగనగును. ఈయనయొద్ద మంత్రిగా నాదెండ్ల చిట్టిగంగనామాత్యుఁ డను నియోగిబ్రాహ్మణుఁడుండెను. ఈయన విద్యానగరమును కృష్ణదేవరాయల కాలమునందు మంత్రిగానుండి



పరిపాలించిన తిమ్మరుసుమంత్రికి మాతామహుఁడు. గొప్ప రాజకీయవేత్త యనియు మహాశూరుఁ డనియుఁ బేరొందెను.

నరసింహారాజు తన యంత్యకాలమున విశ్వాసపాత్రుఁడగు సేనానియు, విద్యానగరమును బట్టుకొనుటలో నెక్కువ సహాయపడినవాఁడును, తనఅన్న మనుమఁడును నగు తుళువనరసరాజును బిలువనంపెను. ఆయనతో నిటులఁ జెప్పెను: "మిత్రమా! నా కంత్యకాలము సమీపించినది. నాకుమారు లిరువురు పసివాండ్రు. భాండారము, రాజ్యము నీచేతిలో నుంచుకొని పాలకుఁడవుగానుండి యుక్తవయస్సు వచ్చినపిమ్మట రాజ్యము నాకుమారుల కొసంగుము. ఈకార్యము నొనరించి సామ్రాజ్యము నుద్ధరించుటకు నీవుదక్క వేఱొకఁడు లేఁడు." నరసరాజు అంగీకరింపఁగనే నరసింహారా జతనికిఁ బట్టాభిషేకము చేసి గతించెను. విశ్వాసవంతుఁ డగు నరసరాజు చిరకాలము రాజప్రతినిధిగనే యుండి పరిపాలించెను. నరసరాజు అంతకు మున్ను కుంతలదేశంబు నందును చోళమండలము నందును శ్రీరంగము నందును ఘోరసంగరము లొనరించి విజయము నొందిన పరాక్రమశాలి గావునఁ బౌరు లీతనిపరిపాలనమున కనుకూలురై యుండిరి. ఆంధ్రభాషాభిమానియై యీ నరపాలతిలకుఁడు నంది మల్లయ్య, ఘంట సింగయ్య అను జంట కవులచే వరాహపురాణమును రచింపఁజేసి అంకితమునొందెను.

నరసరాజు సాళ్వ నరసింహరాజుపుత్త్రులలోఁ బెద్దవానికి రాజ్యము నొసంగి తాను వ్యవహారములఁ జూచుచుండెను. నరసరాజువిరోధు లాతనియెడల నెపము గలిగింపనెంచి బాలరాజును జంపించి యాదురంతము నరసరాజునెడ నారోపించిరి. నరసరాజునిందఁ దొలఁగించుకొనుటకు నరసింహరాజు రెండవ కుమారునకు విద్యానగరరాజ్యమును పట్టాభిషేకము గావించి రాజకీయ వ్యవహారములు తాను సవరించు చుండెను. నరసరాజు శ్రేయమునకు సహింపని దుష్టులగు కొందఱు రాజకీయోద్యోగులు బాలరాజునకు లేనిపోని కొండెములు చెప్పి "నీయన్నను జంపించినటుల నిన్నుఁగూడ నరసరాజు చంపింప నున్నాఁ" డని వీలువెంట నూరిపోసిరి. ప్రపంచజ్ఞానశూన్యుఁడగు నాబాలుఁ డామాటల నమ్మి నరసరాజును ద్వేషింప మొదలుపెట్టెను. ఇంక నుపేక్షించిన బాలరాజు తన కపాయము చేయుటయేగాక విద్యానగరరాజ్యమును గూడఁ గోలుపోక మానఁడని తన పలుకుబడి నుపయోగించి సైన్యమునంతయు గూడఁగట్టుకొని యాతని బంధించి పెనుగొండదుర్గమున నుంచి ఆహారాదులకు స్వల్పభరణము నొసంగసాగెను. కొంత కాల మెటులో గడపి బాలరాజు మరణించెను. తుళువరాజ ప్రత్యర్థులగు నుద్యోగుల నందరను దొలఁగించి సామ్రాజ్యమును బునరుద్ధరించి యమితవిఖ్యాతి గడించెను.

సాళ్వనరసింహరాజు క్రీ. శ. ౧౪౯౦ ప్రాంతమున మరణించెను. ఈయన కాలమునుండి విద్యానగరము ఆంధ్ర-



సామ్రాజ్య మనఁదగి ఆంధ్రకవులకు ఆంధ్రులకు నభిమానస్థలమయ్యెను. నరసింహరాయలు ధర్మపరిపాలనము చేయుటచే నాతని పరిపాలనమునందున్న రాజ్యమునకుఁ బరదేశీయులు నరసింగరాజ్యమని పేరిడిరి. ఈయన పరిపాలన కాలమునఁ దురకలు శ్రీరంగము నాక్రమించుకొని వసతులన్నియు నూడలాగుకొనుటచే బ్రాహ్మణులందఱు లేచిపోయిరి. నరసింహరాజు తురకలఁ బోఁదోలి నగరమును స్వాధీన పరచుకొని పూర్వవృత్తుల నన్నింటిని దిరుగనొసంగి శ్రీరంగస్థాపనాచార్య బిరుదము వహించెను. ఈయనచరిత్ర మంతయు సాళ్వాభ్యుదయమను సంస్కృత కావ్యమునందు విపులముగా వర్ణింపఁబడియున్నది. ఈయనకుఁగల చిత్రబంధపరమేశ్వరుఁడు, అభినవనాటక భవభూతి, అష్టభాషా పరమేశ్వరుఁడు, రసికకవితా సామ్రాజ్య లక్ష్మీపతి మున్నగు బిరుదముల వలనఁ గవియు రసికుఁడు గూడ నీనృపాలుఁడై యుండునని తెల్లమగుచున్నది. అదృష్టజాతకుఁడగు నీనృపుఁడు విద్యానగర సామ్రాజ్యోద్ధారకుఁడును, ఆంధ్రుఁడును గావున మనకెంతయు గణ్యుఁడు.

# సోమనాద్రిరెడ్డి

నిజాము రాష్ట్రములోని మహబూబునగరు మండలమున అమరవాది యను నగరముగలదు. ఆనగరముచెంతఁ గల అచ్చమ్మపేట, రఘుపతిపేట యను గ్రామములను బాకనాటి రెడ్డిశాఖకుఁ జేరిన తిమ్మారెడ్డి యను వీరుఁడు పాలించుచుండెను. ఈయనభార్య వీరవతంసుఁడని పేరొందిన మెదకు మండలపాలకుఁడగు సదాశివరెడ్డి తోఁబుట్టువు కేశవమ్మ. ఈదంపతులు పశుసమృద్ధియు, ధనసమృద్ధియుఁ గలవారై సుఖముగా నుండ క్షామదేవత దేశమును బీల్చి పిప్పిచేయుచుండెను. పంటలు తగ్గిపోయెను. పశువులు మేఁతలేక మాడిచచ్చుచుండెను. ప్రజ లన్నమోరామచంద్రాయని యేడ్చుచుండిరి. చేరెఁడు గంజినీళ్ళకు జనులు మోమువాచి నశించుచుండిరి. తిమ్మారెడ్డిచెంత పుట్లకొలఁది ధాన్యము గలదు. కావలసినంత ధనముగలదు. ప్రజల ఘోషచూచి సహింపఁజాలక పాతరలుదీయించి తనయొద్దఁగల ధాన్యముదంపించి వచ్చినవారందఱికి నెలలకొలఁదిఅన్నము పెట్టించెను. ఎంతకును గఱవు తగ్గదయ్యెను. గరిసెలు పాతరలుకూడ రిత్తవయ్యెను. ప్రజలాఁకలిగొని చచ్చుచుంటఁ జూచి తనభార్య వస్తువులను మంగళసూత్రము దక్క మిగిలిన వన్నియు నమ్మెను. అప్పటికిని బ్రజలబాధ తగ్గదయ్యెను. ఇఁక నిటనున్న లాభము లేదని



తానుగూడ నాఁకలిచే మలమలమాడుచుఁ గూలినాలియైన చేసి జీవించుదమని మల్లారెడ్డి తన భార్యయగు కేశవమ్మను వెంటఁబెట్టుకొని బయలుదేరి కొల్లాపురము, పెంట్లవెల్లి, మఖారవకొండ లోనగు గ్రామములకుఁ బోవ నెందును గూలి దొఱకకపోయెను. కడకు కొల్లపోలూరను గ్రామమునకుఁ బోయి యచటఁ గూలినాలిచే జీవించుచుండెను. దొఱకిన కూలిధాన్యములోఁ గొంచెము కొంచెము మిగిల్చికొని తిమ్మారెడ్డి కొంత ధాన్యము సంపాదించి పాలికొక యెద్దును దీసికొని వ్యవసాయమును బెట్టెను. క్రమముగాఁ గలసి వచ్చుటచేఁ దిమ్మారెడ్డికొంతకాలమునకు గొప్ప రైతై ధనధాన్య సమృద్ధితో నుండెను. ఈశుభావసరమున వీరికొక కుమారుడు గలిగెను. సోమలింగేశ్వరుని యనుగ్రహమున జనించినవాడగుటచే నా బాలునకు సోమనాద్రియని నామకరణము గావించి సంతోషముగాఁ గాలము గడపుచుండిరి. వీరిశ్రేయముఁజూచి సహింపలేక గ్రామస్థులు కొందఱుటులేని యిబ్బంది పెట్టవలయునని తలంచి ఆప్రాంతములు పాలించు కర్నూలు నవాబగు దావత్‌ఖాను నొద్దకుబోయి తిమ్మారెడ్డి యను రైతు మీపైఁ దిరుగుఁబాటు చేయుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు. వాఁ డాయుధములు, ధనము, ధాన్యము సిద్ధము చేయుచున్నాఁడని విన్నవించిరి. నవాబు పలువురను బిలువనంపి యావార్త నిజమో కల్లయో దెలుపుమన వారంతకుమున్నే యీకుట్రలోఁ జేరినవారగుటచే

వారును నటులనే చెప్పిరి. దావత్ ఖాను వెంటనే కొత్తపోలూరునకు దండయాత్రకు బయలుదేరి తిమ్మారెడ్డిని బిలువనంపి చెట్టునకుఁ గట్టించి దయాశూన్యుఁడై కొట్టించి యతనిధనము, పశువులు, ధాన్యములు కొనిపోయెను. దెబ్బలచే నొడలంతయువాచి తిమ్మారెడ్డి గతించెను. కేశవమ్మ, తనకుమారుఁడును ఏడెనిమిదేండ్లు నిండని కూనయగు సోమనాద్రిని వెంటఁబెట్టుకొని పుట్టినింటికిఁ బోవుచుండెను. త్రోవలో రాజవోలనుగ్రామముగలదు. అచటగల కేశవాచార్యులను విద్వాంసుఁడు బాలురకుఁ బాఠములు చెప్పుచు వీధిలోఁ గూర్చుండి తల్లివెంట నేఁగుచున్న సోమనాద్రిని జూచి యీబాలుని ముఖమున మహారాజచిహ్నము లున్నవని గ్రహించి కేశవమ్మవలన బాలకునిచరిత్రము నంతయు విని జాలిపడి యిటులఁ జెప్పెను. "అమ్మా! నీపుట్టినింటి గౌరవము, నీభర్తపేరుప్రతిష్ఠలు నేనెఱుంగనివి కావు. చెడి పుట్టినింటికిఁ బోవుటకంటెఁ బ్రమాద మింకొకటి యుండఁబోదు. కష్టములు కలకాల ముండఁబోవు. ఈబాలుఁడు లోకఖ్యాతి గడింపఁగలఁ డని నాకుఁ దోఁచుచున్నది నాయొద్ద నుంచినచో నేను సమస్త శాస్త్రములు నేర్పెదను. నిన్ను, నీశిశువగు నీబాలకుని నే నున్నంతలోఁ బోషింపఁ గలుగుదును. ఇచట నే యుండుట నా కభిమతము." కేశవాచార్యులవాక్యములు వినినంతనే వివేకవతియగు కేశవమ్మ యచటనే నిలువ నంగీకరించి బాలుని



ఆచార్యుల వారి కప్పగించెను. అమరవాయి నాగిరెడ్డి, బోరవెల్లి వెంకనబోయ, ధర్మవరము వెంకటరెడ్డి, అక్కి కురుమన్న, సాన లింగన్న అను బాలురతోఁగలిపి సోమనాద్రికిఁ గేశవాచార్యులు ఆంధ్రము, సంస్కృతము, అర్థశాస్త్రము, గణితశాస్త్రము ధనుర్విద్య నేర్పెను. ఒకనాఁడు సోమనాద్రి చెట్టుక్రిందఁ గూర్చుండి పాఠములు చదివిచదివి యలసి నిదురఁ బోయెను. బాలునిముఖమున కెండ సోఁకకుండఁ జెట్టుపైనున్న త్రాఁచుబాము తనపడగ గొడుగువలెఁ బట్టెను. ఆచార్యుఁ డిది చూచి యీబాలుఁడు మహారాజగుట నిక్కమని తలంచి యట నుండి వెడలిపోయెను. కేశవాచార్యులయొద్దఁ జదువవలసిన దంతయు సూక్ష్మగ్రాహి యగు సోమనాద్రి కొలఁదికాలములో ముగించి గురువుగారిని సెలవిమ్మని వేఁడెను. కుమారునివలె నింట నున్నసోమనాద్రిని విడిచిపెట్టజాలక కన్నీరువిడిచి 'కుమార! నీవేనాఁటికేని మహారాజువగుదు వేని మమ్ములను మఱువకు' మని హెచ్చరించెను. సోమనాద్రి నిరాశతోఁ జిఱునవ్వు నవ్వి నావంటి గర్భదరిద్రుఁడా రాజగువాఁడు? నేనే రాజునగుదునేని మీరు మంత్రులు కాకపో రని సెలవు పుచ్చుకొనెను. సహపాఠులు సోమనాద్రిని జేరి 'మమ్ము మఱచి పోవకుము సుమా!' యని హెచ్చరించిరి. సోమనాద్రి వారినందఱ నాదరించి "నేనే రాజునగుదునేని మీయందఱ సహాయము కోరెదను. మీరు నాకుఁ దోడునీడ గాక తప్ప "దని హెచ్చరించెను. వారందఱు

సంతోషముతో సోమనాద్రిమాటలకు సంతోషపూర్వక మగు నంగీకారమును దెల్పిరి.

కేశవమ్మయు సోమనాద్రియు నొకబండి కట్టించుకొని ముదకుమండలమునకుఁ బోవుచుండిరి. త్రోవలో వారికి పూనూరను గ్రామము తగిలెను. చరిత్రస్థలమును జిత్రదేవాలయావృతము నగు పూనూరులోనికి సోమనాద్రివెళ్ళి యంగడిలో దారిబత్తెమునకు వలయు వస్తువులుకొన్ని మూటఁగట్టుకొని పోవుచుండ గ్రామాధికారియగు నాగిరెడ్డి యాబాలకుని జూచి దగ్గరకుఁ బిలిచి యతనివృత్తాంతము విచారించెను. బాలుడు తనసంగతి, కులము, స్థలము నివేదించెను. ధనవంతుఁడును సంతానహీనుఁడునగు నా పాళము నాగిరెడ్డి తాను బాకనాటిరెడ్డి యగుటచే నాబాలకుని పెంచుకొన్నచో గులము తరించుననితలంచి యూరిబయటనున్న బండియొద్దకుఁ బాలునితోఁ బోయి కేశవమ్మను జూచి పూర్వబాంధవ్యము తెలిపి సోమనాద్రిని దనకుఁ బెంచుకొనుట కొసంగుమని ప్రార్థించెను. ఆయమ యందులకు నంగీకరించి బాలునితో దానుగూడ నాగిరెడ్డియింట వసించెను. కొంతకాలము నాగిరెడ్డి తా నార్జించిన ధనకనకవస్తువాహనములు సోమనాద్రి కొసంగి చెప్పవలసిన ధర్మములన్నింటిని జెప్పి మరణించెను. సోమనాద్రి పితృకార్యము లన్నింటిని శ్రద్ధాభక్తులతో నిర్వహించి ప్రత్యేకరాజ్యము నొకదానిని స్థాపించినఁగాసి సోమ



రాంధ్రులు మానషవంతులుగ బ్రతుకఁ జాలరని తలంచి తన యొద్దగలధనము ధాన్యమును వినియోగపఱచి స్వారీచేయుటకుఁ దగిన యశ్వములను సైనికులను వృద్ధిఁజేసెను. సదాశివరెడ్డి తన కుమార్తెయగు లింగాంబను సోమనాద్రి కీయఁదలంచి వర్తమాన మంపెను. సోమనాద్రి సముచిత పరివారసహితుఁడై వివాహమున కేఁగి తిరిగివచ్చుచు ఆత్మకూరి సంస్థానములోని ఆరెపల్లి, కత్తెపల్లి, ముట్లోనిపల్లి లోనగు గ్రామములలోని ధనవంతుల గృహములు దోచుచుండెను. ఆవార్త రాజువిని సోమనాద్రిని బట్టుకొనిరమ్మని కొందఱు వీరభటులను బంపెను. సోమనాద్రి యదిగమనించి ధనమునంతయు నొకరహస్యప్రదేశమునందు దాఁచి తనభటుల నందందుంచి తానుగుఱ్ఱముమీఁద నెవ్వరికిఁ జిక్కనంత వేగముగా స్వారిచేయుచుండెను. వీరభటులు విచ్చుకత్తులతోఁ దనవెంట వచ్చుచుంటఁ జూచి బ్రదుకుపై నాసవీడి గుఱ్ఱమును మిగుల వేగముగాఁ బోనిచ్చుచుండెను. మార్గమధ్యమున నున్న ప్రవాహమును దాటఁ జాలక గుఱ్ఱము మరణించెను. సోమనాద్రి మిగుల వేగముగాఁ బరుగెత్తి కృష్ణాతీరము జేరి ప్రవాహమునందు దుమికి యీఁదుచుండ వీరభటులు తీరముననుండి తుపాకులు గాల్చిరి. దైవవశమున నెటులో చావుదప్పి సోమనాద్రి యావలితీరముఁ జేరి తలదాఁచుకొనుట కనువైన తావుకొఱకు వెదకుచుండ నొక గొఱ్ఱెలమంద గానవచ్చెను. సోమనాద్రి యా మం

దను సమీపించి గొల్లవాండ్రతోఁ దనయవస్థయు వీరభటులు
వెంబడించుటయుఁ దెలిపి బ్రదికించిన గొప్పమేలు చేయుదునని
బ్రతిమాలెను. వాండ్రు పెద్దగోయి తీసి అందు సోమనాద్రిని
మెడవరకుఁ బూడ్చి చుట్టును మేకపిల్లలనుంచి పైని బుట్ట బో
ర్లించిరి. కొంతసేపటికి వీరభటులు వెదకుకొనుచు వచ్చి చుట్టు
పట్టుగ్రామములు వెదకుచు గొఱ్ఱెలమందను గూడఁ బరిశీలిం
చిరి. ఎందును సోమనాద్రి కనఁబడక పోవుటచే వీరభటులు
విసిగి కృష్ణదాఁటి వెనుకకు వెళ్ళిపోయిరి. అనంతరము సోమ
నాద్రి బయటికివచ్చి గొల్లవాండ్రతో 'నాకుఁ బ్రాణదానము
గావించినందులకు మీరేమికోరుకొందురో తెలుపుఁ' డనవారు
నేఁటినుండి మీరు "ముష్టిపల్లి" యను మాగోత్రనామమును
వహింపవలయునని కోరిరి. సోమనాద్రి యందులకంగీకరించి
పూనూరునకుఁ బోవుచుండ నొకచో భూగర్భమునందుఁ బూర్వ
రాజులు నిక్షేపించిన ధనరాశి గోచరించెను. ఆధనము నంత
యుఁ బరిచారికులచేఁ దెప్పించి పూనూరు సమీపమునందున్న
యొక విశాలప్రదేశమునఁ గోటకట్టింప నారంభించెను. ఆప్రదే
శమునకు ఆమడదూరమునందున్న ఉప్పేడుకోటను బాలించు
నయ్యదుదాపూదుమియ్యాయను మహమ్మదీయుఁడు సోమనా
ద్రి కోటనుగట్టుచున్నసంగతి విని పరివారముతో నచటికి వచ్చి
తనరాజ్యమునఁ గోటఁ గట్టవలదని నిర్బంధింపఁగా సోమనాద్రి
పన్నుగట్టుచు సామంతుఁడుగా నుండునని యొప్పించి కోట



పూర్తి గావించికొన ననుమతిఁ బడసెను. తరువాత సోమనాద్రి
తాను గట్టించునగరమునకు గద్వాలయని పేరిడి ప్రాకార
ములు,బురుజులు, అగడ్తలు, రాజవీధులు కట్టించి జనులకువృత్తు
లొసంగి కొలఁదికాలములో బంజరు బయలును మహాపట్టణ
మును గావించెను. కోటకు బురుజులన్నియుఁ బూర్తియయ్యె
నుగాని తూర్పుబురు జెన్నిప్రయత్నములు చేసినను నిలువక
కట్టినయంతనే కూలిపోవుచుండెను. సోమనాద్రి నరబలి గావిం
చినఁగాని బురుజు నిలువఁజాలదని కేశవయ్యయను నొకబ్రా
హ్మణుని నమ్మించి కొనిపోయి బలియిచ్చెను. బురుజు వెంటనే
నిలిచెను. బ్రాహ్మణహత్య యొనరించి యార్జించిన పాపము
నకుఁ బరిహారముగా నాతనిపేరఁ గేశవాలయము కోటలోఁ
గట్టించి ముందుఁ గేశవయ్యకు నివేదనముగావించి తాను
భుజించుట కంగీకరింపఁగా నరిష్టములు తొలఁగెను. గద్వాల
నగరము పూర్తియై పొందుబాటులోనికి వచ్చినపిదప అను
కొన్నటుల పన్నుఁ జెల్లింపుమని నయ్యదుమియా సోమనాద్రికి
వర్తమానముఁ బంపఁగా నాతఁడు నిరాకరించెను. అందులకు
మియా కోపగించి సంగరమునకు బయలుదేరి వచ్చుచుండెను.
ఈవర్తమానము విని సోమనాద్రి అమితపరివారసహితుఁడై
అరగిద్దయను గ్రామముచెంత మహమ్మదీయ సైన్యము నెది
రించెను. సైయదుమియాపక్షమున రాయచూరును బాలించు
బసరుజంగు, ప్రాగుటూరును బాలించు ఇనురుసాహెబు చేరిరి.

సోమనాద్రి తన సహాధ్యాయులను సహాయముఁగోరి పిలువ నంపఁగా వారు పరివారముతో ఆయుధపరికరములతో సంగరమునకు సహాయమువచ్చిరి. ఉభయదళములకు భయంకర సంగ్రామము జరిగెను. సమీపమునందున్న ఆంధ్రులందఱు స్వాతంత్ర్య సంగరమున సోమనాద్రికి సహాయపడిరి. మహారాష్ట్రులు, కర్ణాటులుఁగూడ సోమనాద్రి కనేకగతుల ధనమును, సైన్యమును సహాయముచేసిరి. మొక్కవోని బీరమున సోమనాద్రిబలము చిరకాలము పోరాడెను.

బసరుజంగు ఆంధ్రవీరులధాటి కాగజాలక గుఱ్ఱము నెక్కి పాఱిపోవసాగెను. వీరవతంసుడగు సోమనాద్రి యాతని వెంబడించి తరుముచుఁ బోవఁ బ్రాణభీతితో నతఁడు రాయచూరు కోటలో దూరి ద్వారములు బిగించికొనెను. సోమనాద్రి కోటలోనికిబోవ యత్నించుచుండఁ గోటముందున్న యేనుఁగుప్రతిమలను జూచి గుఱ్ఱము బెదరెను. వెంటనే యా విగ్రహముల తుండములు దంతములు ఖండించి వెనుకకు మరలి సోమనాద్రి సంగరరంగ మలంకరించుసరికి ప్రాగుటూరి నవాబుఁ గూడ పాఱిపోయెను. స్వల్పసైన్యముతో సయ్యదుమియ్యాయొక్కఁడు మాత్రము సంగరరంగమున మిగిలెను. అతఁడు హతశేషసైన్యమును ముందిడుకొని సోమనాద్రిపైకి మొండిచోరవతో రాఁదొడంగెను. సోమనాద్రి సైన్యమును భేదించి మియాను సమీపింపఁగ సమరాశ్వము తన



ముందుకాళ్లు ఏనుఁగుమీఁదనుంచి నిలువఁబడెను. సోమనాద్రి తన కరవాలముతో సయ్యదుమియ్యాను జంపఁబోయెను. ప్రాణభయముతో సయ్యదు మియ్యా సలాములు చేయుచు, నీకుఁగప్పము గట్టుదును,. రాజ్యములోఁ గోరినంత భాగము నొసంగెదను రక్షింపు'మని ప్రార్థించెను. ఉదారశీలుఁడగు సోమనాద్రి కరుణించి యెత్తినకత్తి వ్రాల్చి మహమ్మదీయునితో "నీవు నన్నుఁ గోటగట్టుకొన నిచ్చితివిగాన నీరాజ్యము నీకువదలుచున్నాను. నీకు నేనుగాని నాకు నీవుగాని సామంతులము గావలసిన పనిలేదు. నీవోడిపోయినటుల గుర్తుగా నుండుటకు యుద్ధమునకుఁ గొనివచ్చిన నగారా, పచ్చజండా, ఏనుగును మాత్రము నాకిచ్చి పోవలయు"నన నవాబు సోమనాద్రి కవియెల్లరొసఁగి బ్రతుకుము జీవుఁడాయని తన కోటలోనికిఁ బోయెను. సోమనాద్రి జయలక్ష్మితోఁ బాటు సైదుమియ్యాయిచ్చిన విజయచిహ్నములు, బసరుజంగు విడిచిపోయిన ఫిరంగులు, హతులైన వీరభటుల ఆయుధములు దీసికొని గద్వాలఁజేరి నగరమధ్యంబునందు జయస్తంభము ప్రాతి నవాబునొద్దఁ గైకొన్న పచ్చజండా దానిపై గట్టించెను.

సయ్యదుమియ్యా తనరాజ్యము చేరినదాదిగఁ బరాభవ దుఃఖము కలచివేయుటచేఁ గొన్ని దినములు బయటికె రాఁడయ్యెను. ఒకనాఁడు కోటబురుజుపై నెక్కఁగా గద్వాలలో జయస్తంభముపైనఁ దన పచ్చజెండా కనవడెను. పరాభవ

దుఃఖ మతిశయించెను. ప్రతిక్రియ గావించి యెటులేని సోమనాద్రిని బేరులేకుండ నెగురఁగొట్టఁ దలంచి హైదరాబాదునకుఁ బ్రయాణమై నాలుగు మూడు దినములకుజేరి యా రాష్ట్రమును బాలించు నిజాము ఆలీకిఁ దనరాకఁ దెలియ జేసెను. నిజాము ఆలి, యాతనిరాక విని తన గురుపరంపరకుఁ జెందిన సయ్యదుమియ్యా సామాన్యునివలె వచ్చుటకుఁ గారణమేమని యోచించి వెంటనే రమ్మని యాజ్ఞ యొసంగెను. మియ్యా నిజాము ఆలీని చూడఁగానే వంగివంగి సలాములు చేసి ఒంటికాలిమీఁద నిలుచుండి తన దురవస్థయుఁ దన్ను సోమనాద్రి పరాభవించి వీరచిహ్నములు గొనిపోయిన విధము తెలిపి యెటులేని సోమనాద్రిని బంధించి తాను గోలుపోయిన జెండా, నగారా, ఏనుఁగు ఇప్పింపుమని ప్రార్థించెను. నిజాము ఆలీ సోమనాద్రి బలపరాక్రమముల నాలించినవాఁడగుటచే "నిది సంగరమున కదనగాదు. సోమనాద్రి అప్రమత్తుఁడై మైమఱచి యున్నపుడు సంగర మొనరించినచోఁ జయము సులభసాధ్యము. అంతవఱకు నిరీక్షింపు' మని చెప్పెను. "ముందు సోమనాద్రిని బంధించి నా విజయచిహ్నముల నాకిప్పింతురా బ్రతుకుదును. లేదా, నేను జీవింప" నని వాఁడొక కత్తితోఁ గంఠము నఱకుకొనఁబోవుచుండ నిజాముఆలి సయ్యదుమియ్యా నెటులో సమాధానపఱచి పదునేను దినములలో సంగరమునకుఁ దప్పక వచ్చెదనని వాగ్దానముచేసి పంపెను.



నిజాముఆలీ ముందు సోమనాద్రిపయికి దండయాత్రకేఁగుటకు ధైర్యముచాలక తన మిత్రుఁడును కర్ణాట దేశీయుఁడును నగు ఇరువనగౌడు అను నొక వీరుని బిలువనంపి జరిగిన కథాంశమునంతయు నెఱింగించి సోమనాద్రిని వంచించుట కుపాయమున్నచోఁ దెలుపుమని కోరెను. ఇరువనగౌడు ఉభయపక్షముల బలాబలముల నెఱింగిన వాఁడుగాన చాల సేపు యోజించి 'హార్పనహాల్లిలో నాఱుగురు క్షత్రియ కుమారులు దుర్గమమైన కోటగట్టుకొని రాజ్యము పాలించుచున్నారు. వారికి సోమనాద్రికి మిత్రభేదము కలుగఁజేసితిమేని సోమనాద్రి మడియఁగలఁడు. అపుడు గద్వాలకోటను సులభముగా లోఁగొనవచ్చు' నని సమాధానము చెప్పెను. నవాబు మిగుల సంతసించి యెటులనేని యాకార్యము నీవె సమర్థించుమని భారమంతయు ఇరువనగౌడుపైనఁ బెట్టి యాసఁబెట్టెను. ఇరువనగౌడు తన గ్రామమగు కురిచేడునకుఁ జేరి హార్పనహల్లిలోని క్షత్రియసోదరులు వ్రాసినటు లొక జాబువ్రాసి దూతలచే సోమనాద్రికిఁ బంపెను. సోమనాద్రి యా జాబు చూడఁగా నందిటుల వ్రాయఁబడి యుండెను. "సోమనాద్రికి —నీవు సయ్యదు దావుదు మియ్యాను జయించినమాత్రమున లోకైకవీరుఁడవు కావు. నిజమైన మగవాఁడవేని మావంటి వీరులను గెలువుము. లేదా మూలఁబడి యాఁడుదానివలె బ్రతుకుము." ఈజాబు పఠింపఁగనే సోమనాద్రికిఁ గోప మతి

కెయించెను. జాబుయొక్క పూర్వోత్తరములనేని విచారిం
పక సోమనాద్రి సంగరమున కాయిత్తమై నగరరక్షణమునకు
వలయుబలమునుంచి యొకశుభముహూర్తమున హర్పనహాల్లికిఁ
బ్రయాణమయ్యెను. నిజాము అలి యీవార్తవిని సోమనాద్రి
కంత్యదినములు సమీపించెనని యానందించి యీవార్త
సయ్యదుకుఁ గూడఁ దెలిపెను. సోమనాద్రి హర్పనహల్లి
కోటను ముట్టడించెను. ఈవార్త క్షత్రియసోదరులు విని
'సోమనాద్రి యెవరు? అతని పేరైన వినియెఱుంగమే! మన
పైకి దాడి వెడలవలసిన యవసరమేమి వచ్చినది? ఈ విరోధ
మునకుఁ గారణమేమైయుండును? శత్రుజనాభేద్యమగు మన
కోటలో సురక్షితముగా మనముందము. అతఁడు జయించిన
నాఁటికిఁ జూచుకొంద' మని తలంచిరి. సోమనాద్రి ఆఱుమాస
ములు ముట్టడించి ఫిరంగులు ప్రేల్చి యెంతప్రయత్నించినను
హర్పనహాల్లికోట చెక్కు చెదరకపోయెను. తరువాత సోమ
నాద్రి యుపాయాంతరములచేఁ గోటఁ బగులఁగొట్టి రాజ
సోదరులను బంధింపబోయెను. వారు సోమనాద్రిని జూచి
యిటులనిరి. "రెడ్డివతంసా! ఏపాపము నెఱుంగని మమ్ము
బంధించుట న్యాయముగాదు. మేము నిన్నుఁ బ్రతిఘటింపక
మాని కోటలోనే యుంటిమి. ఆకారణముగ సాటివారిని
శిక్షింప నెంచుట నీవంటి శూరవతంసునకుఁ దగవుకాదు."
క్షత్రియసోదరుల మాటలు వినినంతనే సోమనాద్రికిఁ గోపమతి



శయించి కపటవినయము జూపుచుండిరని తలంచి తనయొద్దఁ
గలజాబు వారికిఁ జూపించెను. వారందఱు నాజాబు చూచి
యది తాము వ్రాసినది కాదనియు మధ్యవర్తులు గావించిన
మోసమనియు క్షమింపుఁడనియుఁ బలువిధముల వేఁడికొనిరి.
సోమనాద్రి విచారించి క్షత్రియసోదరులు నిర్దోషులని
గ్రహించి వారివలనఁ గప్పములు గొని, సంగరములందు
సహాయము జేయునటుల వాగ్దానము గైకొని గద్వాల కేఁగెను.
ఈవార్త సయ్యదువిని సోమనాద్రివిజయమునకుఁ జాలపరిత
పించి హైదరాబాదు నవాబునొద్దకేగి విలంబనము జేయ
వలదనియుఁ దనపరాక్రమచిహ్నములగు, నగారా, ధ్వజము,
ఏనుఁగు ఇప్పింపకున్న నాత్మహత్య గావించి కొందుననియు పట్టు
బట్టెను. విధిలేక నిజాము అలీ సోమనాద్రిమీఁదికి సంగర
సన్నద్ధుఁడై బయలుదేరెను. పూర్వపరాభవముతో నుడికి
పోవుచున్న రాయచూరు నసరుజంగు పరిమితబలముతో నవా
బునకు సహాయముగా వచెస ల్లారి బహదూర్ ఖాన్, ప్రిగు
టూరు ఇదురుసాహెబు, ఆదోనినవాబు, గుత్తిటీకు సుల
తాను, కర్నూలు దావతుఖాను లోనగు నవాబులందఱు నిజా
ము అలీకి సహాయమై సోమనాద్రిపైకి సైనికబలముతో దండ
యాత్రకుఁ జనుదెంచిరి. మహమ్మదీయ సైన్యమంతయు లక్షల
కొలదియై నేలయీనినటు లుండెను. కర్నూలు మొదలుకొని
పదిమైళ్ళ దూరముననున్న ఉల్చాలవరకుఁ బడమట,మూఁడు

క్రోసులు దూరమునందున్న నిడుదూరువరకు సేనలు నిండి పోయెను. సోమనాద్రి భటులను పనివాండ్రను నియోజించి శత్రువుల కభిముఖముగా నొక మట్టికోట గట్టించెను. సోమనాద్రి శుభముహూర్తమున అపరిమిత బలసహితుఁడై తాను గట్టించినకోటచెంత దండువిడిసి సంగరమున కాయిత్తమయ్యెను. ఉభయ సైన్యములకు భయంకర సంగరము జరుగుచుండెను.

సోమనాద్రిసహాధ్యాయు లగు కురుమన్న, ధర్మన్న యోధవేషములు ధరించి కొంత సైన్యమును దీసికొని యవన సైనికుల నెదిరించిరి. కొంతబలమును వెంటఁగొని సోమనాద్రి స్వయముగాఁ దాను నవాబులపైకి బయలుదేరెను. ఆనాఁడు జరిగిన జనమారణమునకు మితము లేదు. మతావేశ పరవశు లగు యవనులు నిలుకడగాఁ బోరి హిందూభటుల నెందఱనో మడియించిరి. ఆంధ్రనాయకులు వ్రేటున నొకయవనుని బడఁగొట్టి యుద్ధరంగ మంతయు రక్తప్రవాహములతో నించివేసిరి. సోమనాద్రి సామాన్యదళములను విడిచి నవాబులపైకిఁ బోయి ఘోరముగాఁ బోరి ప్రాగటూరి నవాబగు ఇదురు సాహెబును నఱకివేసెను. బల్లారి బహద్దరుఖానుని జంపెను. ఆదోని నవాబు నంతమొందించెను. ఈ పరిస్థితులు గమనించి సోమనాద్రిధాటి కాగజాలక నిజాముఆలీ హతశేష సైన్యముతో కర్నూలుకోటకుఁ బోయి తలదాఁచుకొనెను. సోమనాద్రి కర్నూలువఱకు శత్రుసైన్యమును దరిమి ప్రొద్దు గ్రుంకువఱకుఁ దనస్కంధావారముఁ జేరెను.



సోమనాద్రి యెక్కినయశ్వము సంగర రంగములలో బాగుగా మెలఁగనేర్చినది. పిట్టవలె నంతలో విరోధిసైన్యములమధ్య వ్రాలును. ముందుకాళ్లెత్తి యేనుఁగులమీఁదికిఁ బోవును. ఈయశ్వము నెటులేని బట్టి తెప్పించినచో సోమనాద్రి చిక్కఁగలఁడని నిజాము ఆలీ తలంచెను. తనసైనికులతో సోమనాద్రి గుఱ్ఱమును గొనివచ్చినవానికిఁ గొన్నిగ్రామము లిచ్చెదనని చెప్పెను. ఎవరును సాహసించి యందుల కియ్యకొనరైరి. నిజాముఆలీ యశ్వపాలకుఁ డందుల కంగీకరించి గాఢాంధకారమున బయలుదేరి యెటులో యశ్వశాలకుఁ బోయి గుఱ్ఱమును లాయమునుండి తొలంగించి తన శిబిరము త్రోవఁ బట్టించెను. రెడ్డివీరులందఱదిచూచి యెవఁడో మన భటుఁడై కార్యాంతరమున వేఁగునడుపుటకుఁ బోవుచుండెనని యుపేక్షించిరి. అశ్వపాలకుఁడు కొలఁదిసేపటిలో నిజాము ఆలీయొద్దకుఁ జేరి యశ్వమునుజూపి తనవిజయవార్త నెఱింగించెను. నిజాము ఆలీ యశ్వమును లాయమునఁ గట్టివేయించి వానిని సత్కరించెను.

నవాబు పట్టరాని యానందము నొంది సోమనాద్రిని బట్టుకొనుట యిఁక సులభమని ప్రజ్ఞలు కొట్టుచుండెను. సోమనాద్రి తెల్లవారిచూడఁగా అశ్వము లేదయ్యెను. చాలవిచారించి యడుగుజాడలవలన నిజాముఆలీ శిబిరము చేరినటుల గ్రహించి విచారపడెను. కొనివచ్చిన వానికిఁ గోరినంత ధన

మిచ్చెదనని పలుకఁగా హనుమప్ప నాయకుఁడను వీరుఁడు నేను గొనితెచ్చెదనని యంగీకరించి మహమ్మదీయసైన్యముచెంతకుఁ బోయెను. సేనానివేశమునకు మధ్యనున్న విశాలమగు పాకలో గుఱ్ఱములుండెను. అందే, సోమనాద్రిగుఱ్ఱముఁగూడ నుండియుండునని చొప్పవిక్రయించువానివలె నాతఁ డశ్వశాలఁజేరెను. మహమ్మదీయు లతనిని జొప్పవిక్రయించు వానిఁగానే భావించి యుపేక్షించిరి. ఆతఁడు మెల్లగాఁ బ్రొద్దు క్రుంకువఱకు గడ్డియమ్మువానివలె బేరముచేయుచు వారితో భాషించుచు నుండి రాత్రికాఁగానే గుఱ్ఱముముందున్న గడ్డిలో దేహముదాఁచి పరుండెను. అంతలో నొకయవనుఁడు గుఱ్ఱమును వేఱొకస్థలమునఁ గట్టివేయుటకు మేకుఁ బ్రాఁతు చుండఁగా నందు హనుమప్పనాయకునిచేయి దిగఁబడెను. కదలినచో మహమ్మదీయుఁడు గ్రహించునని జనమునిద్రచే మాటుమణుగు వఱకటులనేయుండి చేయి రాకపోవుటచే మణిబంధమువఱకు ఖండించి గుఱ్ఱమునెక్కి శిబిరాభిముఖుఁడై బయలుదేరెను. సైనికులు నిద్దురలోఁ దలలెత్తిచూచి తమ యశ్వపాలకులె నీరుబెట్టుటకు గుఱ్ఱములను గొనిపోవుచున్నటులఁ దలఁచి మిన్నకుండిరి. తెల్లవారుసరికి హనుమప్పనాయకుఁడు సోమనాద్రిచెంత గుఱ్ఱమును గట్టివేయించి తానొందిన కష్టములు తెలిపి మొండిచేయిని దార్కాణముగాఁ జూపెను. సోమనాద్రి హనుమప్పనాయకుని సాహస ధైర్యస్థైర్యముల కెంతయు నానం



దించి యాతనికిఁ గోరినతావుల నెన్నియో క్షేత్రరాజము లొసంగి గౌరవించెను. తెల్లఁగ తెల్లవారఁ గనే సోమనాద్రి తన స్కంధావారమునందు విజయభేరి మ్రోగించెను. ఆనాదము నాలించి యవనుల గుండె లదరెను. విధిలేక తమప్రభుని యాజ్ఞనతిదాటఁజాలక వారును సంగరసన్నద్ధులైరి.

సోమనాద్రి పరివారసహితముగ సంగర మొనరించి శత్రుసమూహమును నేలమట్టము గావించెను. ఇంతలోఁ దన తండ్రినిజంపిన దావతుఖానుఁ డెదురయ్యెను. సోమనాద్రి వాని బలమునంతయు దృటిలోఁ దునుమాడి కంఠము ఖండింపఁ బోయెను. ఆతఁడు సోమనాద్రిపాదములపైఁ బడి శరణు గోరెను. తనతండ్రి నన్యాయముగాఁ జంపి యావదాస్తిని హరించిన నాఁటికోపము మనసులోనుంచుకొని వాఁడెంత ప్రార్థించినను విడువక తల ఖండించెను. శత్రుసైన్యము సోమనాద్రిధాటి కాగఁజాలక కర్నూలుకోటలో దాఁగికొనెను. సముచితసైనికబలముతో సోమనాద్రి కర్నూలుకోట భేదించి యవనుల నెందఱనో సంహరించి వెనుకకు మఱలెను. పేరుజెందిన మహమ్మదీయ సేనానులందఱు మరణించిరి. ప్రిగుటూరు, బళ్ళారి, ఆదోని, కర్నూలు నవాబులు గతించిరి. గుత్తి,రాయచూరు నవాబులు, వివాదకారణభూతుఁ డగు సయ్యాదుమియ్యా ప్రాణములతో మిగిలిరి. సోమనాద్రి యకుంఠిత దీక్షతో సంగరప్రయత్నములు విరామములేక చేయుచుండెను.

మహమ్మదీయసైన్యము వలుచఁబడుటచే వారేమి చేయఁజాలక యెట్లు ముందుజరుపవనగునో నిశ్చయించుటకు రాత్రి వేళ నేకాంతసభ యొకటి యొనరించి సోమనాద్రితో సంధి జరుపుటయే నిరపాయమగు మార్గమని నిర్ణయించుకొనిరి.

నిజాము ఆలీ సోమనాద్రిని సయ్యదుమియ్యాను ఒకచోఁజేర్చి యిరువురకు సమాధానవాక్యములఁజెప్పి యైకమత్యము గలుగఁజేసి గతముమఱచిపొండని కోరెను. సోమనాద్రి సంధి కంగీకరించి తనవిజయమునకు సూచనగా నొకగొప్ప ఫిరంగిని బహుమతిగాఁ గైకొని తననగరముఁ జేరెను. సోమనాద్రి విజయలక్ష్మీద్వితీయుఁడై తనపట్టణముఁజేరి తనకు సహాయముగావచ్చి సంగరమునఁ బ్రశంసాపాత్రముగాఁ బనిచేసిన వీరులందఱకు ఆభరణములు, మాన్యములు, ఆయుధములు బహూకృతిగా నొసంగి తన విశ్వాసమును బ్రకటించెను. బ్రతికినంతకాలము సోమనాద్రి పరాజయమునెఱుంగక శత్రుసైన్యములదాఁకి విజయమునందుచు సమితవిఖ్యాతి గడించెను.

సోమనాద్రి భూపాలుఁడు తిరుపతియాత్రకు బయలుదేరి గనికోట, నంద్యాల పాలకులను జయించి ప్రతిసంవత్సరమును సుంకమును గట్టునటులఁ గట్టడి చేసెను. తిరుపతిక్షేత్రముఁ జేరి సోమనాద్రి వేంకటేశ్వరస్వామిని దర్శించి విరాగియై యచటనే దేహయాత్ర చాలించెను.

సోమనాద్రినే సోమనాథభూపాలుఁడని కూడ వ్యవహరించుట గలదు. ఈ మహావీరుఁడు పెక్కుగ్రంథముల నంకిత



మందెను. కవులను గాయకులను బోషించి చిత్రకళల నభిమానించెను. నాఁడు మొదలు నేఁటివఱకు గద్వాల సంస్థానము విద్యాభిమానమును దాతృతారూపమునఁ బ్రకటించుచునే యున్నది. సోమనాద్రి భూపాలుఁడు క్రీ. శ. ౧౭౦౦ మొదలు ౧౭౭౦ లోగ నుండి యుండును. ఈ సోమనాద్రి భూపాలునకు ఇరువురు ధర్మపత్నులు గలరు. ఇద్దఱు కుమారులు జనించిరి. వారు బాలురగుటచే సోమనాద్రి యనంతరము లింగాంబయను ప్రథమభార్యారత్నము కొంతకాలము రాజ్యము నేలి యుక్తవయస్సు రాఁగానే తన భారమునంతయుఁ బెద్ద కుమారునిపైఁ బెట్టెను. జ్యేష్ఠపుత్త్రుఁడు తిరుమలరాయఁడు పితృసంపాదిత మగు రాజ్యమును జిరకాలము పాలించెను. సోమనాద్రి భూపాలుఁడు గతించి చిరకాలమైనను ఆయన కీర్తిమాత్ర మింతవఱకు మఱుఁగువడలేదు. ఆయన యంకితము నొందిన భారత విరాట పర్వాది గ్రంథరాజము లాతని కీర్తిని గొనియాడుచున్నవి. అత్యున్నతములగు దుర్గములు, గోటగోడలు గల నాఁటి గద్వాలనగర విభవము చెక్కుచెదరక నేఁటికిని పూర్వప్రశస్తిని జాటుచునే యున్నది. పౌరుషవంతములగు పూర్వరాజ్యములలో నేఁటివఱకు మిగిలి యున్నవి వ్రేళ్లతో లెక్కింపఁదగియున్నవి. ప్రాచీనవిద్యలపట్ల గౌరవము జూపుచుఁ బండితసన్మానములు గావించుచుఁ బూర్వమర్యాదల నిలువఁబెట్టుచున్న యీ సంస్థానరాజము నెడ నాంధ్రులకుఁ

నాంధ్రేతరులకు నెంతయు గౌరవభావము గలదు. ఇంతటి ప్రశస్తికిం గారకుఁడగు సోమనాద్రి సర్వజనవంద్యుఁడనుటలో సంశయ ముండదు.

# విజయరామరాజు

తాండ్ర పాపరాయఁడు బొబ్బిలిసంగరమునందు విజయనగరసంస్థానాధీశ్వరుఁడగు విజయరామరాజును జంపెను. అనంతర మాయనరాణి తన సమీపజ్ఞాతుల యొద్దనుండి పండ్రెండుసంవత్సరముల బాలునిగొనివచ్చి దత్తతజేసికొని విజయరామరాజు అని యాబాలునకు నామకరణ మొనరించెను. యుక్తవయస్సు వచ్చువఱకు రాణిగారే బాలునకు సంస్కృతము, ఆంధ్రము, పార్సీలోనగు భాషలు నేర్పించి అనంతరము రాజ్యముగూడ నొసంగెను. విజయరామరాజునకు జనకస్థానమునందు అన్నయగు సీతారామరాజుకూడ విజయనగరమునకు వచ్చి సోదరునకు సహాయముగాఁ బరిపాలనా వ్యవహారములు చూచుచుండెను. క్రమముగా సీతారామరాజునకు విజయనగరరాజ్యమునందును అపుడు బలవంతముగానున్న పరాసువారియొద్దను బరిచయము మెండయ్యెను. రాజకీయ వ్యవహారము లన్నియు నాతఁడె మిగుల నేర్పుగా నిర్వహించుచుండెను. విజయరామరాజు తనయన్న పరిపాలనా చాక



చక్యమున కానందించి మంత్రిపదవి నొసంగెను. వీరిద్దఱు చాల కాల మైకమత్యముగనుండి రాజ్యక్షేమవిషయమున నేకీకృత మగునుత్సాహముతోఁ బాటుపడిరి. శ్రీకాకుళమునకును కసింకోటకును, విశాఖపట్టణమునకును జుట్టునున్న హావేలీభూములు గాక తక్కిన మండలమంతయు ఆకాలమున వీరిపరిపాలనమునందుండెను. తరువాత వీరు పర్లాకిమిడిఁగూడ నాక్రమించుకొనిరి. రాజమహేంద్రవరసీమఁ గూడఁ గొంతకాలము వీరు పరిపాలించుచుండిరి. అపు డాంగ్లేయులు వీరాక్రమించుకొన్న పర్లాకిమిడిఁ గైకొని మిగిలినరాజ్యమునకు మూఁడులక్షలరూపాయలు ప్రతిసంవత్సరము పన్నుగా నొసంగునటులఁ గట్టడి గావించిరి. విజయనగరసంస్థానమువారు చిన్నజమీందారుల నడఁగఁగొట్టుచు వారిసంపదలఁ జూరగొనుచు అనేక సాహసకార్యము లొనరించుటచేఁ దొలుత నాంగ్లేయులు వారి నట్టియొత్తిడిఁ జేయరైరి. పేరునకు సంస్థానాధీశ్వరులైనను నిజాము దొరతనమువారి పాలనమునందుఁ గాని ఆంగ్లపాలనమునందు గాని వీరు స్వతంత్రరాజులవలె నిరంకుశులుగానే వర్తించుచుండిరి. ఆంగ్లేయులు పాలించుట కారంభించినది మొదలు విజయనగర సంస్థానాధీశ్వరుల స్వాతంత్ర్యసంరంభము క్రమముగాఁ దగ్గసాగెను. ఆంగ్లేయుల కట్టడికిలోనై విజయరామరాజు పర్లాకిమిడి రాజ్యమును విడిచిపెట్టెను. చుట్టుపట్టులనున్న జమీందారు లనేక పర్యా

యములు విజయనగరమును ముట్టడించి పాళ్లు పంచుకొనఁ జూచిరిగాని కార్యకౌశలుఁడగు సీతారామరాజు ఆప్రయత్నములన్నియు విధ్వంసము గావించి ఆంగ్లేయసైనిక సహాయమునఁ బ్రతిపక్షరాజుల రూపుమాపి వారి రాజ్యములను గైకొనెను.

సీతారామరాజు పేరునకు మంత్రిగా నున్నను తానే రాజుగా వ్యవహరించి పూర్వులొసంగిన మాన్యక్షేత్రములు అగ్రహారములు ఆక్రమించి రైతులకుఁ గౌలున కొసంగుచుండెను. దానిచేఁ బ్రజలకుఁగూడ నీతనియెడ మిగుల నసహ్యము జనించెను. ఈదోషములన్నియుఁ బ్రజలు విజయరామరాజువిగా భావించి యాతనినిగూడ విద్వేషించిరి. సీతారామరాజు ప్రజాభిప్రాయములు పాటింపక తనయిచ్చచొప్పునఁ జరించుచుండెను. ఈ నూతనపరిపాలనమునకు మిగుల విసికి అడిదము సూరకవి "రామలింగేశ శతక"మున సీతారామరాజును మనసునందుంచుకొని దుష్టరాజులను దూలనాడెను. ఎవరెన్ని విధముల నాందోళనము జరుపుచున్నను సీతారామరాజు పాటింపక తనయిచ్చ వచ్చినటుల వ్యవహరించుచుండెను. విజయరామరాజెటులఁ జెప్పిన నేమివచ్చునో యని తటస్థముగా నుండెను. ఈపరిస్థితులలోఁ గాలము గడపుట ప్రజలకు సాటివారికిఁ గష్టమయ్యెను. అందుచేత విజయనగరరాజ్యము నెటులేని కంపెనీవారికిఁ గట్టిపెట్ట వలయునని సాటి



రాజులందఱు కుట్ర చేయుచుండిరి. సీతారామరాజు కంపెనీవారితోఁ గలిసి దూరాలోచనలు గావించి తమపై పితూరి చేయుచున్న జమీందారుల నందఱను జయించెను. జయపురపు కోట నాక్రమించుకొనెను. ఇంకను బ్రతికూలురని యనుమానముతోఁచిన రాజులనందఱను గారాగృహములం దుంచెను. చండశాసనుఁడై దండనీతిని దీవ్రముగా నుపయోగించు సీతారామరాజునెడ సమకాలికులయసూయ మిగుల వృద్ధియయ్యెను. ఆతనిసాహసకృత్యములు కంపెనీవారికిఁ గూడ సహింపరానివిగా నుండెను. సాటిరాజులందఱు విజయరామరాజునకు 'సీతారామరాజును మంత్రిపదవినుండి తొలఁగింపవలయు, లేకున్నచో మేము ప్రతిపక్షులుగా నుందు'మని వర్తమానములంపిరి. ఇవియన్నియు మనస్సునం దుంచుకొని విజయరామరాజు సీతారామరాజున కేమేమియో చెప్పి మంత్రిపదవికి రాజీనామ యిప్పించెను. సీతారామరాజునకుఁ గుమారులు గలరు. విజయరామరాజునకుఁ బుత్త్రసంతానము లేదు. విజయరామరాజునకుఁ బుత్త్రసంతానము కలుగకపోయినచో తన కుమారుఁడగు నరసింహగజపతిరాజును బెంచుకొందునని వాగ్దానము గావించుటచేతనే సీతారామరాజు రాజీనామనుబెట్టి యుద్యోగము మానుకొనెనని కొందఱందురు.

క్రీ. శ. 1778 లో దొరతనమువారు జమీందారులకు భూస్థితియు ఆదాయము ఎంతయున్నదో నిర్ణయించుకొని

పేష్కషులు పరిష్కరింపనెంచి యందఱి నాహ్వానించిరి. పలువురు పరిష్కారార్థము వచ్చిరి. సీతారామరాజు ఈనిర్ణయమునకుఁ దానుగూడ మదరాసునకు వచ్చి దొరతనమువారి యాశ్రయమును సంపాదించుకొని మరల మంత్రియయ్యెను. సీతారామరాజు మంత్రియైనచో మఱలనేమి కల్లోలములు జనించునోయని విజయరామరాజు తొలుత సంశయించెనుగాని ఈ నిర్ణయము కంపెనీవారు కావించినదిగాన నాయన యేమియుఁ జెప్పఁజాలక యంగీకరించెను. సీతారామరాజు నిరంకుశాధికారముతో రాజ్యచక్రము త్రిప్పుచుండెను. హావేలీ భూములన్నియు నీయనకుఁ గౌలుగాఁ నుంటచేఁ బలుకుఁబడి కూడ మిక్కుటముగా నుండెను. మరలఁ బ్రజాపీడనము గావింప మొదలుపెట్టెను. అడ్డుపడిన తమ కట్టి తిరుగుబాటు కలుగునోయని దొరతనమువారు తటస్థముగా నుండిరి. ఈ యవకాశమును బురస్కరించుకొని సీతారామరాజు మిక్కిలి చొరవ జేయుచుండెను. దొరతనమువారు సీతారామరాజు విషయములో నుపేక్షించిన లాభములేదని క్రీ. శ. 1784 లో నొక ఉపసంఘము నేర్పఱచి ప్రకృత పరిపాలనా విధానమునందుఁ బ్రజాభిప్రాయములు నివేదింప నాజ్ఞాపించిరి. వారు విచారించి యీక్రింది యభిప్రాయముగల నివేదికను బ్రచురించిరి. "విజయనగరము సంస్థానమువలన వచ్చు ఆదాయ మంతయు జమీందారులు తమ స్వంతఖర్చులకే వ్యయము గావించుకొను



చున్నారలు. రైతుల విషయములో నేమాత్రము శ్రద్ధ గైకొనుటలేదు. ప్రజలు క్షామపీడితులై తినుట కన్నము లేక మలమల మాడుచున్నారు. నీటివసతు లేమాత్రము తృప్తికరముగా లేవు. సైన్యముకొఱకుఁ బ్రతిసంవత్సరము ఐదు లక్షల రూపాయలు వ్యయము చేయుచుంటచే బొక్కసమందలి ధనమంతయు వ్యయమగుచున్నది ఈ విషయములో ఆంగ్ల దొరతనమువారు శ్రద్ధపుచ్చుకొని విజయనగర సంస్థానమును కట్టుబాటులలో నుంచుట చాల నవసరము." ఈ నివేదిక దొరతనమువారి సంకల్పమునకుఁ దోడయ్యెను. పాలకొండ, జయపురము, గోలుకొండ, టెక్కలి, కిమిడిలోనగు సంస్థానముల ప్రభువులను సైన్య సహాయము చేయుమని యొత్తిడి చేయుటయుఁ, గొందఱు జమీందారులకు ఖ్యాతి యొసంగి గ్రామములఁ గైకొనుటయు, సాలూరు, పాచిపెంట, విషమకోట, కాశీపురము, బొబ్బిలి లోనగు సంస్థానము లేలు ప్రభువులను జెరసాలలోఁ బెట్టి సాధించుచుంటయు దొరతనమువారికి దుస్సహముగా నుండెను. బొబ్బిలి పరిపాలకుఁడగు వెంగళ రంగారావు జయిలునుండి మాయోపాయములతోఁ దప్పించుకొని హైదరాబాదునకుఁ బాఱిపోయి తమ కష్టములు, కంపెనీవారి యుపేక్షయుఁ దెలిపి నవాబును సహాయముకమ్మని కోరెను. ఈయంశములు గూడ ఉపసంఘమువారు తెలిపిరి.

కంపెనీవారు విజయరామరాజునకు సైనికబలము తగ్గింపవలయుననియు సీతారామరాజును మంత్రిపదవి నుండి

తొలఁగింప వలయుననియు వార్తఁ బంపఁగా నందుల కంగీక
రించెను. సీతారామరాజునకు విజయరామరాజుగారిచే నుపకార
వేతన మిచ్చునట్లు దొరతనమువారు కట్టుబాటు చేసిరి. ఆకట్టు
బాటు ప్రకారము సీతారామరాజునకు నెల యొకటికి ఐదు
వేల రూపాయల నొసంగుచు మదరాసును విడిచి బయటికిఁ
బోవరాదని దొరతనమువా రాజ్ఞాపించిరి. ఇవియన్నియు జరి
గిన పిదప విజయరామరాజు తాను స్వతంత్రముగా రాజ్యమును
బాలించుకొనుచుండెను. పరిపాలనాకౌశల్యము గలవాఁడు
గావున నమ్మకమగు నౌకరులను బెట్టి రాజ్యమున మంచి
కట్టుబాటులను జేసెను. దొరతనమువారు ఇతర రాజ్యములతోఁ
బాటు తన రాజ్యముఁ గూడ హరించుటకె యెన్నో యత్న
ములు చేయుచున్నారనియుఁ గనుగలిగి మెలఁగ కున్నచో
విప్లవము తప్పదని తన విధులు సక్రమముగా నెరవేర్చుచుండెను.
రాజ్యమునందుఁ బంటలు మందగించుటచే సిస్తులు సకాలమున
వసూలు కాకపోయెను. ఆకారణమున విజయరామరాజు చేయు
నది లేక దొరతనమువారికి నీయవలసియున్న పేష్కషు గూడ
బకాయి పెట్టెను. కడకు విజయరామరాజు దొరతనము వారికి
ఆఱులక్షల యిరువదియైదువేల రూపాయలు బాకీపడెను.
అందుచేఁ గంపెనీవారు విజయనగర రాజ్యమును దాము
గైకొని ముప్పదివేలు రొక్కమాఱుగ నిచ్చునట్లును నెలనెలకుఁ
బండ్రెండు వందల రూపాయలు వ్యయములకు ఇచ్చెద మని



యుఁను విజయరామరాజును బందరులో నుండవలసినదనియు
నిర్బంధించిరి. కంపెనీవారు విజయనగర రాజ్యమును ఇతరు
లకుఁ గౌలునకీయ యత్నించిరి. ఎవరును రాకపోయిరి. ఎటు
లైని భేదనీతితో విజయనగర రాజ్యము పరాధీనము గావింప
నన్నివిధముల యత్నించినను లాభము లేక పోయెను.
విజయరామరాజు రాజ్యమునుంచి బందరు పోవుట కెంత
మాత్ర మిష్టము లేక పోయెను. ఆంగ్లేయుల యొత్తిడికి
సహింపజాలక కడకు విజయరామరాజు బందరునకుఁ బ్రయాణ
మయ్యెను. రాజ్యమును విడచి బందరులోఁ బరాధీనముగాఁ
బడియుండ నాతని మనస్సు ఒప్పుకొనకపోయెను. వెంటనే
వెనుకకు మరలి తన రాజ్యమునందున్న సుప్రసిద్ధక్షేత్రరాజమగు
పద్మనాభముఁ జేరెను. అది యాంగ్లేయులు గ్రహించి విజయ
రామరాజును బందరునకుఁ బొమ్మని మిగుల నొత్తిడిచేయు
చుండిరి. ఆయన సమయమున కేదో ప్రత్యుత్తరము వ్రాయుచు
బందరునకుఁ బోడాయెను. కంపెనీవారి కిదియంతయు నవ
మానకరముగా నుంటచే విజయరామరాజునకు ఇరువదినాలుగు
గంటలలోఁ బద్మనాభమును విడిచి బందరునకుఁ బోవలసిన
దనియు అట్లు పోవనియెడల సైనికసహాయమున మేము పంపక
మానమనియు వర్తమానమంపిరి. స్వతంత్రశీలుఁడు పరాక్రమ
శాలియునగు విజయరామరాజున కీసందేశము మిగుల నవమా
నకరముగఁ దోచి రాజ్యమునుండి తన్నంపుటకు కంపెనీవా

రెవరని తిరస్కార వాక్యముల నాడి తిరుగుబాటు చేయుటకుఁ గొంత సైన్యమును సమకూర్చెను. పూర్వాభిమానము జాత్యభిమానముగల నాల్గువేలమంది రాచవారు స్వాతంత్ర్యసంగరమునఁ బ్రాణముల వదలుటకు నిశ్చయించి విజయరామరాజు పక్షమునఁ జేరిరి. రాచవారందఱును బద్మనాభస్వామి దేవళమున సంగరమునఁ బ్రాణమున్నంతవఱకుఁ బాల్గొన వాగ్దానము లొనరించి ప్రసాదమును స్వీకరించిరి. పైవారి యుత్తరువుచొప్పున ఆంగ్లేయ సైనికాధిపతియగు పెండరు గాస్టుగారు సుశిక్షితులగు నేడువందల యేఁబదిమంది భటులతో (క్రీ. శ. 1794 సం॥ జూలయి 10 తేదికి) సూర్యోదయమగుసమయమునకుఁ బద్మనాభమునకుఁ జేరిరి. ఉభయులకు సంధికి వీలుకాకపోయెను. విజయరామరాజు స్వాతంత్ర్యము గోలుపోవుట కించుకేని యంగీకరింపక భటులను సంగరమునకు బురికొల్పి తానును ప్రతిపక్ష సైనికుల నెదిరింప బయలువెడలెను. ఉభయదళములకు ముప్పావుగంటసేపు ఘోరముగా యుద్ధముజరిగెను.

విజయరామరాజువెంట అంగరక్షకులుగా విజయగోపాలరాజు, వత్సవాయినరసరాజు, దాట్ల అప్పలరాజు, రావు జోగయ్య మొదలగు వీరులు పరివారముతోనుండి ఆంగ్లసైన్యమును భేదించుటకు ముందునకుఁ ద్రోవతీయుచుండిరి. అందఱికంటె ముందు దావతుఖాన్ అను యవనుఁడు సైన్యముతో నిబలమునకు ముందుగా నడచుచుండెను. ఇంతసైన్యమునకు మధ్య విజయరామరాజుండి పురోగాములగు వీరులతో 'మిత్రులారా ! మీరు తొందరపడి విరోధులను జెండక ఫిరంగులను బట్టుకొనుఁ' డని చెప్పెను. ఆంగ్లసైనికులు పదివేలు రూపాయలు లంచముసంగి దావూదుఖానును లోఁబఱచికొని తాము సైగఁజేసినంతనే తొలఁగిపోవునటులఁగట్టడిజేసిరి. విజయరామరాజీమోసము తెలియక ఫిరంగులఁబట్టుకొనుటకు సమీపించుసరికి ఆంగ్లేయులసైగ గ్రహించి దావూదుఖాను తన సైన్యముతోఁ బ్రక్కకుఁదొలంగెను. ంగ్లేయులు విచ్చలవిడిగాఁ గాల్పించిన తుపాకులగుండ్లు, ఫిరంగిగుండ్లు తగిలి తన మిత్రులు పరివారముతోఁ గూలిరి. విజయరామరాజు దావూత్ ఖాను గావించిన మోసమునుగూర్చి విచారించుచు సంగరరంగమునకుఁ బోవుచుండ నాకస్మికముగా గుండు చేతిమీఁదఁ దగిలెను. ఎటులో సహించి ముందుకు వచ్చుచుండఁగా రెండు తొడలనుండి గుండ్లుపోయెను. రాజు నిలువఁజాలక తనచెంత నున్న యున్నతాశ్వమునెక్కి పదునేనుమంది వీరభటులగు గుజ్జపురౌతులను వెంబడించుకొని ఫిరంగులమీఁదికిఁబోవుసరికి ఆంగ్లసైనికు లొక్కమాఱు ఫిరంగులుప్రేల్ప అశ్వికదళమంతయుఁ గూలిపోయెను. విజయరామరాజు ఇంకను సాహసము దెచ్చుకొని . తానున్నది 'కాకమానదని తలఁచి ముందునకుఁ బోవుచుండఁగాఁ జాటునుండి ఆంగ్లసైనికులు తుపాకులు

ప్రేల్చిరి. విజయరామరాజు దేహమునందు బలుతావుల గాయములుపడెను. దానికిని లెక్కచేయక వాఁడికత్తితో విరోధిసేన నఱకుచుండెను. ఒడలినుండి రక్తము విశేషముగాఁ గారుచుంటచేఁ గొంతసేపటికి విజయరామరాజు పడిపోయెను. రాజు పడిపోయిన సంగతి వినినంతనే హతశేషులగు సైనికులు చెదరిపాఱిపోయిరి. రాజుస్థితి మిగుల దుస్తరముగా నుండెను. ఒడలంతయు గాయములతో నిండిపోయెను. ఇంతలో నాంగ్లసైనికులు నాలుగైదుతుపాకుల నొక్కమాఱు ప్రేల్చిరి. విజయరామరాజు ఘోరమరణ మొందెను. కర్నలు పెండర్గాస్టు సంగరము నాపివేయించి యుద్ధప్రదేశమును దిలకించుటకు వచ్చెను. మూఁడునందల తొమ్మిదిమంది క్షత్రియ సైనికులు వీరమరణము నొంది పడియుండిరి. విజయరామరాజు చుట్టును కోటగట్టినట్టుల నలువదిమంది క్షత్రియవీరులు తుపాకి దెబ్బలచేఁ జచ్చిపడియుండిరి. వీరమరణ మొందిన యాంధ్ర వీరుల కళేబరములు ఆంగ్లసేనాధిపతికి మిగుల నాశ్చర్యము కలుగఁజేసెను. స్వాతంత్ర్యసంరక్షణము కొఱకు భటునివలెఁ బోరాడి రణరంగమున నొఱగిన విజయరామరాజు త్యాగము పాశ్చాత్యులకు విస్మయము గూర్చెను. ఆంగ్లసైనికులు క్రమశిక్ష గలవారగుటచేతను తుపాకులు ఫిరంగులు లోనగు మారణ పరికరములు సమృద్ధిగా నుంటచేతను విశేషనష్ట మొందక జయించిరి. కంపెనివారిసేనలోఁ బదుముగ్గురు మాత్రమె మర



ణించిరి. అఱువదియొక్కరు గాయపడిరి. మహారాజును స్వాతంత్ర్యప్రియుడును ధర్మమూర్తియు నగు విజయరామరాజు మరణము విని దేశమంతయు నొక్కమాఱు పరితపించెను.

ఆంగ్లసైనికులు విజయరామరాజు దేహముపై నున్న అమూల్యరత్నాభరణములు, దుస్తులు లాగికొనిరి. బొబ్బిలి సంగ్రామములోఁ దాండ్ర పాపారాయునిచేఁ బెద్ద విజయరామరాజుగారు చంపఁబడిన పిదప ముప్పదితొమ్మిది సంవత్సరముల కీసంగరము జరిగెను. ఈ విజయరామరాజు గతింపఁగనే ఆంగ్లేయులు రాజ్యము నాక్రమించుకొనిరి. ఈ ఘోరసంగరవార్త విని రాజ్యమున నున్నఁ దనకేమి యపాయము వాటిల్లునోయని విజయరామరాజుభార్య నారాయణబా బను నామముగల ఎనిమిదిసంవత్సరముల బాలుని దీసికొని మన్నెమునకుఁ బోయెను. ఆంగ్లేయులు ఆబాలుని దల్లిని రప్పించి సంవత్సరమున కింతయని పన్ను గట్టునటుల నేర్పాటుగావించి రాజ్యము నాబాలున కప్పగించిరి.

విజయనగర రాజ్యవిస్తృతియు నైశ్వర్యము స్వాతంత్ర్యాభిలాషయు విజయరామరాజు మరణముతోఁ దగ్గిపోయెను. తరువాత నాకుటుంబమున స్వతంత్రశీలుఁడగు రాజవతంసుఁడు జనించుట కవకాశములు లేకపోయెను. అతివిస్తృతమై యాంధ్రదేశమున కంతటికి నాయకరత్నము కాఁదగిన విజయనగర రాజ్యము క్రమముగాఁ గొంతకొంత

భాగమును గోల్పోవుచుఁ గడకొక చిన్నసంస్థానముగా మాఱి పోయెను. ఆంగ్లేయులు స్వతంత్రరాజులై ఆయుధ పరికరములతో నూతనరాజ్యము స్థాపించుటతో సంస్థానాధీశ్వరులు స్వాతంత్ర్యతృష్ణ చంపుకొని భూస్వాములవలెఁ గాలముగడపుటకియ్యకొనిరి. విజయరామరాజు గతించి చాలకాలమైనను నాతనికీర్తిమాత్ర మజరామరముగా నున్నది. ఆంగ్లప్రభుత్వమువారు అనేక పరిస్థితులలో విద్యానగర రాజ్యము పడిపోవుటకు సిద్ధముగానున్నను దానినిగైకొని సర్వవిధములఁ బాటుపడి నిలువఁబెట్టుటలో నెక్కుడు కృషిసలిపిరని నారాయణబాబు, విజయరామ గజపతిరాజు లోనగు ప్రభువుల చరిత్రములవలన గ్రహింపవచ్చును. ఇప్పుడీసంస్థానరాజ్యము ఆంధ్రవాఙ్మయమునకుఁ, జిత్రకళలకు, ఆంధ్రవికాసమునకు దోహదమొసంగుచు నాంధ్రత్వమును గాపాడుచున్నదని తెలుపుటకెంతయు సంతోషమగుచున్నది.



బెజవాడ వాణీముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది. 1928.

